

54

### శృంగారంలో చురుగ్గా ఉండాలనుందా?

శృంగారంలో సత్తా పెంచుకోవాలని, ఎంత వయసొచ్చినా ఆరోగ్యంతో ఆనందం అనుభవించాలనీ భార్యాభర్తలు గాఢంగా కోరుకోవడం అతి సహజం. కానీ ఆధునిక సమాజంలో ఒత్తిడి అందుకు పర్మిట్ చేయడంలేదు కదూ! ఐతే ఎలా జాగ్రత్తపడాలో తెలుసుకోండి!

8

### జాడలేని పక్షులు-నీడలేని బతుకులు

కాంక్రీట్ జంగిల్ నిర్మాణాలూ, డూప్లెక్స్ ఇళ్ళూ పక్షులకు నిలువనీడ లేకుండా చేశాయి. వాటి మనుగడ ఇప్పుడు ప్రశ్నార్థకంగా మారింది! మనమేం చెయ్యాలి?

46

### సమంత@లవ్

(కొత్త సీరియల్ ప్రారంభం)

వాళ్ళిద్దరూ సాఫ్ట్‌వేర్ ఉద్యోగులే. అతడామెను గాఢంగా ప్రేమించాడు. ఆమెకోసం ఖరీదైన అవకాశాన్ని కూడా వదులుకున్నాడు. మరి అతన్ని ఆమె ప్రేమించిందా? లేదా?

## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



ముఖచిత్రం: సురభి
ఫొటో: గోపీకృష్ణ


రచనలు, కథలు పంపవలసిన చిరునామా
నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్-33. email: navyaweekly@andhrajyothy.com





### జన్మభూమి

రైల్లో దివ్విలాసంగా ఉన్నాడతను. కళ్ళు మూసుకుని ఏవో కీర్తనలు పాడుకుంటున్నాడు. టీటీఇ వచ్చాడు.

"టిక్కెట్ ప్లీజ్" అడిగాడు.

కళ్ళు తెరిచాడతను. సన్నగా నవ్వుతూ టికెట్ లేదన్నట్టుగా చేత్తో సైగ చేశాడు.

"ఎక్కడికి వెళ్ళాలి మీరు?" అడిగాడు టీటీఇ.

"శ్రీరామ జన్మభూమి అయోధ్యకు వెళ్ళాలి."

"అక్కడికి తర్వాత వెళ్దురుగాని, ముందు నాతో రండి, శ్రీకృష్ణుని జన్మభూమి చూద్దురుగాని." అన్నాడు టీటీఇ.

### అమ్మకం

"మీ టూత్‌పేస్టులో ఉప్పు ఉందా?"

"లేదు"

"నిమ్మకాయ ఉందా?"

"లేదు"

"అయితే కష్టం" అని వెళ్ళిపోతున్న అమ్మణ్ణి పిలిచాడతను.

"ఈ పబ్లిసిటీ అంతా మీ టూత్‌పేస్టు అమ్మకాలు పెరగడానికే కదా?"

"అవును"

"నేనో ఐడియా చెప్తాను. అవి కలపండి. అమ్మకాలు బాగా పెరుగుతాయి."

"చెప్పండి"

"టూత్‌పేస్టులో బ్రాందీ విస్కీ కలపండి. రోజుకి నాలాంటి వాళ్ళు అయిదారుసార్లు బ్రష్ చేసుకుంటారు."

### బెటర్

తెల్లారిందో లేదో మేలుకున్నాడు జాలరి. చీకటి చీకటిగా ఉన్నా సముద్రం దగ్గరకు చేరుకున్నాడు.

పడవ తీసుకుని సముద్రంలోనికి వెళ్ళాలంటే... సూర్యోదయం కావాలనుకుని ఇసుకలో కూర్చున్నాడు. ఇసుక మీద రాస్తోంటే గులకరాళ్ళకుప్ప చేతికి తగిలింది. సూర్యోదయం వరకూ ఊసుపోయేందుకు అందిన రాళ్ళను చేతిలో తీసుకుని, ఒకొక్కటీ సముద్రంలోనికి విసరసాగాడు. చేతిలో ఆఖరి రాయి మిగిలింది. అంతలో సూర్యోదయం అయింది. వెలుగులో చేతిలోని రాయిని చూశాడు జాలరి. అది రాయి కాదు. వజ్రం. అంటే... ఇంతవరకూ తాను సముద్రంలోనికి విసిరిన రాళ్ళు రాళ్ళు కావు. వజ్రాలా? గొల్లుమన్నాడు జాలరి.

**(నీతి: అందుకే పొద్దున పొద్దునే లేవకూడదు. బాగా పొద్దు ఎక్కాక లేవడం బెటర్.)**

-వైనతేయ

w m w w

నవ్య

సంపుటి: 13 సంచిక: 14.

8-6-2016

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ



# మొదటి పేజి

## అన్వేషణ

పూర్వం ప్రజ్ఞాపురంలో కుందముడు అనే కుర్రాడు ఉండేవాడు. పదేళ్ళు వాడికి. తల్లి లేదు. చనిపోయింది. తండ్రి మళ్ళీ పెళ్ళి చేసుకోవడంతో పిన్ని వచ్చింది. ఆ పిన్నికి ఈ కుందముడు అంటే ఇష్టం ఉండేది కాదు. వాణ్ణి ఎలాగైనా ఇంటి నుంచి గెంటేయాలనుకునేది. వాణ్ణి గెంటేస్తే ఎంచక్కా చిలకా గోరింకల్లా భార్యాభర్తలిద్దరే ఇంట్లో ఉండవచ్చనుకునేది.

ఒకరోజు గుడిలో హరికథ విని ఇంటికి వచ్చాడు కుందముడు. కథలో హరి ప్రత్యక్షమవ్వడం, కోరిన కోరికలు తీర్చడం విన్నాడు. ఆ కథంతా పిన్నికి చెప్పాడు. చెప్పి, తనకీ హరి ప్రత్యక్షమవుతాడా? అని అడిగాడు. దాన్ని అవకాశంగా తీసుకుంది పిన్ని. తలచుకోవాలేగాని, తపస్సు చెయ్యాలేగాని హరి ఎందుకు ప్రత్యక్షం కాడు? వెళ్ళు! వెళ్ళి ఊరవతల ఉత్తరాన ఉన్న చింతచెట్టు కింద కూర్చుని తపస్సు చెయ్యి! హరి కనిపిస్తాడు అంది. ఆ మాటల్ని కుందముడు గట్టిగా నమ్మాడు. వెళ్ళి పిన్ని చెప్పినట్టుగానే చింత చెట్టు కింద కూర్చున్నాడు. తపస్సు చేయసాగాడు.

తండ్రీ పిన్నీ గతించారు. ఎన్నో ఏళ్ళు గడిచిపోయాయి. అయినా హరి ప్రత్యక్షం కాలేదు కుందమునికి. ఒకరోజు ఆకాశవీధిలో వెళ్తూ కిందకి చూశాడు నారదుడు. చింతచెట్టు కింద ఏకాగ్రతగా తపస్సు చేస్తున్న కుందముడు కనిపించాడతనికి. జాలిపడ్డాడు నారదుడు. పరామర్శించాలనిపించింది. కిందకి దిగాడు. చిక్కి శల్యమైన కుందముణ్ణి పలకరించాడు. హరి ప్రత్యక్షమయ్యాడా? అని అడిగాడు. లేదన్నాడు కుందముడు. వైకుంఠానికి మీరు వెళ్ళేటట్టయితే నా గురించి తెలియజేసి, హరిని కనుక్కోండి! ఎప్పుడు ప్రత్యక్షమయ్యేదీ ఆ మహాపురుషుణ్ణి చెప్పమనండి అన్నాడు. తప్పకుండా అని అక్కణ్ణుంచి నేరుగా వైకుంఠానికే చేరుకున్నాడు నారదుడు.



సిరిదేవితో ముచ్చట్లాడుతున్న హరిని కలిశాడు. అధోలోకాలు అతలం, వితలం, సుతలం, తలాతలం, మహాతలం, రసాతలం, పాతాళాల్లోని కబుర్లన్నీ చెప్పాడతనికి. తర్వాత ఊర్ధ్వలోకాలు భువర్లోకం, సువర్లోకం, మహర్లోకం, జనలోకం, తపోలోకం, సత్యలోకాల సంగతి చెప్పాడు. ఆ తర్వాత భూలోకం గురించి వివరిస్తూ కుందముని విషయానికి వచ్చాడు నారదుడు.

నిన్నే నమ్ముకున్నాడు స్వామి! ఎన్నాళ్ళని నిరీక్షించాలి? ఎప్పుడు అతనికి నీ దర్శనం అని నిలేశాడు. అప్పుడేనా? కుందముడు ఇంకా చాలా ఏళ్ళు తపస్సు చెయ్యాలన్నాడు హరి. చాలా ఏళ్ళంటే...ఎన్నేళ్ళు స్వామీ? అడిగాడు నారదుడు. కుందముడు ఏ చింతచెట్టు కిందైతే కూర్చుని తపస్సు చేస్తున్నాడో ఆ చింతచెట్టుకి గల చింతాకులు ఎన్ని ఉన్నాయో అన్నేళ్ళు అని నవ్వాడు హరి. హతోస్మి అన్నాడు నారదుడు. అక్కణ్ణుంచి నిష్క్రమించాడు. భూలోకానికి వెళ్తే కుందముణ్ణి కలవాల్సి ఉంటుంది. కుందముణ్ణి కలిస్తే హరి చెప్పిన మాట చెప్పాల్సి వస్తుంది. ఆ మాట చెప్పి కుందముణ్ణి నిరాశపరచడం ఇష్టం లేక భూలోకానికి రావడమే మానుకున్నాడు నారదుడు. కొన్నేళ్ళు గడిచాయి. ఒకనాడు భూలోకానికి తప్పనిసరై నారదుడు రావడాన్ని గమనించిన కుందముడు. నారదుణ్ణి పిలిచి, నా సంగతి ఏం చేశావు? హరి ఏమన్నాడు? అని అడిగాడు.

చెప్పడానికి సిగ్గుపడుతూనే హరి చెప్పిన సంగతి చెప్పాడు నారదుడు. ఆ మాట విని కుందముడు విచారిస్తాడని, దుఃఖిస్తాడనీ అనుకున్నాడు. అయితే అందుకు భిన్నంగా ప్రవర్తించాడు కుందముడు. ఆనందించాడు. ఆనందంగా గంతులు వేయసాగాడు. ఆశ్చర్యపోయాడు నారదుడు. చింతాకులు ఎన్నో అన్నేళ్ళు ఇంకా తపస్సు చెయ్యాలయ్యా రెట్టించాడు నారదుడు. తెలుసు! ఇన్నాళ్ళూ స్పష్టత లేకుండా పోయింది. ఇప్పుడు స్పష్టత వచ్చింది. చాలు అన్నాడు కుందముడు. తపస్సు చేసుకునేందుకు సిద్ధమయ్యాడు. సరిగ్గా అప్పుడే అక్కడ ప్రత్యక్షమయ్యాడు హరి. అతన్ని చూసి కుందముడు సంతోషిస్తోంటే, నారదుడు ఆశ్చర్యపోతూ అడిగాడిలా.

నీ దర్శనం కోసం ఇంకా చాలా ఏళ్ళు తపస్సు చెయ్యాలన్నావు కదా స్వామీ! అప్పుడే ప్రత్యక్షమయ్యావేమిటి? అంటే... నా పట్ల కుందముని భక్తికీ, పట్టుదలకీ కరిగిపోయానయ్యా! ఇక ఆలస్యం చేయకూడదనుకున్నాను. ప్రత్యక్షమయ్యాను అన్నాడు హరి. కుందముణ్ణి అనుగ్రహించాడు.

•••

**ఏదో మ్యాజిక్ జరిగి కలలన్నీ నిజమవుతాయనుకోవడం పొరపాటు. అవి నిజం కావాలంటే... పట్టుదల కావాలి. కష్టించి పని చెయ్యాలి.**




## ఉదాసీనతకు చెల్లుచీటీ

ఎవరికి వారే యమునా తీరే! అన్నట్టుగా మారిపోయింది మన చుట్టూ ఉన్న సమాజం. రోడ్డు మీద ప్రమాదం జరిగితే మనకెందుకులే! అని చూస్తూ వెళ్లిపోయేవారే ఎక్కువ. మానవతా దృక్పథం లేని అలాంటి ఉదాసీనతకు ఇక చెల్లుచీటీ ఇమ్మంటోంది నుపుర్.

ఆమె ఒక ఫోటోగ్రాఫర్, ఫ్రీలాన్స్ రైటర్. సొంతూరు థానే. నివాసం ముంబై. ఆరోజు పనిలో పడి టైం చూసుకోలేదు నుపుర్. లేటైపోయింది. అర్ధరాత్రి దొరికిన ఆటో ఎక్కేసింది. ఆటోలో పాటలు వింటూ, ఫోన్‌లో మెయిల్స్ చెక్ చేసుకుంటోంది. డ్రైవర్ నిద్రమత్తులో ఆటో నడుపుతున్నాడు. సడన్‌గా ఏం జరిగిందో తెలియలేదు. ఆటో ఓ బంపర్‌ని గుద్దేసింది. నుపుర్ ఆటోలో నుంచి రోడ్డుమీదకొచ్చి పడింది. చుట్టూ జనం చేరారుగానీ సహాయానికి ఒక్కరూ ముందుకు రారే! కొంత మంది ఫోటోలు తీస్తున్నారు. 'డ్రైవర్ నిన్ను రేప్ చేశాడా?' అని కొందరు అడుగుతున్నారు. ఆ స్థితిలో నుపుర్‌కు వీళ్ళా మనచుట్టూ ఉన్న మనుషులు అనిపించింది. ఆఖరికి ఓ మహానుభావుడు ముందుకొచ్చాడు. పోలీసు వ్యాన్‌లో ఆమెని ప్రభుత్వ ఆస్పత్రికి తీసుకువెళ్ళారు. కానీ హాస్పిటల్ స్టాఫ్ ఆమెను ట్రీట్ చేసే మూడ్‌లో లేరు. నొప్పి భరించలేక ఆమె పెడుతున్న కేకలు వారిని కదిలించలేదు. ఆమె కుడికన్ను నుంచి రక్తం కారుతోంది. అద్దం ముక్కలు ఆమె శరీరంలో ఎక్కడబడితే అక్కడ కనిపిస్తున్నాయి. విషయం తెలుసుకున్న నుపుర్ తల్లిదండ్రులు అక్కడికెళ్ళి ఆమెను వేరే హాస్పిటల్‌కు తీసుకువెళ్ళారు. కంటి ఆపరేషన్ చేశారు. ఎడమకాలిలో రాడ్ వేశారు. ఆమె ముఖం బాగా డ్యామేజ్ అయింది. ముఖ సౌందర్యం కోల్పోయిన కూతురు డిప్రెషన్‌లోకి వెళ్ళిపోతుందేమోనని తల్లిదండ్రులు భయపడ్డారు. కానీ నుపుర్ ధైర్యాన్ని కోల్పోలేదు. వాస్తవాన్ని అంగీకరించి తిరిగి జీవితాన్ని పొందాలనే దృఢ సంకల్పం, మనోధైర్యం ఆమెను మామూలు మనిషిని చేశాయి. ఎన్నో సర్జరీలు జరిగాయి. ఆమెను ట్రీట్ చేసిన డాక్టర్ సావరీ, డిశ్చార్జ్ రోజున నుపుర్ మనోధైర్యాన్ని, ఆత్మనిగ్రహాన్ని, చీకటిలో కూడా కాంతిని వెతుక్కునే దృఢసంకల్పాన్ని కొనియాడారు. లిఖితపూర్వకమైన ప్రశంసలు అందజేశారు. కళ్ళముందు జరిగేవాటిని ఉదాసీనంగా చూస్తూ తప్పించుకుపోవద్దని చెబుతున్న నుపుర్ ఆత్మస్థైర్యానికి హ్యాట్సాఫ్!



# మెయిల్ బాక్స్

### మార్నింగ్ కాఫీ నవ్వించింది

మార్నింగ్ కాఫీ స్కిట్లు నవ్వించాయి. గడచిన జ్ఞాపకాలే మనకు జీవితానందాన్నిచ్చే వరప్రసాదాలని మొదటిపేజీ తెలియజేసింది. వైన్ పుట్టు పూర్వోత్తరాలను అవగాహనా సహితంగా అందించారు. నాన్న రాసిన ఆఖరి ఉత్తరం కథాకర్త బెజ్జారపు వినోద్‌కుమార్‌గారికి అభినందనలు. బాచీగారి కార్టూన్లన్నీ చాలా బాగున్నాయి. జర్మనీలో మాత్రం బాహుబలి ఫ్లాప్ కావడం ఆశ్చర్యం కలిగించింది.

-నేమాన సుభాష్‌చంద్రబోస్, విశాఖపట్నం

### కాశీయాత్ర బాగుంది

కాజల్ ముఖచిత్రం, లావణ్యా త్రిపాఠి ఇంటర్వ్యూ బాగున్నాయి. కంరుగాడి కాశీయాత్ర బాగుంది. బైరాగి ఆకస్మిక ప్రవేశం ఆసక్తికరంగా ఉంది. అడపాదడపా, మార్నింగ్ కాఫీ స్కిట్లు బాగా నవ్వించి వినోదం పంచాయి. నవ్య సినిమా సంగతులు, నెంబర్ గేమ్‌పై సమంత అభిప్రాయాలు బాగున్నాయి. వావ్‌లో విద్యార్థినుల ఆలోచన ఆచరణ స్ఫూర్తిదాయకం. మధ్యాహ్నం వచ్చిన వాన కవిత అర్థవంతంగా ఉంది. మనకి తెలియని యానిమల్ వరల్డ్ వ్యాసం ఉత్కంఠభరిత విశేషాలతో ఆకట్టుకుంది. రెడ్‌వైన్ గురించి చాలా విషయాలు చెప్పారు. ఉద్యోగులైన ఆలుమగలు ఒత్తిడిని అధిగమించి మనస్పర్థలులేకుండా ఎలా మెలగాలో వ్యాసంలో బాగా వివరించారు. రచయితగా ఎమ్మెస్ సాధించిన విజయాలు స్ఫూర్తినిస్తాయి. భలే రాముడులో చిన్న సావిత్రిగా నటించిన సచ్చు ఈనాటికీ మరిచిపోలేని తార. ఇవన్నీ నిజాలే ఆసక్తికరంగా ఉన్నాయి. సురభిలో నేపాల్‌లో కుక్కల పండుగ, అవ్వలబడి, రోడ్లులేని పెద్ద నగరం, అలరించవచాయి. హెల్త్ విషయాలు ఆసక్తికరం. కథా కలశం పుస్తక సమీక్ష ఆసక్తికలిగించింది. మంచుతల్పం, స్ఫూర్తి, నాన్న ఆఖరి ఉత్తరం కథలు బాగున్నాయి.

-మాధవరపు కృష్ణ, కాకినాడ

### అలాంటి భోషాణం మాకు లేదే!

జీవితం అంటేనే అనుభూతులు, జ్ఞాపకాలు, అల్లరి, ఆనందాలు. అవన్నీ భోషాణం నిండా నింపుకుని జీవిత సత్యాన్ని నిరూపించిన మాస్టారి మొదటిపేజీ కథ చదివితే మాకు లేదుకదా అలాంటి భోషాణం అనిపించింది. మనకు తెలియని యానిమల్ వరల్డ్ గురించి ఎన్నో వింత విషయాలు ఆసక్తికరంగా చెప్పి అలరించారు. తరచి చూస్తే ప్రపంచంలో ఎన్ని వింతలో కదా!

-కె.సాహిత్యదీప్తి, రమణయ్యపేట. తూ.గో.జిల్లా

### చెరగని తీపిజ్ఞాపకాలు

జీవితంలో చెరగని ముద్రలు తీపి జ్ఞాపకాలు. ఆ అనుభూతులు ఎంతో మధురం అనే వైనాన్ని జీవితానందాన్నీ మొదటిపేజీలో చక్కగా చూపించారు. ఆడపాదడపా నవ్వబ్బా సో సింప్లిసిటీ. ఫన్నీ. కార్టూన్లు సూపర్. వైన్ అంటే డివైన్ లాంటిది...లో నీతి సూత్రాన్ని చక్కగా వివరించారు. మనకు తెలియని యానిమల్ వరల్డ్ లోని జంతువుల గురించి పరమాద్భుతంగా చెప్పారు. గుమ్మడి ఘుమ ఘుమలు నోరూరించాయి. మంచుతల్పం కథ ఆదర్శవంతం. ఫీచర్స్, సీరియల్స్, కథలు వేటికవే సాటి.

-యు.చిట్టిబాబు, న్యూ పాల్వంచ. ఖమ్మంజిల్లా

### సురభి వింతలు

సురభిలో అన్నీ వింతలే. అన్నీ విశేషాలే. భలే రోడ్, కుక్కల పండుగ, రోడ్డే లేని నగరం ఆకట్టుకున్నాయి. ఇల్లూ, ఆఫీసూ రెంటినీ సమన్వయం చేసుకోవడం ఎలా అనే వ్యాసం ఉద్యోగం చేసే గృహిణులకు ఎంతో ఉపయుక్తం. మాటే మంత్రం, వాక్కే భూషణం అంటూ విజయాన్ని సాధించడానికి చక్కని పాయింట్స్ చెప్పారు. పాటిస్తే విజయం తథ్యం. గ్రాఫిక్స్ అంత ఈజీకాదు, వందలాదిమంది నెలల తరబడి శ్రమించాలి.

-కె.గున్నేష్, కొవ్వాడ. తూ.గో.జిల్లా

### వ్యాసాలు అద్భుతం

వీక్లీలో ఇటీవలకాలంలో వ్యాసాలు అద్భుతంగా ఉంటున్నాయి. ఎన్నో వింతలూ, విడ్డూరాలూ, ఎడ్యుకేట్‌చేసేవిధంగా రాస్తున్నారు. వైన్ గురించి, యానిమల్ వరల్డ్ గురించి ఎన్నో తెలియని విషయాలు ఈ వారం చెప్పారు. గతవారం ఆరోగ్యదేవతలు మన నర్సులు వ్యాసం ఎంతో ఆకట్టుకుంది. నర్సుల గురించి పట్టించుకోని రోజులివి. వారి గురించి తెలియజేశారు. అభినందనలు.

-పోసి, హైదరాబాద్

### ఆకట్టుకున్న నిజాలు

ఇవన్నీ నిజాలేలో అన్ని అంశాలు ఆకట్టుకున్నాయి. 40 వేల మైళ్ళ వరకు చూడగల భారీ టెలిస్కోప్, బీజింగ్ వీధుల్లో కోటి సీసీ కెమెరాలు, నీటి గుర్రం పొట్ట 10 అడుగులు, గొర్రెల కాపలాకు బాతులు వంటి అంశాలు ఆకర్షించాయి. ఇంఫాల్ మార్కెట్ కథనం సూపర్. మన నర్సులు, వింత మ్యూజియములు స్పెషల్ ఫీచర్లు ఆసక్తిగా చదివించాయి. ఆరోగ్యాన్ని సంరక్షించే కొబ్బరి, చెరకు రసాలపై అవగాహన పెరిగింది.

-టి.సత్యనారాయణమూర్తి, విశాఖపట్నం-11

### వాగ్భూషణం భూషణం

విజయవిలాసంలో మాటకున్న శక్తిని సవివరంగా తెలియజేశారు. సంస్కారవంతమైన మాటే నిజమైన అలంకారం. దుర్భాషలాడాక పశ్చాత్తాప పడినా ఆ మాటలను వెనక్కు తీసుకోలేమని తెలుసుకున్నాం. వినయమే భూషణమని సోదాహరణంగా తెలియజేశారు. టీనేజ్ పిల్లలతో ప్రేమపూర్వకంగా మాట్లాడే మాట ఫలితాన్ని స్తుందని తెలుసుకున్నాం. వివేకానందుని వాక్పటిమ అందరికీ ఆదర్శం. మంచుతల్పం కథ సైనికులపై గౌరవాన్ని పెంచింది.

-సరికొండ శ్రీనివాసరాజు, వనస్థలిపురం, హైదరాబాద్

ప్రైమ్ హాస్పిటల్స్
హైదరాబాద్, 040-4959 4959



డా॥ జి. సతీష్ రెడ్డి
MS. M.Ch. (Ortho) (UK)
Orthopedics & Joint Replacement Specialist
ప్రైమ్ హాస్పిటల్స్, హైదరాబాద్
ఫోన్. 91777 00141

# మహిళల్లో కీళ్ల నొప్పుల (రుమటాయిడ్ అర్థరైటీస్) సమస్యకు చికిత్స అవసరమా!



మన కీళ్లు తెలియకుండానే వంగిపోతూ రోజువారీ పనుల్లో పాల్గొంటాయి. అవి ఏదైనా కారణాలతో వంగక తీవ్రమైన నొప్పి లేదా వాపు వస్తేగానీ కీళ్లకు సమస్య వచ్చినట్లు మనకు తెలియదు. కీళ్లనొప్పుల్లో సుమారు వంద రకాలు ఉంటాయి. అందులో ప్రధానమైనవి ఒకటి ఆస్టియో అర్థరైటీస్, కీళ్ల నొప్పులు. వయస్సు పెరిగిన వారిలో ఈ సమస్య ఎక్కువగా కనిపిస్తుంది. రెండవది రుమటాయిడ్ అర్థరైటీస్, చిన్న కీళ్లలో వచ్చే నొప్పులు. ఇది మహిళల్లో ఎక్కువగా కనిపిస్తుంటుంది. సమస్యను సకాలంలో గుర్తించి చికిత్స చేయించుకుంటే మెరుగైన ఫలితాన్ని పొంద గలుగుతారు.

**ఎలా గుర్తించాలి...?** రుమటాయిడ్ అర్థరైటీస్ మహిళల్లో అధికంగా వస్తుంటుంది. పిల్లలు, పురుషులు, వృద్ధులలో కూడా అరుదుగా ఈ సమస్య వచ్చే అవకాశం ఉంది. ఈ సమస్య మెట్లు ఎక్కుతున్నప్పుడు కీళ్లలో నొప్పి రావడం. కుర్చున్నప్పుడు, కూర్చుని లేచినప్పుడు, నడుస్తున్నప్పుడు కీళ్లలో నొప్పి రావడం వంటి లక్షణాలు కనిపిస్తాయి. కొంతకాలంగా ఈ లక్షణాలు కనిపిస్తూ కీళ్ల నొప్పులు తగ్గకపోతే ఏమాత్రం ఆలస్యం చేయకుండా వెంటనే వైద్యులను సంప్రదించాలి. రుమటాయిడ్ అర్థరైటీస్ సమస్య వల్ల చర్మం, కళ్లు, ఊపిరితిత్తులు, గుండె, రక్తనాళాలపై ప్రభావం చూపే ప్రమాదం ఉంది.



**ఆందోళన కలిగిస్తున్న గణాంకాలు:** ప్రపంచ ఆరోగ్య సంస్థ, ఇంటర్నేషనల్ లీగ్ ఆఫ్ అసోసియేషన్ ఫర్ రుమటాలజీ ప్రకారం భారతదేశంలో సుమారు ఐదు మిలియన్ల మంది రుమటాయిడ్ అర్థరైటీస్‌తో బాధ పడుతున్నారు. ఈ సమస్య మధుమేహం, రక్తపోటు, గుండె జబ్బులు తదితర సమస్యలతో ముడిపడి ఉండటంతో కచ్చితమైన గణాంకాలు తెలుసుకోలేకపోతున్నారు.

**మహిళల్లో అధికం:** జన్యుపరమైన కారణాలతో పాటు హార్మోన్ల అసమతుల్యత, ఉబకాయం వంటి కారణాల వల్ల మహిళలు ఎక్కువగా ఈ సమస్య బారినపడు తున్నారు. ఆస్టియో అర్థరైటీస్ తర్వాత మహిళలు అధికంగా రుమటాయిడ్ అర్థరైటీస్‌తోనే బాధపడుతున్నారు. తాజా అధ్యయనాల ప్రకారం కొన్ని ప్రత్యేకమైన కారణాల వల్ల మహిళలు అధికంగా రుమటాయిడ్ అర్థరైటీస్ బాధపడుతున్నట్లు తేలింది. గర్భధారణకు సిద్ధమవుతున్న మహిళలు, డెలివరీ కాబోతున్న, డెలివరీ అయిన మహిళలు, పిల్లలకు పాలిచ్చే తల్లులు వారి ఆరోగ్య సమస్యలను వైద్యులతో చర్చించి, వైద్యుల సలహాలు, సూచనలు పాటిస్తూ మందులు వాడాలి. మహిళల్లో త్వరగా మెనోపాజ్ దశ తలెత్తడం వల్ల రుమటాయిడ్ అర్థరైటీస్‌తో వచ్చే సమస్య ఉంటుంది. సాధారణంగా మహిళలు 45 ఏళ్ల వయస్సులో మోనోపాజ్ దశ వస్తుంటుంది. అలా కాకుండా 40 ఏళ్ల వయసులోనే త్వరగా మోనోపాజ్ దశ తలెత్తిన మహిళల్లో ఈ సమస్య వచ్చే అవకాశాలు ఎక్కువగా ఉంటుంది.

**వ్యాధిని ఎదుర్కోవడం ఎలా..?** రుమటాయిడ్ అర్థరైటీస్‌ను పూర్తిగా నయం చేయడం కంటే దానిని అదుపులో ఉంచుకోవడమే ప్రస్తుతం అందుబాటులో ఉన్న ప్రక్రియ. రోగి, వ్యాధి పట్ల సరైన అవగాహన పెంపొందించుకుని వైద్యులు సూచించిన జాగ్రత్తలు పాటించడం ద్వారా ఈ సమస్యను అదుపులో ఉంచుకోవచ్చు. వైద్యులు సూచించిన మందులను మాత్రమే వాడాలి. మందులు వాడుతున్న సమయంలో ఏమైనా ఆరోగ్య సమస్యలు తలెత్తినా, దుష్ప్రభావాలు కనిపించినా వెంటనే వైద్యులను సంప్రదించి సలహాలు, సూచనలు పాటిస్తూ ఆహారపు అలవాట్లలో మార్పులు చేసుకోవాలి.

**మీ కీళ్లను కాపాడుకోండి:** క్రమం తప్పకుండా ప్రతిరోజు నడవడంగానీ, వ్యాయామం చేయడంగానీ చేయాలి. ముఖ్యంగా ఒత్తిడికి దూరంగా ఉండేందుకు ప్రయత్నించాలి. అందుకు యోగా, మెడిటేషన్, బ్రీతింగ్ ఎక్సర్‌సైజులు వంటివి చేయడం మంచిది. చేపలు, స్ట్రాబెరీ, ఫైబర్, ఎక్కువగా ఉండే పండ్లు, కూరగాయలు, గింజలు వంటివి ఎక్కువగా తీసుకోవాలి. ఆరోగ్య కరమైన ఆహారపు అలవాట్లు కలిగి ఉండటం శ్రేయస్కరం. ■



# జాడలేని పక్షులు నీడలేని బతుకులు

**ఒకప్పుడు నిర్మలమైన ఆకాశంలో వేలాది పక్షులు సందడి చేసేవి. పక్షుల కిలకిలారావాలతోనే మేలుకొలుపు జరిగేది. వీనుల విందుచేసే పక్షుల్నీ, శూన్యాకాశంలో రెక్కల రంగుల్నీ చూసేందుకే అందమైన ఉదయాల్నీ, సాయంత్రాల్నీ పిల్లలూ, పెద్దలూ ఆస్వాదించేవారు. వాటికోసం కాచుక్కూర్చునేవారు. ఇప్పుడవన్నీ కేవలం జ్ఞాపకాలే. కాంక్రీట్ జంగిల్ నిర్మాణాలు, డూప్లెక్స్ ఇళ్ళ ప్రపంచాన్ని చూసి పాలపిట్ట పారిపోయింది. పచ్చని చిలుక ప్రాణాలు విడిచింది. చివరి పిచ్చుక చిరునామా పోగొట్టుకుంది. కరెంటు తీగలపై కాకుల కచేరీ కాలగర్భంలో కలిసిపోయింది. పచ్చని చెట్లే కరువైతే ఇక కోయిల రాగాలకు దిక్కేది? పక్షుల మనుగడ ఇప్పుడు ప్రశ్నార్థకం!**

పట్టణాల్లోనే కాదు పల్లెల్లోనూ గూడుకట్టేందుకు చెట్టు లేదు. ఇదిలాగే కొనసాగితే జీవావరణ సమతుల్యం దెబ్బతింటుంది. దానివల్ల ప్రతికూల పరిస్థితులు ఏర్పడతాయి. ఇప్పుడు మనకు కనిపిస్తున్నవి కొన్ని పక్షులే. మిగతా వాటిని ఇంటర్నెట్‌లోనో, పుస్తకాలు, ఫోటోల్లోనో చూసుకోవాల్సిందే. ఇప్పటికైనా కనీసం మిగిలిన పక్షుల్ని గూడూ, నీరు, కొంచెం ఆహారం సమకూర్చి జాగ్రత్తగా సంరక్షించుకోమంటున్నారు పక్షి ప్రేమికులు. వాటి మనుగడకు చిన్న చిన్న జాగ్రత్తలు తీసుకుంటే సరిపోతుంది. మరి అలాంటి జాగ్రత్తలతో పక్షి జాతుల్ని కాపాడుతున్న సంస్థలు, వ్యక్తుల గురించి తెలుసుకుందాం.

### విద్యార్థులే మార్గదర్శకులు

కర్నాటక రాష్ట్రం బీదర్‌లో ఇద్దరు యువకుల కృషి ఫలితంగా నేడు ఆ ప్రాంతం పక్షుల కిలకిలారావాలతో సందడిసందడిగా ఉంది. వినాయక్ పోస్ట్ గ్రాడ్యుయేట్ విద్యార్థి. పక్షులంటే పిచ్చి. తెల్లవారుజామున పక్షుల రాగాలతో నిద్రలేచే వినాయక్‌కి క్రమంగా వాటి శబ్దాలు తగ్గుతున్నట్లు అనిపించింది. ఊళ్ళో కనిపించే పక్షుల సంఖ్య తగ్గిపోయింది. కారణాలు అన్వేషించాడు. చివరికి చెట్లు నరికేయడం, ఆహారం, నీళ్ళు లభించకపోవడమే కారణమని తెలుసుకున్నాడు. ఒక చిన్న ఐడియాతో వాటికి బతుకునిచ్చాడు. ఇంతకీ అతను చేసిందేమిటంటే వాటికోసం రెండు చిన్న గిన్నెల్లో ధాన్యం, నీళ్ళు తమ ఇంటి పక్కనున్న ఖాళీ ప్రదేశంలో ఉంచాడంతే! మరుసటిరోజు పక్షుల కిలకిల రావాలతో శుభోదయం ఆరంభమైంది. ఇక గిన్నెల్లో ఆహారం, నీళ్ళు పెట్టడం నిత్యకృత్యమైంది వినాయక్‌కి. అదే ఊళ్ళో ఇంజనీరింగ్ విద్యార్థి సాయినాథ్ శర్మ కూడా తమ ఇంటి గార్డెన్‌లోనే పక్షులకు ఆహారం, నీళ్ళు అందించాడు. మరో అడుగు ముందుకేసి ఫోన్‌లో పక్షుల ధ్వనులను రికార్డ్ చేశాడు. వాటిని గార్డెన్‌లోని పొదలలో ఉంచి ప్లే చేసేవాడు. ఆ శబ్దాలకు మరికొన్ని పక్షులు అక్కడ వాలేవి. వాటి ధ్వనులే కాదు అన్ని పక్షులను ఒక్కచోట అలా చూస్తే మనస్సుకు ఉల్లాసం కూడా అంటాడు సాయినాథ్! వీళ్ళిద్దరినీ చూసి ఊళ్ళోని మిగతావారు కూడా పక్షులకు ఆహారం, నీళ్ళు అందించడం ప్రారంభించారు. మొత్తానికి ఇప్పుడు బీదర్‌లో పక్షుల కోసం వెతుకులాడే రోజులు పోయాయి. ఎక్కడ చూసినా, ఎటు చూసినా పక్షులు కనువిందు చేస్తున్నాయంటున్నారు ఆ ఊరి ప్రజలు.

### హార్న్‌బిల్స్ పెరిగాయి

పిచ్చుక గూళ్ళు కట్టుకొని ఆటలాడుకునేవారు పిల్లలు. కానీ నేడు ఏవి ఆ ఆటలు? ఆటలే కాదు గూడే కానరావడం లేదు. గిజిగాడి అందమైన గూడు నిర్మాణం గురించి ఈ కాలం పిల్లలెంత మందికి తెలుసు? అందుకే పక్షి గూళ్ళను కాపాడే ఉద్దేశంతో వాటిని దత్తత తీసుకొని రక్షిస్తున్నారు అరుణాచల్‌ప్రదేశ్‌లోని నైషి తెగ ప్రజలు. వాళ్ళకి ప్రేరణ, పునాది అంతా పూనేవాసి అమృతా రానే! అరుణాచల్‌ప్రదేశ్‌లో హార్న్‌బిల్ పక్షులు అంతరించిపోవడం గమనించిన అటవీ అధికారులు వాటిని సంరక్షించాల్సిందిగా ఆ ప్రాంత వాసులను ప్రోత్సహించారు. ఆ ప్రోత్సాహానికి అమృతా రానే తోడయింది. కావలసిన సలహాలు, జాగ్రత్తలు, పక్షి గూళ్ళను ఎలా సంరక్షించాలి వంటి అంశాల్లో నైషి తెగవారికి అవగాహన కల్పించిందామె. ఎవరైతే హార్న్‌బిల్ గూడును దత్తత తీసుకుంటారో వారికి పక్షి గూడును సంరక్షించడానికి అవసరమయ్యే ఆర్థిక సహాయం కూడా అందిస్తారు.





### పక్షులకోసం చెట్లపై గూళ్ళు సిద్ధం

పక్షులు ఉండాలంటే గూళ్ళు కావాలి. ఈ ఆలోచనతోనే ఓ ఎన్‌జీవో ఉచితంగా గూళ్ళను పంపిణీ చేయటం మొదలుపెట్టింది. నాగపూర్‌లో యశోధర ఫౌండేషన్ జీవావరణ సమతుల్యంపై అవగాహన పెంచి పక్షి జాతులను కాపాడేందుకు నాలుగేళ్ళుగా ఈ కార్యక్రమం చేపట్టింది. మొదట దాదాపు వెయ్యికిపైగా గూళ్ళు తయారుచేసి ఎగ్జిబిషన్స్‌లో, ఇతర కార్యక్రమాల్లో ప్రదర్శించారు. గూడు కోసం రిజిస్టర్ చేసుకున్నవారికి ఈ సంస్థ రిప్రజెంటేటివ్ ఒకరు స్వయంగా వారింటికి వెళ్ళి, గూడును ప్రతిష్ఠించి వస్తారన్నమాట. ఇలా చేసినందుకు ఎటువంటి ఫీజు వసూలు చేయరు. కానీ తీసుకున్న గూడుని చక్కగా మెయింటెయిన్ చేయమని మాత్రం చెబుతారు. ఇలా ఇప్పటి వరకు దాదాపు 1600 గూళ్ళు ఏర్పాటుచేశారు. 2016 చివరికల్లా మరో వెయ్యి గూళ్ళు ఏర్పాటుచేసే ఉద్దేశంలో ఉంది ఈ సంస్థ. అంతేకాదు స్కూళ్ళల్లో, కాలేజీల్లో ఈ సంస్థ వర్క్‌షాప్‌లు నిర్వహిస్తోంది. పక్షులకు ఆవాసాన్ని ఎలా ఏర్పాటు చేయాలో ఈ వర్క్‌షాపుల్లో చేసి చూపిస్తారు.

### సేవ్ ద బర్డ్స్ ప్రచారం

సంక్రాంతి వచ్చిందంటే పతంగుల సందడి మొదలవుతుంది. ఇది ఒక సంప్రదాయంగా నేటికీ కొనసాగుతోంది. అయితే వాటిని ఎగరేయడానికి ఉపయోగించే మాంజాల వల్లే అసలు ఇబ్బందంతా! జనవరిలో సేవ్ ద బర్డ్స్ క్యాంపెయిన్ వారు విడుదల చేసిన రిపోర్టులో వాళ్ళు దాదాపు 1728 పక్షులను గాలిపటాల బారినుంచి కాపాడినట్లు వెల్లడించారు. వీటిల్లో పెల్లికాన్, కొంగలు, రాబందులు వంటి ఎన్నో పక్షిజాతులున్నాయి. మాంజా దెబ్బకు ఎన్నో పక్షులు రెక్కలు తెగి విలవిలలాడుతున్నాయని వాపోతున్నారు. ఉత్తరాయణ్ పతంగుల పండుగ సందర్భంగా పక్షులను రక్షించడానికి 24 హెల్ప్‌లైన్ ఏర్పాటుచేశారు. 22 ఎన్‌జీవో సంస్థలు, 102 మంది వైద్యులు గాయపడిన పక్షులకు చికిత్స అందించటానికి కృషిచేశారు. కానీ ఒక సంప్రదాయం కారణంగా పక్షులు విలవిల్లాడటం నిజంగా విచారకరం.

### పక్షులే వారసత్వ సంపద

కర్నాటక రాష్ట్రం మాండ్య జిల్లా కొక్రబెళ్ళూరుకు ప్రతి సంవత్సరం కొంగలు వలస వస్తుంటాయి. తగ్గిపోతున్న వలస పక్షుల సంఖ్యను దృష్టిలో ఉంచుకుని, ఈ ఊరివాళ్ళు కొంగలను దత్తత తీసుకున్నారు. వాటిని వారసత్వ సంపదగా భావిస్తారు ఆ ఊరివాళ్ళు. ప్రతి సంవత్సరం వాటి రాక కోసం ఎదురు చూస్తుంటారు. అంతేకాదు కొంగలు వదిలే వేస్టేజ్‌లో ఫాస్ఫరస్, పొటాషియం అధికంగా ఉండి వ్యవసాయం మూడు పువ్వులు ఆరుకాయలుగా వర్ధిల్లుతోంది. ఎంతగా వాటిని దత్తత తీసుకున్నా, ఎంతగా వాటివల్ల ఉపయోగాలున్నా, వాటివల్ల పంటలు నాశనమవుతున్నాయంటున్నారు ఆ గ్రామ ప్రజలు. అయితే ప్రభుత్వం వాటివల్ల జరిగే నష్టానికి నష్టపరిహారం ఇవ్వడానికి అంగీకరించింది.

### దత్తత జాబితాలో చెట్లు!

అస్సాంలోని సెన్సోవా, కుటికోటియా గ్రామాల్లోని స్త్రీలు అక్కడి చెట్లపై వేటు పడనివ్వరు. స్థానికంగా హర్గీలా అని పిలిచే స్టార్క్ (కొంగజాతి) పక్షులను కాపాడేందుకే ఇదంతా. ఆ పక్షులు అక్కడి సిల్క్ చెట్ల మీద గూళ్ళు కట్టుకుని గుడ్లు పొదిగి సంతానాన్ని వృద్ధి చేసుకుంటాయి. అయితే ఇష్టం వచ్చినట్టు అక్కడి చెట్లను నరకడం వల్ల ఆ జాతి అంతరించిపోయే దశకు చేరుకుంది. ఐక్యరాజ్య సమితి కూడా వాటిని అంతరించిపోయే పక్షుల జాబితాలో చేర్చింది. ఇది గమనించిన ఆ రెండు గ్రామాల్లోని స్త్రీలు తమని తాము హర్గీలా ఆర్మీగా పిలుచుకుంటూ వాటిని రక్షిస్తున్నారు. ఆ గ్రామాల్లో ఒక్కొక్క స్త్రీ ఒక్కొక్క చెట్టును, చెట్టుమీద ఉన్న ఆ పక్షి గూళ్ళను కూడా కాపాడుతుంటారు! 2008లో ఈ పక్షుల మీద పీహెచ్‌డీ చేసేందుకు వచ్చిన పూర్ణిమాదేవి స్టార్క్ పక్షుల సంఖ్య తగ్గిపోవడం గమనించింది. అరణ్యక్ అనే ఎన్‌జీవో ద్వారా ఆ గ్రామస్థులలో పక్షుల సంఖ్య తగ్గిపోవడం పట్ల అవగాహన కలిగించింది. గ్రామాల్లో స్త్రీలు సానుకూలంగా స్పందించారు. చెట్లను, చెట్ల మీద ఉన్న గూళ్ళను దత్తత తీసుకున్నారు. ఇప్పుడు ఆ గ్రామాల్లో చెట్లు స్టార్క్ పక్షుల గూళ్ళతో కళకళలాడుతున్నాయి.

ఈ విధంగా పక్షుల సంరక్షణకు ఎవరికి వారే స్వచ్ఛందంగా ముందుకు రావాలి. అప్పుడే భవిష్యత్తు తరాలకు కూడా ఈ పక్షుల్ని నేరుగా చూపించగలం, వాటి గురించి చెప్పగలం. లేదంటే వాటిని కూడా బొమ్మల్లో చూసుకుని మురిసిపోవాల్సిందే!

-లక్ష్మీనర్మద

## సంరక్షణ ఇలా....

పక్షుల సంరక్షణ అనగానే ఎంత డబ్బు ఖర్చుపెట్టాలో అని కంగారుపడకండి. ఎందుకంటే అదేమీ ఖర్చుతో కూడుకున్న వ్యవహారం కాదు. కాస్త ఆలోచించాలే కానీ తక్కువ ఖర్చుతో ఇంట్లోనే చిన్నచిన్న ఏర్పాట్లు చేయడం ద్వారా పక్షుల్ని సులభంగా సంరక్షించుకోవచ్చు.

- మన నివాసం చుట్టూ ఎక్కడ అనువుగా ఉన్నా మొక్కలు, చెట్లు పెంచడం
- ఇళ్ళు, అపార్ట్‌మెంట్లలో పక్షుల ఆశ్రయం కోసం ఆవాసాలు, బర్డ్ ఫీడర్లు ఏర్పాటుచేయడం.
- మూగజీవాల కోసం గుప్పెడు ధాన్యం గింజలు చల్లడం
- ముఖ్యంగా వేసవిలో పక్షులు తాగేందుకు మట్టికుండల్లో కాసిని నీళ్ళు పోసి అమర్చడం.



## గూడు ఏర్పాటు చేయండి

కేవలం నీరు, ఆహారం విషయంలోనే కాకుండా వాటికి గూడును కూడా ఇంట్లో ఉండే వస్తువులతోనే ఏర్పాటుచేయవచ్చు. వెంటిలేటర్ దగ్గర లేదా మేడలు, చెట్ల దగ్గర బాక్స్ ఆకారంలో ఉన్న చిన్న అట్టపెట్టెను తీగతో కట్టి ఒక చిన్న గూడులా మనమే ఏర్పాటు చేయవచ్చు. లేదా పక్షులే స్వయంగా వాటికి అనువైన గూడు నిర్మించుకునేందుకు కావాల్సిన ఈకలు, పీచు, చిన్న చిన్న పుల్లలను వాటికి కనిపించేలా ఉంచితే, అవే తీసుకెళ్ళి చక్కగా గూడు కట్టుకుంటాయి. అయితే సూర్యరశ్మి, వర్షం ఎక్కువగా ఉండేవైపు మీరు నిర్మించే గూడు అమర్చకుండా చూసుకోవాలి. అప్పుడే ఆ గూడు ఎక్కువ కాలం చెక్కుచెదరకుండా ఉంటుంది.

# ప్రశ్నార్థకాలు

## అరిపిరాల సత్యప్రసాద్

**నీరసం వల్ల ఎక్కువ బాధ కలుగుతోందా? అవమానం వల్ల ఎక్కువ బాధ కలుగుతోందా? ఎందుకింత చిరాకుగా ఉంది?**

**ఈ వచ్చేపోయే వాళ్ళకి వేరే పనిలేదా? ప్రతివాడు వచ్చి ఏమిటి సంగతి అని అడగకపోతే, వాళ్ళ పనేదో చూసుకోకూడదూ? ఖర్మ కాకపోతే ఏమిటి? నా మీద కమిషనర్‌గారికి కంప్లయింట్ అందడమేంటి? ఆయనగారు వెంటనే కలవమని ఆర్డర్ వెయ్యడం ఏంటి? కంప్లయింట్ వస్తే సరిపోయిందా? అది నిరూపణ కావద్దూ? ఆ విషయం ఆయనకి మాత్రం తెలియదా? ఒకవేళ నిరూపణ కాదని తెలిసి, ఎదురుచూపులు అనే శిక్ష వేసి పొద్దున్నుంచి కూర్చోబెట్టాడా?**

లేచి నిలబడటానికి ఇంత కష్టంగా ఉందే? మోకాళ్ళు పట్టేశాయేంటి? వయసుమీద పడటంలా? వయసు ప్రభావం జ్ఞాపకం మీద కూడా పడిందా ఏమిటి? కమిషనర్ గారి పి.ఎ. పేరు గుర్తుకువచ్చి చావదే? నాగేశ్వరరావా? నాగభూషణమా?

"నాగభూషణం గారూ, సార్ ఏమైనా పిలిచారా?" నా గొంతులోకి కొత్తగా జంకు ఎక్కణ్ణించి వచ్చిందో?

"పిలిస్తే చెప్పనా? వెయిట్ చెయ్యమన్నా కదా?" కోపాన్ని ముక్కుమీదే పెట్టుకు తిరుగుతుంటాడా ఈయన?

వయసులోనూ, సీనియారిటీలోనూ పెద్దవాణ్ణి కదా? ఇదే ఆఫీసులో ఉంటే నన్ను సార్ సార్ అనేవాడు కాదూ? ఆ సీటు పలికిస్తున్న మాటలు కావూ ఇవి?

"ఒక్క టీ తాగి రావచ్చా?" అడిగానా? అర్థించానా?

"ఆయన పిలిచే టైంకి మీరు లేకపోతే? ఆ మనిషి కోపం సంగతి తెలుసుగా?"

ఉండాలా? వెళ్ళాలా?

ఈ ప్యూన్ సైదులు కనిపించిన ప్రతిసారీ ఎందుకు చెయ్యెత్తి విష్ చేస్తాడు?

"టీ తాగడానికేగా? త్వరగా వచ్చేస్తారుగా?" అడగకుండానే మనసులో విషయాలు వీడికెలా తెలుస్తాయో? సాయంత్రమయ్యాక చేసిన ప్రతి నమస్కారానికీ విలువ కట్టి నా దగ్గర్నుంచి వసూలు చేస్తాడేమో? కమిషనర్ గారు పిలిపించారంటే ఏదో పెద్ద చేప అయ్యుంటుం దని అనుకుంటున్నాడా? విదిలిస్తే నా దగ్గర రెండు నీటి చుక్కలన్నా రాల్తాయనా?

ఏమిటిది? రోడ్డుమీద ట్రాఫిక్కా? వాహనాల ప్రవాహమా? మహానగరం అంటే ఇదేనేమో? అవునూ, గేటు బయట కుడిపక్కనే ఒక టీ బంకు ఉండాలే? తీసేశారా? ఇంకేదో బండి ఉంది? ఆ బండి దగ్గర ఉన్నామె అమ్ము తున్నదేంటి? టీయేనా? లేకపోతే, ఆ ప్లాస్టిక్ కప్పులు, ఫ్లాస్కులు ఎందుకుంటాయిలే?

"టీ ఇస్తావా?" ఆమె తల కూడా ఎత్తదే? కొత్తగా సిగరెట్ తాగాలనిపిస్తోందేంటి?

"సిగరెట్లు ఉన్నాయామ్మా?"

ఇరవై ఏళ్ళయిందా, నేను సిగరెట్ మానేసి? మళ్ళీ ఇప్పుడు తాగాలనిపించిందేమిటి? పొద్దున్నుంచి చీకటి గుహలా ఉన్న ఆఫీసులో ఉన్నందువల్లనా? ఆ పాత ఫైళ్ళ వాసన పడకపోవటం వల్లనా? లేకపోతే కమిషనర్ గారు ఏం చీవాట్లు వేస్తాడోనన్న టెన్షన్ వల్లనా.

ఒక్క చుక్క టీ అయినా తాగనిస్తేనా? సిగరెట్ వెలిగించి కనీసం ఒక్కదమ్మైనా తాగానా? ఇంతలోనే ఆ సైదులు గాడు రావాలా?

"ఇక్కడున్నారా? రారా?" పిలిచాడా? బెది



రించాడా? కంగారుకి చెయ్యి వణికితే మాత్రం ఆ టీ చుక్కలు చొక్కా మీదే పడాలా? ఇప్పుడు టీ తాగాలా వద్దా? సిగరెట్ పడేయాలా వద్దా? అసలు ఆలోచించే ప్రశ్నలా ఇవి?'

ఇదేమిటి? పర్సులో వెయ్యి రూపాయల కాగితం ఒకటే ఉంది? పదిహేడు రూపాయలకి వెయ్యి కాగితమా?

"చిల్లర లేదా సార్?" అనుకున్నట్లే అడిగిందే?

"నీ దగ్గర లేదా?"

"ఉంటే ఎందుకు అడుగుతాను?"

"పోనీ నీ దగ్గరే ఉంచుతావా? చిల్లర వస్తుందిగా"

వెయ్యి నోటు కన్నా కమిషనర్ గారి పిలుపు ముఖ్యం కదా? పరిగెట్టక తప్పుతుందా? అవునూ ఈ సైదులు గాడేడి? ఇంతలోనే వెళ్ళిపోయాడా? పరిగెత్తుతోంటే గుండె ఎందుకిలా దడదడలాడుతోంది? వయసైపోయిందా?

సైదులుగాడు ఇక్కడ కూడా లేడే? కమిషనర్‌గారి రూమ్‌లోకి వెళ్ళాడా? తలుపు వేసుందే? అది తెరుచుకుని వస్తున్నది వాడేనా?

"ఏంటి సార్ మీరు?" అన్నాడు సరే. తల



ఎందుకు కొట్టుకున్నాడు? కొంపదీసి కమిషనర్ గారికి కోపం వచ్చిందా?

"లోపలికి వెళ్ళమంటావా?"

"ఏంటి ఎళ్లేది? పిలిచినప్పుడు ఎక్కడికి పోయారు? మళ్ళీ ఎప్పుడు పిలుస్తారో?"

ప్రాణం ఉస్సూరనదూ? పొద్దున్నుంచి ఎదురు చూసినదంతా వృథా అయినట్టేనా? పైగా పిలిచినప్పుడు లేనని పేరొకటా? మళ్ళీ ఎదురుచూపులు తప్పవా? అబ్బబ్బా... ఈ ఫ్యానెందుకు కటకటమంటూ తిరుగుతోంది?

వెయ్యి రూపాయల నోటు...?

ఈ నెలకి అదే ఆఖరు నోటు కదా? ఎకౌంట్లో ఏమన్నా ఉన్నాయా? ఎందుకుంటాయి? పదమూడొందలు ఉంటే, మొత్తం డ్రా చేశాను కదూ? రెండొందలు ఛార్జీలకు అయిపోయిందా? ఇంకో వంద ఎక్కడ ఖర్చు పెట్టాను? ఆటోవాడికి ఇచ్చినట్లున్నాను కదూ?

ఇక ఇప్పుడు ఊరికి తిరిగి వెళ్ళాలంటే ఎలా? రాత్రికి నాలుగు మెతుకులు తినడానికి కూడా అవకాశం లేదా? ఆ ఒక్క నోటేగా మిగిలింది? కనీసం, టీ అయినా పూర్తిగా తాగనిస్తేనా? పని అయిపోయాకైనా ఒక సిగరెట్టు కొనుక్కొని మొత్తం నిదానంగా తాగగలనా? డబ్బు లేదే? ఆమె చిల్లర తెస్తుందా? ఇస్తుందా? ఇవ్వకపోతే?

పోనీ ఒకసారి వెళ్ళి అడిగితే? అంతలోనే పిలుపొస్తే? ఏమీ పాలుపోని పరిస్థితి? కడుపులో తిప్పినట్లుగా ఉందేమిటి? చిరాకు వల్లా? ఆకలి వల్లా? లోపల సార్ ఏమంటారో అన్న భయం వల్లా? ఠక్కున ఒక్కసారి బండి దగ్గరకు పోయొస్తే? ఈసారి పిలిచినప్పుడు కూడా నేను లేకపోతే ఉద్యోగం ఊడిపోదూ?

"ఇంట్లో ఖర్చులకి పైసా లేకుండా చేశారుగా? కాలికొచ్చినా కడుపుకొచ్చినా ఏం చెయ్యమంటారు?" వచ్చేటప్పుడు సునంద అన్న మాటల్లో తప్పేముంది? తన మాట విని నాలుగు డబ్బులు ఇచ్చొచ్చినా మిగిలేవేమో? సాయంత్రం పనయ్యాక ఆ సైదులుగాడు చెయ్యి చాస్తే ఏమివ్వాలి?

ఛ...ఛ... ఏమిటిది? ఆమె నా డబ్బులు తిరిగి ఇవ్వదన్నట్లు ఎందుకు ఆలోచిస్తున్నాను? ఇస్తుందేమో? నేను కనపడగానే చిల్లర పైసలతో సహా చిల్లర మొత్తం చేతిలో పోస్తుందేమో? ఆమె ముఖం అదీ చూస్తుంటే తెలియట్లా? మంచి మనిషిలానే ఉంది కదా? ఇస్తుందా..? ఇవ్వకపోతే...? ఒకవేళ నా పనయ్యేసరికి ఆమె అక్కడ లేకపోతే?

పోనీ ఒకసారి వెళ్ళి చూసి వస్తే? చెప్పలేం కదా? చేతిలో డబ్బు కనపడుతుంటే నీతి నిజాయితీ పని చేస్తాయా? అయినా ఆమె ఎక్కడికి పోతుంది? రేపైనా అక్కడే బండి పెట్టాలిగా? కానీ రేపటిదాక నేను ఉండాలిగా? లాస్ట్ బస్సు పట్టుకునైనా ఇంటికి వస్తానని చెప్పాను కదా? ఇప్పుడు ఉండిపోతే ఎలా? అసలు ఎలా ఉండాలి? లాడ్జీల్లో దిగడానికి చేతిలో నయా పైసా అయినా ఉందా? స్నేహితులు ఎవరైనా ఈ ఊర్లో ఉన్నారా? వరహాలని ఒకడుండాలిగా...? ఉన్నాడో? లేదో? ఉంటే ఎక్కడున్నాడో?

సైదులుగాడేమిటి? పేపర్ ప్లేట్లలో ఏదో సర్దుతున్నట్లున్నాడే? బిస్కెట్లా? అవేమిటి? ఆలూ చిప్సేనా? జీడిపప్పు కూడా పెట్టినట్లున్నాడే? వాటిపైన మసాలానా? మిరియాల పొడా? నా ఆకలి గుర్తించాడా ఏమిటి? ఇదేమిటి? నన్ను దాటుకుంటూ పోతున్నాడు?

అయితే అవన్నీ కమిషనర్‌గారి గదిలోకా? ఒక ప్లేటు నాకిచ్చి పోకూడదు? ఏమిటీ వాసన? ఏసీ వాసనలో ఆలూచిప్స్, మిరియాల పొడి వాసనలు కలిసినట్లుందే? ఆకలి మళ్ళీ విజృంభిస్తున్నట్లుందేమిటి? ఆ వాసన వల్లేనా?

వెళ్ళిన ప్లేట్లు ఖాళీ అయ్యేదాకా లోపల్నుంచి పిలుపు రాదేమో కదా? ఇంతకన్నా అవకాశం దొరుకుతుందా? వెంటనే వెళ్లి రాగలనా? శక్తి ఉందా?

బలమంతా కూడగట్టినా పరుగెత్తలేకపోతున్నానే? గేటు దాటేసరికి ఎంత ఆయాసం వచ్చిందీ? ఇదేమిటి? ఆమెలేదే? ఎక్కడికిపోయింది? కళ్ళేమిటి బైర్లు కమ్ముతున్నాయి? గుండె ఇంత వేగంగా కొట్టుకుంటోందేమిటి?

బండి ఉంది కానీ, నా దగ్గర వెయ్యి కాగితం తీసుకున్న మనిషి ఏదీ? అంతా అయిపోయిందా? ఈ నెలకి ఆఖరు నోటికి రెక్కలొచ్చినట్లేనా? ఆమె వస్తుందో? రాదో? ఇక్కడే కాపలా కాయాలేమో? రాత్రికి ఏ ఫ్లాట్‌ఫారం మీద పడుకోవాలో...? ఆమె స్థానంలో ఎవరో పిల్లాడు ఉన్నారే? పది పదకొండేళ్ళు ఉంటాయా వాడికి?



**వెయ్యి రూపాయల నోటు తీసుకుని చిల్లరకోసం పరిగెత్తాడా కుర్రాడు. డివైడర్ దాటి రోడ్డు అవతలకు వెళుతుంటే స్కూటర్ ఢీకొట్టింది. చిల్లరకోసం ఎదురు చూస్తున్న పెద్ద మనిషి గుండె గుభేల్‌మంది. ఈ నెలకి అదే ఆఖరు వెయ్యి నోటు. ఓ ముఖ్యమైన పనికోసం కమిషనర్ ఆఫీసుకొచ్చాడాయన. ఇప్పుడేంటి చేయడం? ఆ కుర్రాణ్ణి ఆసుపత్రికి తీసుకెళ్ళేదెవరు? తన డబ్బు తిరిగొస్తుందా? లేదా? ఎన్నో ప్రశ్నలు అతడి ఆలోచనల్ని చుట్టుముట్టాయి.**

"బాబూ.... ఇక్కడ ఒకామె ఉండాలి?"

"మా అమ్మ? ఏం?"

"ఆమె నాకు చిల్లర ఇవ్వాలని ఏమైనా చెప్పిందా?"

"ఓ మీరేనా?"

"చెప్పిందా?"

"ఎంత ఇచ్చారు? ఏం తీసుకున్నారు?" వాళ్ళ అమ్మే అడగమందో? లేకపోతే వాడి తెలివితేటలో?

"వెయ్యి ఇచ్చి ఒక టీ, ఒక సిగరెట్ తీసుకున్నానని చెప్పలేదా?" తీసుకున్నాను కానీ తాగలేదన్న విషయమే ఎందుకు గుర్తుకొస్తోందిప్పుడు?

"అయితే మీరేనన్న మాట? కానీ చిల్లర రాలేదే?... ఇక్కడే ఉంటారా?" అంటూనే ఆ వెయ్యి కాగితం పట్టుకొని రోడ్డు మీదకు అలా పరిగెత్తాడేమిటి?

నన్ను అవతల కమిషనర్‌గారు పిలుస్తారేమో? ఇలాంటప్పుడే ఈ పిల్లాడు చిల్లర తెస్తానని పరిగెత్తాలా? ఎటూ తేల్చుకోలేని పరిస్థితై పోయింది? ఆ పిల్లాడు రోడ్డు మీదకు అలా అడ్డంగా పరిగెడతాడేమిటి? డివైడర్ మీద నుంచి అమాంతంగా దూకేస్తాడేమిటి వీడు? పాన్‌షాపు, మటన్ షాపు అంటూ అన్ని షాపులు చిల్లర కోసం తిరుగుతున్నాడే? దొరికినట్లు లేదే? వచ్చేయమని ఎంత పిలిచినా పట్టించుకోడే? అటు కమిషనర్ గారి గది వైపు, ఇటు వీడి వైపు ఒకేసారి ఎలా చూడటం?

ఈసారి పరుగు అటు నుంచి ఇటుకా? అయ్యో... డివైడర్ మీద నుంచి దూకటం దూకటం అలా పడ్డాడేమిటి? ఆ స్కూటర్ వాడికి కళ్ళు కనపడటం లేదా? అలా గుద్దేసి పోతుంటే ఎవరూ ఆపరే? ఇంతలో ఎంత జరిగిపోయింది? ఆ పిల్లాడికేమైందో? కుడికాలు పట్టుకుని ఏడుస్తున్నాడంటే, విరిగుంటుందా? పెద్ద దెబ్బే తగిలుంటుందా? ఏమీ పాలుపోయి చావదే?

ఇప్పుడు నేనేం చెయ్యాలి? వెళ్ళి పిల్లాణ్ణి చూడాలా? అవతల కమిషనర్ గారు పిలిస్తే? కాదని వెనక్కి వచ్చేస్తే ఇక నా డబ్బులు తిరిగొస్తాయా? ఒకవేళ వాడి కాలు విరిగి ఉంటే? హాస్పిటల్‌కి తీసుకుపోతే అదెంత ఖర్చవుతుందో? వాడి దగ్గర అంత డబ్బు లేకపోతే?

నాకు చిల్లర ఇవ్వడానికే కదా ఆ పిల్లాడు పరిగెట్టాడు? నేను ఆ మాత్రం బాధ్యత తీసుకోవద్దా? సరే బాధ్యత కాదు. కనీసం ఒక మనిషిగానైనా ఆలోచించాలా? అదీ కాదు. కనీసం ఆ పిల్లాడి మీద జాలి ఉండాలా?

అనవసరంగా ఎక్కువ ఆలోచిస్తున్నానా? నేను వాడి దగ్గరకు వెళ్ళేసరికి ఇంతమంది గుమికూడారే? వాడేమిటి అలా విలవిలలాడుతున్నాడు? అంత రాద్ధాంతంగా ఏడవటం ఎందుకు? లేవమంటే లేవడే? లేవలేని పరిస్థితిలో ఉన్నాడా? చెయ్యి అందించినా లేవనంటాడే. నా ఒంట్లో శక్తి లేదని నాకు తెలుసు కదా? నా బుద్ధి తక్కువ కాకపోతే ఆ పిల్లాణ్ణి మోసుకుని రోడ్డు దాటడం ఎందుకు? వాడి మీద జాలా? లేకపోతే నా డబ్బుల గురించి ఆందోళనా?

కమిషనర్ గదిలో నుంచి బయటకు వస్తోంది డైరెక్టర్ మేడమే కదా? అంటే ఇప్పుడు నన్ను పిలిపిస్తాడేమో? పిలవక పోనూ వచ్చుగా? పిలిచిన రెండు సార్లు నేనక్కడ లేనని తెలిస్తే? కనీసం ఆరొందల కిలోమీటర్ల అవతలకి ట్రాన్స్‌ఫర్ అయిపోదూ?

ఈ పిల్లాడు ఎంతసేపైనా ఏడుపాపడే? వాడి కళ్ళలో నీళ్ళు చూసి నేనెందుకు కరిగి పోతున్నాను? నాకెందుకింత బాధ కలుగుతోంది? వెళ్తున్న ఆటోని ఎప్పుడాపాను? పిల్లాణ్ణి ఎక్కించాను సరే. నేనెందుకు ఎక్కాను? ఆటో పోతుంటే కమిషనర్ ఆఫీస్ వైపే ఎందుకు చూశాను? ఎన్ని ప్రశ్నలు? వీటన్నింటికీ సమాధానాలు ఉన్నాయా? ఉన్నా నాకు తెలియటం లేదా?

"నీ పేరేంటి?...బాబూ, మీ నాన్న పేరేంటి?"

ఎంతకీ సమాధానం చెప్పడే? ఆ ఏడుపెందుకు మధ్యలో? మాటలు ఇక్కడున్నా నా మనసు కమిషనర్ ఆఫీస్ చుట్టే తిరుగుతోందేమిటి? వెనక్కి వెళ్ళిపోతే? మరి ఈ పిల్లాడు?? పోనీ హాస్పిటల్ దగ్గర వదిలేస్తే?? అన్యాయం కదూ??

"మీ అమ్మ ఎక్కడ ఉంటుంది? మీ అమ్మ సెల్ నెంబర్ తెలుసా?"

చూస్తుంటే ఈ రోజంతా ఇలాగే చచ్చేట్లుందే? ఏదీ సక్రమంగా జరగట్లేదేమిటి? పొద్దున్నే ఎవరి ముఖం చూసుంటాను?

హమ్మో, ఇదేదో పెద్ద కార్పొరేట్ హాస్పిటల్ లాగుందే? ఆటో వాడికి ఈ హాస్పిటలే కనపడిందా? వైద్యం పేరుతో ఉన్నదంతా లాక్కుంటారేమో? వీల్‌చైర్ ఎప్పుడు తెచ్చారో? ఎప్పుడు వాణ్ణి లోపలికి తీసుకెళ్ళారో? నేను ఎప్పుడు వెయిటింగ్ రూమ్‌లో కూలబడ్డానో? అంతా నిమిషం తిరిగే లోపలే జరిగి పోయినట్లుందే?

మళ్ళీ ఎదురుచూపులా? అవునూ, ఆఫీసులో ఏం సమాధానం చెప్పాలి? చీవాట్లు తప్పేదేముంది? కానీ పొద్దున్నుంచి కలవకుండా ఉంచినందుకు చెప్పకుండా వెళ్ళిపోయానని అనుకుంటారేమో? నాకు పొగరెక్కువైందని నిర్ధారణకు వస్తారేమో? ఇప్పుడు ట్రాన్స్‌ఫరా? లేకపోతే ఏకంగా సస్పెన్షనేనా? ఎంతమంది కాళ్ళు పట్టుకోవాలో? ఏ యూనియన్ వాళ్ళని బతిమిలాడుకోవాలో?

ఇప్పుడు నాగభూషణం ఫోన్ చేస్తున్నాడేమిటి? ఏం చెయ్యాలి? ఎక్కడికి వెళ్ళావంటే ఏం చెప్పను? మాట్లాడితే ఒక తంటా, మాట్లాడకపోతే ఇంకో తంటా అయ్యేట్లుందే? చటుక్కున నిర్ణయించుకోవద్దా? ఫోన్ ఆగిపోయేదాకా ఆలోచిస్తే ఎలా?

ఇది మరీ ప్రమాదం అయ్యేట్లుందే? నేను కావాలనే ఫోన్ లిఫ్ట్ చెయ్యలేదని అనుకుంటే? ఏం చెయ్యాలి? మళ్ళీ కాల్ చెయ్యాలా వద్దా?

"పిల్లాణ్ణి చూస్తారా?" నన్నేనా నర్స్ పిలిచింది?

అసలా పిల్లాడి వయసెంతనీ? రోడ్డుకి అడ్డంగా అట్లా పరిగెట్టడమేమిటి? వాళ్ళమ్మ మాత్రం? పిల్లాడిని అలా గాలికి వదిలేసి పోవడమేనా? ఏమన్నా అయ్యుంటే నన్ను నేరస్థుణ్ణి చేసేవాళ్ళు కాదూ?

"ఎలా ఉందిరా?"

"నాకేం సార్?" మళ్ళీ నాగభూషణం ఫోనా? ఇక అంతా అయిపోయినట్లేనా? ఇంక ఎత్తకుండా ఎలా ఉండగలను?

"సార్? రమ్మంటారా సార్?"

"లక్ష్మమ్మ కొడుకుని హాస్పిటల్‌కి తీసుకెళ్ళారట? ఏక్సిడెంట్ అంట? ఎలా ఉన్నాడు?"

"సార్, కమిషనర్ గారు పిలిచారా? రమ్మంటారా? ఇక్కడ్నుంచి ఎంతసేపు?"

"నేను లేనటండీ? కమిషనర్ గారికి ఏదో ఒకటి చెప్పలేనా? ఆ పిల్లాడికి ఏంకాలేదు కదా? మీకు తెలియదు కదూ? వాడు లేకపోతే మన ఆఫీసులో సందడేముందండీ? టీలేనా? బిస్కెట్లేనా? సమోసాలేనా? ఆ తల్లికి వాడే కదా దిక్కు?" ఆయన గొంతులో కాఠిన్యం మొత్తం మాయమైనట్లు అనిపిస్తోంది. నిజమేనా?" ఆఫీసయ్యాక వస్తాను గానీ మీరు అక్కడే ఉంటారుగా? వాడు బాగానే ఉన్నాడుగా?"

"మరి కమిషనరు గారు?" వాక్యం పూర్తిచేసే ధైర్యమైనా లేదే నాకు?

"మాకు తెలియదటండీ? మీరేంటో? మీ పనేంటో? ఎవడో గిట్టని వాళ్ళు కంప్లయింట్ ఇస్తే మాత్రం మీ మీద మాట పడనిస్తామా? నేను లేను? ఉండనా మరి?" ఫోన్లో ఉన్నది నాగభూషణమేనా? నేను విన్నది నిజమేనా?

ఎవరో లోపలికి వస్తున్నట్లున్నారు? నాకు దణ్ణం పెడుతోంది? ఆ పిల్లాడి తల్లి కదూ?

"నాకెందుకమ్మా దండాలు పెడతావు? అసలు నా వల్లే ఇదంతా జరిగిందేమో?"

"అదేం మాట సార్? ఆడికి ఎన్నిసార్లు అట్టా లగెత్తొద్దని చెప్పాననుకున్నారు? మీ దయతో సాయం చెయ్యకపోతే...?" తల్లి ప్రేమ అంటే ఆ కన్నీరేనేమో?

"మీ డబ్బులు వద్దా సార్?" పిల్లాడికి అప్పుడే అంత ఓపిక వచ్చిందే? చేతిలో ఫెళఫెళలాడుతూ కనిపించేది నేనిచ్చిన వెయ్యి కాగితం కదూ?

"హాస్పిటల్ ఖర్చులు అవీ ఉంటాయిగా? ఉంచుకోరాదూ?"

"మీ డబ్బులు నాకెందుకు సార్?"

"మరి నా టీ డబ్బులు తీసుకోవా?"

"మళ్ళీ వస్తారుగా? అయినా మేమెక్కడికి పోతున్నాం?"

వీళ్ళనేనా అనుమానించింది నేను? నా డబ్బులు తీసుకొని పారిపోతారని కదూ అనుకున్నాను? వీడికి ఒక చిన్న సాయం చేసిన మరుక్షణం ఏనాడూ మెత్తగా మాట్లాడని నాగభూషణం నాకు సాయం చేస్తాననడం ఏమిటి? నిజంగా డబ్బుకోసమే వీణ్ణి హాస్పిటల్‌కి తీసుకొచ్చానా? లేకపోతే..?

ఇంక ప్రశ్నలేమీ లేవు. అన్ని ప్రశ్నలకీ సరిపోయే సమాధానం దొరికినట్లనిపించింది. వాడి తల నిమిరి నవ్వుతూ బయటికి నడిచాను.

సెల్:99669 07771



# సురభి

## స్నానమే లేదు



ఒక్కపూట స్నానం చేయకపోతేనే ఆ రోజంతా చిరాకుగా గడుస్తుంది. మరి 60 ఏళ్ళు స్నానం చేయకుండా ఉంటే! ఏంటీ అన్నిరోజులు స్నానం చేయకుండా ఉంటే రోగాలు రావా? అనుకుంటున్నారు కదూ. అసలు అలాంటి మనుషులు కూడా ఉన్నారా? అనే సందేహం వస్తోంది కదూ! ఇరాన్ వెళితే అలాంటి వ్యక్తిని మనం చూడొచ్చు, దూరంనుంచే లేండి. దగ్గరకు వెళితే ఆ సువాసన భరించలేం కదా!

దక్షిణ ఇరాన్‌లోని దేజ్‌గా అనే కుగ్రామంలో ఉంటాడీయన. పేరు అమౌ హాజి. వయస్సు 80. అతడు వయసులో ఉండగా ఏదో చేదు అనుభవం ఎదురైందట. ఇక అప్పటినుంచి స్నానమే చేయకూడదని నిర్ణయించుకున్నాడు. అలాగే బతుకుతున్నాడు కూడా. శుభ్రంగా ఉంటే ఏదో రోగం వచ్చినట్లు ఉంటుందట అతనికి. స్నానం ఒక్కటేకాదు అతని జీవనశైలి కూడా రాతియుగంలో గుహల్లో బతికిన మనిషిలాగా ఉంటుందట. వింతగా ఉంది కదూ!

## అక్కడన్నీ డైనోలే!



అనగనగా ఒక పెద్ద అడవి. ఆ అడవికి రాజు మృగరాజు. ఇంకా ఆ అడవిలో పులులు, ఏనుగులు, రకరకాల జంతువులు ఉన్నాయి అంటూ చిన్నపిల్లలకు కథలు చెబుతుంటారు తాతయ్యలు. కానీ డైనోసార్లు ఆ అడవిలో ఉన్నట్టుగా చెప్పరు. కానీ ఇప్పుడు డైనోసార్లను కూడా అడవుల కథల్లో చేర్చుకోవచ్చు. ఎందుకంటారా వాటికీ ఓ అడవి ఉంది మరి. ఆ అడవిని చూడాలంటే ఇంగ్లండ్ వెళ్ళాలి.

ఇంగ్లాండ్‌లోని కెంట్ నగరం 'పోర్ట్ లింప్నే రిజర్వ్'లో కాలు పెట్టగానే ఓ జురాసిక్ పార్క్ చూసినట్టుగానే ఉంటుంది. చెట్లపై వాలి ఉన్న ఎగిరే డైనోలు, నోరు తెరుచుకుని ఉన్న రాకాసి బల్లులు, పెద్దపెద్ద డైనోసార్లు ఇలా దాదాపు 40 జాతులకు చెందిన డైనోలను ఇక్కడ చూడవచ్చు. కాకపోతే ఒక చిన్న మెలిక. ఇవన్నీ డైనోల ఆకారంలో చెక్కిన విగ్రహాలు. మొత్తం 103 డైనో విగ్రహాలను ఇక్కడ ఏర్పాటు చేశారు. ఒకప్పుడు ఈ ప్రాంతంలో డైనోలు తిరిగిన ఆనవాళ్ళు ఉండటం వల్ల, వాటి రూపాలను సందర్శకుల కోసం పెట్టారిక్కడ. అంతేకాదు, ఇక్కడికొచ్చే పర్యాటకులకు ఓ గొప్ప సువర్ణావకాశం కూడా కల్పించారు. ఎవరైనా ఈ ప్రాంతంలో వారికిష్టమైన చోట తవ్వకాలు జరపవచ్చు. ఒకవేళ వారు తవ్విన ప్రాంతంలో డైనో శిలాజాలు దొరికితే వాటిని వెంట తీసుకెళ్ళచ్చు. భలే భలే చాన్స్ కదూ!

## సరదాగా తిరిగేస్తున్నారు

కార్పొరేట్ కంపెనీ అంటేనే పని పని పని. అస్సలు తీరిక ఉండదు. టార్గెట్లు, పని ఒత్తిడి, సెలవులు తక్కువ. కానీ ఈ కంపెనీ మాత్రం మిగతావాటికి పూర్తిగా భిన్నం. చైనాలోని టైయన్స్ కంపెనీ యజమాని లీజినువాన్. ఈ యజమానిగారు తన కంపెనీలో పనిచేసే ఉద్యోగులు పని ఒత్తిడితో ఇబ్బందిపడుతున్నారనుకున్నాడో ఏమోగానీ వారిని తన సొంత ఖర్చులతో విదేశాలు తిప్పుతున్నాడు. తమ కంపెనీ 21వ వార్షికోత్సవం సందర్భంగా ఉద్యోగులందరికీ ఈవిధంగా ట్రీట్ ఇస్తున్నానని చెబుతున్నాడు. కానీ ప్రతి సంవత్సరం ఇలాగే వాళ్ళను ఏదో ఒక దేశానికి టూర్‌కి తీసుకువెళుతున్నాడట. ఈసారి స్పెయిన్ రాజధాని మాడ్రిడ్ తీసుకువెళ్ళాడు. 20 విమానాల్లో 2500 మంది ఉద్యోగులను తీసుకెళ్ళి మాడ్రిడ్ మొత్తం తిప్పి చూపించారట. ఏసీ బస్సులు, వసతి కోసం లగ్జరీ హోటల్ గదులు, తిండీ తిప్పలూ ప్రతిదీ కంపెనీ ఖర్చే. ఖర్చు కూడా ఎక్కువేం కాలేదు, కేవలం 552 కోట్లు మాత్రమే! మొత్తానికి ఉద్యోగుల పనిఒత్తిడి తగ్గించి, ఎక్కువ పనిని రాబట్టేందుకు లీజినువాన్ మంచి ఎత్తుగడే వేశాడు!






## హిడింబ ఆలయం

దేవతలకే కాదు రాక్షసులకూ గుళ్ళు ఉంటాయి. ప్రజలు వారినీ పూజిస్తారు. ఆశ్చర్యపోతున్నారా? అసలు తమిళనాడు, కేరళ ప్రాంతాల్లో రాముడికన్నా రావణుడిని పూజించే జాతులే అధికం. కానీ ఉత్తరాదిలో ఓ రాక్షస రాణికి గుడి ఉండటమే విశేషం.

మాయాబజార్, ఘటోత్కచుడు సినిమా చూసిన వాళ్ళకు హిడింబ గురించి తెలిసే ఉంటుంది. మహాభారతంలో ఆమెకు కూడా ఒక అధ్యాయం ఉంది. హిడింబాసురుడి చెల్లెలు, భీముడి భార్య, ఘటోత్కచుడి తల్లి హిడింబ. ఘటోత్కచుడు పెద్దవాడై రాజ్యపాలన భారం తీసుకున్నాక హిడింబ హిమాలయాలకు వెళ్తుంది. తపస్సు చేసి కొన్ని దివ్యశక్తులు పొందుతుంది. కోరికలు తీర్చే దేవతగా మారుతుంది. పూజలందుకుంటుంది. అది ఆ గుడి నేపథ్యం.

1553లో మహారాజా బహదూర్‌సింగ్ హిడింబ పేరిట పగోడా తరహాలో ఓ సుందర ఆలయాన్ని నిర్మించాడు. ప్రకృతి వైపరీత్యాలు, సామాజిక, వ్యక్తిగత సమస్యలు వచ్చినప్పుడు ప్రజలు అక్కడికి వెళ్ళి హిడింబకి పూజలు చేస్తారు. బలులతో పూజ కూడా తీవ్ర స్థాయిలోనే ఉంటుంది. హిమాచల్ ప్రదేశ్‌లోని ముఖ్య పర్యాటక స్థలాల్లో ఇదీ ఒకటి.

-నర్మద వాసిరెడ్డి



# కంఠుగాడి కాశీయాత్ర

## - శివసతీపురం శర్మ

14

**మంచి నిద్రలో ఉన్నాడు కంఠు. ఎవరో తట్టి లేపుతున్నట్టనిపిస్తే కళ్ళు తెరచి చూశాడు. మోహన్‌సహా డాక్టర్‌బాబు గోల చేస్తున్నాడు. లేరా బాబూ! లే అంటున్నాడు. నిద్రమత్తు వదులుకుని, లేచి కూర్చున్నాడు కంఠు. చలి చంపేస్తోంది. దుప్పటి కప్పుకున్నాడు.**

**"పొద్దున పొద్దునే మీ గోలేంట్రా?" అడిగాడు.**

**"ఇవాళ త్రివేణీసంగమం చూసేస్తే, రేపు తిరుగుప్రయాణం. అదీ గోల." అన్నాడు డాక్టర్‌బాబు.**

**"అవును కదూ" అన్నాడు కంఠు. తల గోక్కున్నాడు.**

"ప్రోగ్రాం నువ్వు మరచిపోయినా నేను మరచిపోలేదు. ఇవాళ అలహాబాద్ వెళ్ళి త్రివేణీసంగమం, ఆ చుట్టుపక్కల ఆలయాలూ, ఆనంద్‌భవన్ చూసేస్తున్నాం. రేపు రైలెక్కి ఇంటికి చెక్కేస్తున్నాం." అన్నాడు డాక్టర్‌బాబు. నవ్వాడు.

"స్నానాలు చేసి అందరూ రెడీ అయిపోయారు. నీదే ఆలస్యం." అన్నాడు మళ్ళీ.

"అవున్సార్! మీదే ఆలస్యం. కారు కూడా రెడీ" చెప్పాడు మోహన్. ఆసరికే ముస్తాబై టీ తాగుతున్నారు సుబ్బారావు, వాణి, నిర్మల.

"రాత్రి మీరంతా ఒళ్ళూ పై తెలియక నిద్రపోయారు కాని, నాకు నిద్ర రాలేదు. పైగా రేపటి ప్రోగ్రాం గురించి ఆలోచిస్తూ కూర్చున్నాను. అప్పుడు మోహన్‌కి ఫోన్ చేశాను. చేస్తే చెప్పాడు, త్రివేణీ సంగమం, ఆనంద్‌భవన్ గురించి. పొద్దుటికి కార్ బుక్ చెయ్యమని చెప్పి, వెళ్ళి వాణీవాళ్ళని లేపాను. ప్రోగ్రాం చెప్పాను. వచ్చి సుబ్బారావుని లేపాను. వాడికీ ప్రోగ్రాం చెప్పాను, నిన్ను లేపి చెబుదామంటే వద్దన్నాడు సుబ్బారావు. మన స్నానాలవీ అయ్యేసరికి తను లేస్తాడులే! ఎందుకు ఇప్పుడు డిస్టర్బ్ చెయ్యడం అంటే ఊరుకున్నాను." అన్నాడు బాబు.

"మంచి పని చేశావు" అన్నాడు కంఠు. బాత్రూంలోనికి పరుగుదీశాడు.

అరగంటలో అంతా కారు దగ్గరకు చేరుకున్నారు. డ్రైవర్ పేరు దీక్షిత్. తెల్లగా పొడుగ్గా ఉన్నాడు.

ఇన్నోవానే! ఇబ్బంది లేకుండా ఉంది. విశాలంగా ఉంది. బయల్దేరింది.

గయ దారిని మించి పోయి లారీలు ఉన్నాయి ఇటు. అలాగే పొగమంచుకూడా విపరీతంగా ఉంది. పదడుగుల దూరంలో ఏం ఉన్నదీ కనిపించడం లేదు. అయినా దీక్షిత్ డ్రైవ్ చేస్తున్నాడు.

"జాగ్రత్తయ్యా! లేనిపోని ప్రమాదాలు నెత్తిమీదకు తేకు." అన్నాడు సుబ్బారావు. సమాధానంగా ముందు నవ్వాడు దీక్షిత్. తర్వాత అన్నాడిలా.

"భయపడకండి సార్! మీ ప్రాణానికి నా ప్రాణం అడ్డు."

కంఠుకి వేడివేడిగా టీ తాగాలనిపించింది.

"మంచి టీ బడ్డీ దగ్గర ఆపవయ్యా" చెప్పాడు.

"మళ్ళీ టీబడ్డీ కాఫీబడ్డీల దగ్గర ఎందుకు? ఏకంగా మంచి హోటల్ దగ్గరే ఆపుతాడు. అక్కడే అన్నీ." అంది నిర్మల.

"దీన్నే...చద్దన్నం తిన్న అత్తగారు కోడలు ఆకలి ఎరుగదంటారు." నవ్వాడు కంఠు.

కారు పెట్రోల్‌బంక్ దగ్గర ఆగింది. ఎంత డీజిల్ కొట్టించాడో తెలియదుగానీ, మూడు వేల అయిదువందలు ఇమ్మన్నాడు దీక్షిత్. డాక్టర్‌బాబు ఇచ్చాడు.

"ఎంతకి మాట్లాడావు?" అడిగాడు కంఠు.

"మోహన్ మూడు వేల అయిదువందలు ఇమ్మన్నాడు. ఇచ్చేశాను." అన్నాడు బాబు.

"రానూపోనూ, అంతేకదా"

"అంతే"

పెట్రోల్‌బంక్ నుంచి బయటపడి, నాలుగైదు మలుపులు తిరిగి, ఓ పెంటకుప్ప దగ్గరకు చేరుకుంది కారు. అక్కడి వాసన భరించలేకపోయారు. అంతా ముక్కు మూసుకున్నారు. ఎడమ పక్క పెంటకుప్పలు ఉంటే కుడిపక్క సందులోనికి తీసుకుని వెళ్ళి కారాపాడు దీక్షిత్. ఆ సందులో పెద్ద రెస్టారెంట్ ఉంది. చాలా కార్లు ఆగి ఉన్నాయి. రెస్టారెంట్‌తో పాటు అక్కడ షాపింగ్ చేసుకునేందుకు అనేక సెంటర్లున్నాయి.

"ముందు టిఫిన్ కానిద్దాం" అన్నది నిర్మల.

టేబుల్ దగ్గరగా కూర్చున్నారంతా.

దీక్షిత్‌సహా ఆరుగురికి ఆరుప్లేట్లు సాంబారిడ్లీ, దాని తర్వాత ఆరు ప్లేట్లు పూరీ చెప్పారు.

సాంబారిడ్లీ వచ్చింది. రెండు పెద్ద పెద్ద ఇడ్లీలు పెట్టి ఓ చిన్నకప్పుతో సాంబారిచ్చారు. సాంబారులా లేదది. రసంలా ఉంది. చల్లగా ఉంది. ఇడ్లీ కూడా అంతే! చచ్చినట్టున్నాయి. చల్లగా ఉన్నాయి. తినలేకపోయారు. కాని తప్పదని తిన్నారు. పూరీలు మాత్రం వేడిగా ఉన్నాయి. కర్రీ మామూలే! చల్లగా ఉంది. అలాగే తిన్నారంతా. వేడిగా టీ తాగి బయటపడ్డారు.

దీక్షిత్ సాటి డ్రైవర్లతో కబుర్లలో పడ్డాడు. కంఠువాళ్ళని షాపింగ్ చేసుకుంటే చేసుకోండి అన్నాడు.

షాపులు చూడసాగారంతా. చీరలసహా తివాచీలూ, బొమ్మలూ అమ్మకానికి పెట్టారు. ఖరీదడిగితే కళ్ళు తుళ్ళిపోయేట్టు చెబుతున్నారు.

"ఇక్కడికంటే మన హైదరాబాదే నయం." అంది వాణి.

"యాత్రకి వచ్చిన తర్వాత ఏదో ఒకటి కొనాలమ్మా! కొనండి." నవ్వుతూ అడిగాడు షాపువాడు. వాడు నవ్వినా, అడిగినా కూడా ఎవరూ ఏమీ కొనలేదు.

"కొననప్పుడు ఇక్కడ ఎందుకు టైం వేస్ట్! పిలవండి డ్రైవర్ని, పోదాం." అన్నాడు సుబ్బారావు. బాబు డ్రైవర్ని కేకేశాడు. వచ్చాడు దీక్షిత్. కారెక్కారంతా. బయల్దేరారు.

త్రివేణిసంగమం అంటే ప్రయాగ. ప్రయాగ



అంటే అలహాబాద్. కాశీ నుంచి అలహాబాద్‌కి రెండున్నర గంటలే ప్రయాణం. సరైన డ్రైవర్ దొరికితే ఈ నూట ఇరవై కిలోమీటర్ల దూరాన్నీ రెండు గంటల్లోనే ప్రయాణించొచ్చు.

గంగా యమున సరస్వతి నదులు కలిసే పుణ్యక్షేత్రమే త్రివేణిసంగమం. ఈ సంగమంలో స్నానం చేస్తే సర్వపాపాలూ పోతాయి. పోయి మరుజన్మ మహోన్నతంగా ఉంటుందంటారు.

నిండుగా నిశ్శబ్దంగా ఆకుపచ్చరంగులో యమున ప్రవహిస్తోంటే...దానిని ఒరుసుకుని గంగ వేగంగా ప్రవహిస్తూ పెద్దగా లోతు లేకుండా స్వచ్ఛంగా కనిపిస్తూ ఉంటుంది. సరస్వతి కంటికి కనిపించదు. అది అంతర్వాహిని. ఆకాశంలోంచి రాలిన అమృత బిందువులే త్రివేణిసంగమం అని అంటారు.

"పడవవాళ్ళతో జాగ్రత్త సార్! సంగమస్థలికి తీసుకుని వెళ్ళేందుకు వాళ్ళు రెండు వేలూ, మూడు వేలు కూడా అడుగుతారు. అంత ఇవ్వనక్కర్లేదు." అన్నాడు హిందీలో దీక్షిత్.

"మరి ఎంత ఇవ్వొచ్చు?" అడిగాడు కంఠు.

"వంద లేదంటే రెండొందలన్నాడు మోహన్." చెప్పాడు డాక్టర్‌బాబు.

"అన్నట్టు మోహన్ ఏఁవయ్యాడు? ఒక్కసారిగా కనిపించకుండా పోయాడు." గుర్తొచ్చి అడిగాడు కంఠు.

"పనేదో ఉందన్నాడు. మనతో పాటు రాలేనన్నాడు. తర్వాత చూసుకుందాం ఓ వెయ్యి రూపాయలు ఇవ్వండంటే... ఇచ్చాను. అంతే! కనిపించకుండా పోయాడు." అన్నాడు బాబు.

"రేపు స్టేషన్లో కనిపిస్తాడ్లే" నవ్వాడు సుబ్బారావు.

"అది కూడా మనకి సెండాఫ్ ఇవ్వడానికి కాదు, వేరెవరినో రిసీవ్ చేసుకునేందుకు స్టేషన్‌కి వస్తాడు." అన్నాడు సుబ్బారావు.

మాటల్లో ఉంటుండగానే మలుపు తిప్పి రంగు రంగుల గుడారాల మధ్య నుంచి కారుని పోనీయసాగాడు దీక్షిత్.

"ఈ గుడారాలేంటయ్యా?" అడిగాడు సుబ్బారావు.

"మొన్న కుంభమేళా జరిగింది కద్సార్! అప్పటివివి. ఇప్పుడు కూడా ఇంకేదో పూజ ఉంది. కావాలంటే యాత్రికులకు అద్దెకిస్తారు." చెప్పాడు దీక్షిత్.

గుడారాల మధ్య నుంచి నదీతీరానికి తీసుకుని వచ్చాడు కారుని.

"ఇంకా ముందుకంటే కష్టం సార్! కారిక్కడ ఆపుతాను." అన్నాడు దీక్షిత్. కారాపాడు. దిగారంతా. దిగి, త్రివేణీసంగమాన్ని చూసి మురిసిపోయారు.

వందలాది పడవలు. వేలాది యాత్రికులు. పండిట్‌లూ, పడవ్వాళ్ళూ...సంరంభంగా ఉందంతా.

తీరానికేసి నడిచారంతా. వెన్నంటి వచ్చాడు దీక్షిత్.

"పడవలో సంగమానికి తీసుకెళ్ళాలంటే...మనిషికి రెండు వేలు" చుట్టుముట్టి చెప్పసాగారు పడవ్వాళ్ళు.

"పోవయ్యా! మనిషికి వందే! మాకు తెలియదు అనుకోకు." చెప్పాడు బాబు.

"వందా! బలేవారే" నవ్వుకుంటూ వెళ్ళిపోయారు పడవ్వాళ్ళు.

"ఇక్కడ కాద్సార్! రండి! అక్కడ కనుక్కుందాం." అన్నాడు దీక్షిత్. దూరంగా అందరినీ తోడుకుని వెళ్ళాడు. అక్కడా అంతే! మనిషికి రెండు వేలన్నారు. వేరెవరినో తీసుకుని వచ్చాడు దీక్షిత్. రానూపోనూ మనిషికి వెయ్యి రూపాయలన్నాడతను. పైగా పండిట్‌కి పైసా ఇవ్వక్కర్లేదు. పూజ ఫ్రీ." అన్నాడు.

"పూజేమిటి?" అడిగింది వాణి.

"సంగమ నదులకి పూజ చేసేందుకు పసుపూ పువ్వులూ ఇస్తారు. అలాగే కొబ్బరికాయ కూడా ఇస్తారు. ఇచ్చి మంత్రోచ్చారణ చేస్తారు." చెప్పాడు దీక్షిత్.

మనిషికి వెయ్యి రూపాయలన్న వ్యక్తితో రెండు వేలు అన్న వ్యక్తి గొడవకి దిగాడు. హిందీలో ఒకరిపై ఒకరు కేకలేసుకోసాగారు.

"ఎవరిష్టం వాళ్ళది. గొడవపడతారేంటి." కోపగించుకున్నాడు సుబ్బారావు.

"ఇక్కడ అంతే సార్! నా మాట విని, వెయ్యి రూపాయలంటే...పర్వాలేద్సార్! ఎక్కేయండి! గొడవ కూడా తగ్గుతుంది." అన్నాడు దీక్షిత్.

"వందరూపాయలన్నావు, వీళ్ళేమో వెయ్యి రూపాయలు అంటున్నారు." బాబుని గుచ్చి మరీ అడిగాడు సుబ్బారావు.

"మోహన్ మరి అలాగే చెప్పాడు." అన్నాడు బాబు.

**త్రివేణీ సంగమానికి చేరుకుంది మిత్రబృందం. గంగా యమున సరస్వతి నదుల సంగమస్థలి. సర్వ పాపాల్నీ తొలగించే పవిత్ర స్నాన ప్రదేశం. వెదురు బొంగు ఆసరా చేసుకుని చాలా జాగ్రత్తగా స్నానాలు చేస్తున్నారంతా. మిత్రబృందం స్నానాలాచరించే దృశ్యాల్ని చిత్రీకరించాడు కంఠు. స్నానాలు చేస్తున్నవారిలో ఒకరు మూడో మునక్కి వెదురుబొంగు ఆసరా వదిలేయడంతో కొట్టుకుపోయారు. అప్పుడేం జరిగింది?**

"అందరూ అలాగే చెబుతారు. ఇక్కడ ఎవర్నీ నమ్మలేం. పదండి, పడవెక్కుదాం." అన్నాడు కంఠు.

పదండి అంటే పదండి అన్నారంతా. వెళ్ళి పడవ ఎక్కారు. ఎక్కినవాడు కాస్తా పడవ దిగిపోయాడు సుబ్బారావు.

"ఏఁవైంది?"

"అయిదుగురికీ అయిదు వాటర్‌బాటిల్స్ కొనుక్కుని వస్తాను. సంగమతీర్థం ఇంటికి తీసుకెళ్ళాలి కదా?" అన్నాడు సుబ్బారావు.

"పడవెక్కండి సార్! ఎక్కడపడితే అక్కడ బాటిల్స్ దొరుకుతాయి." అన్నాడు పడవవాడు. అతడు అన్న మాటలు నిజమే! పడవలో బాటిల్స్ పెట్టుకుని అక్కడక్కడా అమ్మజూపుతున్నారు. రేవంతటా కలయ తిరుగుతున్నారు.

త్రివేణీసంగమం గురించి, నదుల గురించి పుక్కిట పురాణాలు చెబుతూ సంగమస్థలికి తీసుకొచ్చాడు పడవవాడు. స్నానాలాచరించేందుకు పండిట్ కూర్చున్న పడవకి, కంఠూవాళ్ళ పడవను ఆనించి నిలిపాడు.

"డ్రస్ ఛేంజ్" అన్నాడు డాక్టర్‌బాబు. నీళ్ళను




చూడగానే, అందులో స్నానం అనగానే ఎక్కడలేని హుషారూ వచ్చిందతనికి. ఆసరికి వాణి, నిర్మల, సుబ్బారావులు కూడా దుస్తులు మార్చేశారు. ఆడాళ్ళిద్దరూ నైట్‌గౌన్లు ధరించి నీళ్ళలోకి దిగేశారు. బాబు, సుబ్బారావులు కూడా నీళ్ళలోకి దిగారు. నలుగురూ స్నానాలు చేస్తోంటే...నీటిని సూర్యునికి తర్పణం విడుస్తోంటే వాటన్నిటి వీడియో చిత్రీకరణ, ఫోటోలు తీయడం కంఠు వంతయింది. స్నానాలు చేస్తోంటే పండిట్ మంత్రాలేవో వల్లించాడు. నలుగురికీ నాలుగు కొబ్బరికాయలు ఇచ్చాడు. నీటిలో వదలండన్నాడు. వదిలారు. వాళ్ళు వదిలారో లేదో, తేలుకుంటూ వెళ్తున్న కొబ్బరికాయల్ని అందుకుని మళ్ళీ పండిట్‌కి చేర్చాడు పడవ్వాడు. ఆ నాలుగు కాయల్నే అటూ ఇటూ తిప్పుతున్నట్టుగా ఉంది.

నీళ్ళలోంచి మొలచినట్టుగా రెండు బొంగులు ఏర్పాటు చేశారు. ఆ బొంగుల్ని కలుపుతూ గట్టి తాళ్ళు కట్టారు. ఆ తాళ్ళు పట్టుకునే స్నానం చేస్తున్నారంతా.

సన్నగా ఉన్నాడు ఒకాయన. తాడు పట్టుకుని నీటిలోకి దిగాడు. రెండు మునకలు తాడుపట్టుకునే వేశాడు. మూడో మునకే, తాడు వదలి వేశాడు. పైకి లేచి చూసి, కొట్టుకుపోతున్నానని తెలుసుకున్నాడు. గోల పెట్టాడు. ఈత వచ్చు కాబట్టి, వెళ్ళి అతన్ని అందుకున్నాడు డాక్టర్‌బాబు. జాగ్రత్తగా పడవలోకి చేర్చాడు. పడవలోకి చేరిన అతని చెంపలు వాయించింది భార్య.

"ఆ బాబు కాపాడబట్టి సరిపోయింది. లేకపోతే సచ్చేటోడివి కదా?" అంది.

"నీళ్ళు కనిపిస్తే నిలవలేవేఁ?" కోపగించుకుంది.

అతనేమీ మాట్లాడడం లేదు. తల వంచుకుని నిల్చున్నాడు. అతని తల ఒత్త సాగిందామె. ఒత్తుతూ దగ్గరగా తీసుకుందతన్ని.

"నువ్వు పోతే ఎలాగయ్యా? నేనేటి కావాల?" అడిగింది. అదంతా దృశ్యీకరించాడు కంఠు. ఆమె అనురాగానికి సన్నగా నవ్వుకున్నాడు. బాబూ వాళ్ళ స్నానాలయ్యాయి. పడవెక్కారు. ఇప్పుడు కంఠు స్నానం చేయసాగాడు. తాడు పట్టుకుని జాగ్రత్తగా మూడు మునకలు వేశాడు. ఏదో తెలియని ఆనందం. తెలియని అనుభూతి. ఆ ఆనందానుభూతిలో దోసిలి పట్టి నీరు తీసుకున్నాడు. సూర్యుడికి అర్ఘ్యం సమర్పించాడు. **ఓం ఘృణిః సూర్య ఆదిత్యః** అన్నాడు. ఆ అష్టాక్షరి అతన్ని పునీతుణ్ణి చేసింది.

**(సశేషం)**




**ఉన్నట్టుండి తన ప్రాణశక్తికి పునర్జన్మ లభించిన అనుభూతి కలుగుతోంది వీరధర్మలో. ఏదో దివ్యమైన, మధురమైన సుగంధం తన నాసికను తాకుతున్నట్టనిపిస్తోంది. ఔను...అది...అది...ఈ లోకంలో లేని సుగంధం. అలౌకికమైన, దైవికమైన మహా సుగంధం! కల్పవృక్షం రెమ్మలలో వికసించిన పుష్పాల అనల్ప సౌరభమా? ఔను! ఆ దివ్య సౌరభం తను అనుభవించిందే! రెండు పర్యాయాలు అనుభవించి ఆఘ్రాణించి, పరవశించిందే!**

దివ్యసౌరభానికి తోడుగా ఏదో చల్లని కాంతి మూసిన కనురెప్పల మీద పడుతోంది. తనను నిద్ర నుండీ, ధ్యాన నిద్ర నుండీ మేల్కొలుపుతోంది! వీరధర్మ కనురెప్పలు నెమ్మదిగా స్పందించాయి. నెమ్మదిగా కళ్ళ మీద నుండి పైకి లేచాయి. వెంటనే మూసుకున్నాయి! తన చర్మచక్షువులు- చర్మంతో రూపొందిన కళ్ళు - భరించలేని కాంతి అది! ఆ దివ్య సౌరభాన్నీ, దివ్యకాంతినీ తన మీదికి ప్రసరిస్తున్న శక్తి ఎవరో తనకు తెలుసు!

"అమ్మా, సింహగాయత్రీదేవీ!" వీరధర్మ హృదయం ఆర్ద్రంగా, మౌనంగా పిలిచింది. అతని కళ్ళు విచ్చుకున్నాయి. తన ఎదురుగా, వినీలాకాశం నేపథ్యంలో సింహగాయత్రీ మాత!

"మాతా! మాతా! నమో నమః!నమో నమః! కరుణించావా! కదలి వచ్చావా!" వీరధర్మ భావావేశంతో అంటూ చేతులు జోడించి నుదురుకు ఆన్చాడు.

సింహగాయత్రీదేవి పగడాల పెదవులు దివ్య మందహాసాన్ని సృష్టించాయి. ఆ కాంతి ఆ తల్లి విశాల నేత్ర జ్యోతుల స్వచ్ఛ కాంతిలో కలిసి పోయింది. అదే ముఖారవిందం! అదే శిరోజ సౌందర్యం! అదే నవరత్న కిరీటం! అవే ఆభరణాలు! అవే దివ్యవస్త్రాలు! ముఖ్యంగా...ముఖ్యంగా... అదే ప్రశాంతత! అదే ప్రసన్నత!

"వీరధర్మా, నీ పరార్థ పరాయణత్వం, నన్ను అలరించింది. ఇక్కడికి రప్పించింది!" అది సింహగాయత్రీదేవి కంఠస్వరం కాదు; శత

నవ్యవీక్లి-లక్ష్మీనారాయణ జైని మెమోరియల్ ఛారిటబుల్ ట్రస్ట్ సంయుక్త నిర్వహణలో

# ప్రథమ బహుమతి పొందిన నవల

### జరిగిన కథ

వైశాలిక రాజ్య యోధుడు వీరధర్మ. సంపూర్ణాయుస్సు లక్ష్యసాధనతో బయలుదేరతాడు. ఎన్నో కష్టాలు, అనుభవాలు చవిచూస్తూ చివరకు చిరంతనయోగి ద్వారా మరణ రహస్యం గ్రహించి, పునరాలోచనలో పడతాడు. మదగజనగరంలో జీవంతకుడి దుష్పరిపాలన అంతం చేస్తాడు. ధీరేంద్ర రాజవుతాడు. అతడిపై యుద్ధం ప్రకటించిన సామంతులను అనూహ్యమైన ఉపాయంతో ఓడించి మహారాజుకు బాసటగా నిలుస్తాడు. తర్వాత భుజంగపురం వెళ్ళి అక్కడ ప్రతిష్టాత్మకమైన దివ్యదర్భవంశానికి చెందిన ఏకైక వారసుడు అగ్నిభట్టారకుడి ప్రాణాలు కాపాడేందుకు సింహగాయత్రీ మంత్రోపాసన ప్రారంభిస్తాడు వీరధర్మ.

ఆ తర్వాత....

కోటి దివ్య వీణల సంగీత సమ్మేళనం!

"అమ్మా...!" వీరధర్మ కంఠం వణికింది. "వంశానికి ఒక్కడే అయిన యువకుడు ప్రాణాపాయ స్థితిలో..."

వీనులకు విందు చేస్తూ, దేవత నవ్వు వీరధర్మకు అడ్డు తగిలింది. "నాకు అంతా తెలుసు. అన్నీ తెలుసు. బ్రాహ్మణ యువకుడి చికిత్స కోసం సింహక్షీరం కావాలి. నీ కోరిక అదే. ఒక నిబంధనకు నువ్వు తలవంచాలి. అంగీకరిస్తే నీ కోరిక తీరుస్తాను..."

"ఆజ్ఞాపించు తల్లీ!"

"ఇక మళ్ళీ జీవితంలో నీకు ప్రసన్నం కాను. ప్రత్యక్షం కాను. అనుగ్రహించను. ఇదే నీకు నా అంతిమ దర్శనం అవుతుంది! ఇష్టమేనా?"

"అమ్మా!"

"నీ పరార్థ పరాయణత్వం నీ భవిష్యత్తులో నా అనుగ్రహానికి నిన్ను దూరం చేస్తుంది. ఆలోచించుకో, ధర్మా!" నీలాకాశం ఆ తల్లి వాక్కును ప్రతిధ్వనించింది.

"ఆలోచన దేనికి మాతా! వాగ్దానం చేశాను. భంగం చేయలేను. ఇప్పటి నీ అనుగ్రహం చాలు.." వీరధర్మ వినయంగా అన్నాడు.

"నువ్వు సార్థక నామధేయుడవని అనిపించుకున్నావు. నీ పేరులో ఉన్న ధర్మాన్ని ఆచరిస్తున్నావు. నిన్ను మెచ్చుకుంటున్నాను. కోరిన వరం సింహక్షీరం ప్రసాదించే ముందు నీకు ఒక రహస్యం చెబుతాను. దానిని ఆలకించిన అనంతరం, అవసరమైతే నీ కోరికను ఉపసంహరించుకోవచ్చు..."

"రహస్యమా జననీ!"

"ఔను. నీ వంశానికి సంబంధించిన రహస్యం" సింహగాయత్రీదేవి పెదవులు కదలని వాక్కు వీరధర్మను ఆశ్చర్యపరిచింది.

"ధర్మా, నీ వంశంలో జన్మించే పురుషులకు ఏడు తరాల పాటు



నాలుగు దశాబ్దాల అల్ప ఆయుర్దాయ శాపాన్ని ఇచ్చిన వ్యక్తి ఎవరో తెలుసా? చతురాననాచార్యుడు!"

"అమ్మా!" వీరధర్మ అరిచాడు, బొంగురుగా.

"నీ పితృపితామహులనూ, ప్రపితామహుడినీ, వారి సోదరులనూ నలభై వసంతాలు నిండకుండానే చనిపోయేలా మరణశాసనం లిఖించి బలి తీసుకున్న వ్యక్తి వంశాభివృద్ధికి నువ్వు వరం కోరుతున్నావు."

వీరధర్మ తన చెవులను నమ్మలేకపోయాడు. దేవత మాటలు భీకరంగా అతని చెవులలో గింగురు మంటున్నాయి. కళ్ళు బైర్లు కమ్ముతున్నట్టు అనిపిస్తోంది. రెండు అరచేతులతో కణతల్ని నొక్కుకున్నాడు. కొలతకు అందని ఆశ్చర్యంతో నిండి గిన్నెల్లా అయిన కళ్ళతో సింహగాయత్రీ మాతను చూస్తూ ఉండిపోయాడు.

తమ వీరతిలక వంశాన్ని శపించింది చతురాననాచార్యుడా? అతని వంశాన్ని వృద్ధి చేసే కార్యానికి సహాయం చేయడానికి విధి తనను ఇక్కడికి పంపించిందా?

"ధర్మా! ఆలోచించుకో! నీ వంశాన్ని శాపగ్రస్థం చేసిన వ్యక్తి వంశానికి వరం అందిస్తావా?"

"తల్లీ..." వీరధర్మ తడబడుతూ అన్నాడు.

"మరొక సత్యం నువ్వు తెలుసుకోవాలి. చతురాననాచార్యుడు శాసించిన శాపాన్ని మరెవ్వరూ ఉపసంహరించలేరు. నేను కూడా! అది దేవ ధర్మం! ఎవరి శాపాన్ని వారే ఉపసంహరించాలి. చతురాననాచార్యుడు తన శాపాన్ని ఉపసంహరిస్తాడో లేదో; ఉపసంహరించగలడో లేదో-అతనికే తెలియాలి! ఎందుకంటే కొందరికి శపించే శక్తి మాత్రమే ఉంటుంది; ఉపసంహరించే శక్తి ఉండదు! నీ నిర్ణయం చెప్పు! శపించిన చతురాననాచార్యుడికి వరం ఇచ్చే శక్తిని నీకు అనుగ్రహించ మంటావా?" సింహగాయత్రీ మాత కంఠం ఆకాశంలో ప్రతిధ్వనించింది.

వీరధర్మ ఆలోచనల సంకుల సమరం ప్రారంభమైంది. చతురాననాచార్యుడికి శాపాన్ని ఉపసంహరించే శక్తి ఉందో లేదో! ఉపసంహరిస్తారో లేదో?

"ధర్మా! అతని శాపానికి శక్తి ఉందని రుజువైంది కదా! అది ఉపసంహరించబడేదాకా నువ్వు దీర్ఘాయుష్మంతుడివి కాలేవు! ఏ దైవిక శక్తీ నిన్ను 'దీర్ఘాయుష్మాన్ భవ!' అంటూ దీవించదు సుమా!"

వీరధర్మ దేవత వైపు దీనంగా చూశాడు. "మాతా...నా లక్ష్యం...నా కఠోర నిర్ణయం..."

సింహగాయత్రీదేవి ముఖం చిరునవ్వుతో వికసించింది. "తెలుసు. మరణాన్ని జయించాలనీ, 'మృత్యుంజయుడు'గా ఉండిపోవాలనీ నువ్వు సంకల్పించుకున్నావు! నా వచనాన్ని పునరుక్తం చేస్తున్నా. చతురాననాచార్యుడి శాప ప్రభావం ఉన్నంత కాలం నీకు మృత్యుంజయత్వం కాదు కదా శతాయుష్షు కూడా లభించదు నాయనా!"

వీరధర్మ బరువుగా నిట్టూర్పు విడిచాడు. అతని మేధస్సు నిశిత ఖడ్గంలా ఆలోచనల్ని ఖండించి వేసింది. "నా నిర్ణయం మనవి చేస్తున్నాను. నా వంశం మీద వేలాడుతున్న అల్పాయుర్దాయ శాపాన్నీ నాకు సంభవించబోయే అకాల మరణాన్నీ సందేహాస్పదంగా ఉన్న మృత్యుంజయత్వాన్నీ నిర్ద్వంద్వంగా విస్మరిస్తున్నాను. నా వాగ్దానాన్ని స్మరిస్తున్నాను. నీ పావన పాద పద్మాలకు నమస్కరిస్తున్నాను. నా ప్రార్థన మన్నించి సింహక్షీరాన్ని ప్రసాదించు!"

"భళా! వీరధర్మా, భళా!" సింహగాయత్రీ దేవి పలుకులో మెచ్చుకోలు దేవఘంటికలా ధ్వనించింది. "నీ ధర్మబుద్ధి త్యాగంతో పదునెక్కింది! నీ ధర్మమూ, త్యాగమూ నీకు రెండు రక్షక కవచాలు! స్వర్ణ పాత్రికను నదీ జలంతో నింపి, నన్ను స్మరించు!"

వీరధర్మ వణుకుతున్న చేతితో, సమీపంలో ఉంచుకున్న స్వర్ణపాత్రికను భుజంగప్రయాత నదీ జలంలో ముంచి, తీశాడు. కన్నార్పకుండా దేవతామూర్తిని దర్శిస్తూ, ఆమెను స్మరించాడు.

> **గతంలో అనుభవించి ఆఘ్రాణించి పరవశించిన దివ్యసుగంధం ధ్యానముద్రలో ఉన్న వీరధర్మ నాసికను మళ్ళీ తాకింది. ఏదో చల్లని కాంతి అతడి కనురెప్పలపై పడింది. సింహగాయత్రీ దర్శనంతో పరవశుడయ్యాడు వీరధర్మ. అతడి పరోపకార పరాయణత్వాన్ని ప్రశంసించింది ఆ దేవత. అదే నోటితో అతడి మరణ రహస్యాన్ని కూడా తెలియజేసింది. కోరిన వరం ప్రసాదించేందుకు అతడికో నిబంధన విధించింది! ఏమిటా నిబంధన?**

"పాత్రలోకి చూడు, ధర్మా!" దేవత కంఠం హెచ్చరించింది.

వీరధర్మ చూశాడు. పాత్రికలో జలం లేదు. క్షీరం ఉంది!

"ధన్యోస్మి మాతా, ధన్యోస్మి!" వీరధర్మ కంఠంలో భక్తి పరవశించింది.

"ధర్మా! నాపరీక్షలో నువ్వు విజయం సాధించావు! నిన్ను నా ఆంతరంగిక భక్తుడిగా స్వీకరించి, అనుగ్రహిస్తున్నాను. నీకు ఒక హితబోధ చేస్తాను...పాటిస్తావా?"

"ఆలోచనతో, అభివ్యక్తీకరణతో, ఆచరణతో త్రికరణ శుద్ధిగా, నీ దివ్య పాదపద్మాల సాక్షిగా శిరోధార్యంగా పాటిస్తాను, మాతా!"

"భూలోకంలో జన్మించి, అవతరించి మృత్యుంజయులుగా, చిరంజీవులుగా ఉన్న వాళ్ళు కారణ జన్ములు. అంశావతారులు. వాళ్ళను అనుకరించడం వాంఛనీయం కాదు; అనుసరించడం శ్రేయస్కరం! మానవుడు నిజంగా మృత్యుంజయుడుగా ఎప్పుడు అవుతాడో తెలుసా! అకాల మరణం చెందనప్పుడు! దుర్మరణం చెందనప్పుడు! ఆహార విహారాదుల అసమతౌల్యంతో అనారోగ్యాన్ని కొని తెచ్చుకుని అప మృత్యువాత పడనప్పుడు! మానవ జీవన వ్యవధానం అయిన దీర్ఘాయుష్షు అనబడే శతవత్సరాలు జీవించినప్పుడు! అర్థ, కామ, మోక్షాలకు ధర్మాన్ని ప్రాతిపదికగా చేసుకుని, పరోపకార పరాయణతతో, అహింసా ప్రవృత్తితో ధర్మజీవనం సాగించి, జన్మను చరితార్థం చేసుకుంటూ నూరేళ్ళ నిండు జీవితాన్ని అనుభవించినప్పుడు! ఈ విధంగా జీవించిన మానవుడు అమరుడే; మృత్యుంజయుడే! అర్థమైందా?"

"నీ వాక్కు అమృతవాక్కు మాతా! నీ మధుర వాక్కు నాకు కనువిప్పు కలిగించిన వేదవాక్కు మాతా!" వీరధర్మ స్వర్ణపాత్రను కిందపెట్టి, చేతులెత్తి నమస్కరించాడు.

"దీర్ఘాయుష్మాన్ భవ!"

సింహగాయత్రీదేవి ఆశీస్సు సుమధుర శ్రావ్య సంగీతంలా వీరధర్మ చెవులను సోకింది. దీర్ఘాయుష్మాన్‌భవ...ఒక్కసారిగా అతని మేను నిలువెల్లా పులకించింది. ఆనందబాష్పాలు అతని దీర్ఘాయుర్దాయాన్ని కొలతవేస్తున్న సాధనాల్లా గీతలాగా బుగ్గల మీద సాగుతున్నాయి.

"అమ్మా...!" భావేశం, భక్తిభావేశం అతని



## అవన్నీ 'చందమామ' కహానీలే!

*కాజల్‌ని టాలీవుడ్‌లో అందరూ చందమామ అని ముద్దుగా పిలుచుకుంటారు. 'చందమామ' సినిమా తరువాత అదే ఆమె ముద్దు పేరయిపోయింది. ఈ చందమామ ప్రస్తుతం బాలీవుడ్‌లో రణదీప్ హుడాతో ఓ సినిమా చేస్తోంది. టాలీవుడ్‌లో లిప్‌లాక్‌లను తిరస్కరించే కాజల్, బాలీవుడ్‌లో మాత్రం రణదీప్‌కి ఎంచక్కా గాఢ చుంబనాలు పెట్టేసింది. ఈ ఫోటో నెట్‌లో రావడంతో కొత్త కహానీ వినిపిస్తోంది. సినిమాలో ఆ లిప్‌లాక్ ఉందన్న సంగతి తనకి తెలియనే తెలియదట! రణదీప్ ఆకస్మాత్తుగా లిప్‌లాక్ పెట్టేసరికి తను షాకయ్యానంటూ కథలు చెబుతోంది. ఆ లిప్‌లాక్ ఫోటో చూసిన వారెవ్వరూ కాజల్ కహానీలు నమ్మడం లేదు.*

కంఠ స్వరాన్ని తగ్గించాయి.

సింహగాయత్రీదేవి చిరునవ్వు చిందిస్తూ అంతర్ధానమైంది.

తన సర్వస్వాన్నీ కుదిపి వేస్తున్న మరో మహదానందాన్ని నియంత్రించే ప్రయత్నం చేస్తూ, సింహగాయత్రీదేవి ఆవిర్భవించి, అంతర్ధానమైన ప్రదేశాన్నే చూస్తూ సచ్చిదానంద శిల్పంలా ఉండిపోయాడు వీరధర్మ...

•••

చతురాననాచార్యుల గృహప్రాంగణంలో ఆనందం తాండవిస్తోంది. ఆయన శిష్యులూ, ఆశ్రితులూ, అగ్రహారంలోని బంధువులూ, మిత్రులూ ఆనందోత్సాహాలతో అటూ యిటూ తిరుగుతున్నారు.

వీరధర్మ సింహక్షీరం తెచ్చిన మిత్ర సాహస వార్త విప్రవిదిశ అగ్రహారాన్ని కుదిపివేస్తోంది. జనం చతురాననాచార్యుడి భవనం వైపు గుంపులు గుంపులుగా వస్తూనే ఉన్నారు. సింహక్షీర, సర్పవిషాల సమ్మేళనంతో వైద్యనాధ అగ్నిహోత్రి రూపొందించిన వినూత్న ఔషధం వ్యాధిగ్రస్థుడైన అగ్నిభట్టారకుడికి ప్రయోగించబడిందనీ, సత్ఫలితాన్ని ఇస్తున్న సూచనలు కనిపిస్తున్నాయనీ తెలుసుకుని ఆనందం వ్యక్తం చేస్తూ, వృద్ధ చతురాననాచార్యుడిని అభినందిస్తున్నారు. ఆయన ఆసీనుడైన మండపం చుట్టూ జనం కిటకిటలాడుతున్నారు.

భవంతి ప్రధానద్వారం ప్రక్కన అరుగు మీద కూర్చున్నారు మార్తాండుడూ, వీరధర్మా. వచ్చేపోయే వాళ్ళందరూ వీరధర్మను అభినందనపూర్వకంగా చూస్తున్నారు. సింహం పాలు సాధించి తెచ్చిన వీరధర్మనూ, వీరధర్మను తీసుకువచ్చిన మార్తాండుడినీ మెచ్చుకుంటున్నారు.

ఔషధ ప్రయోగం జరిగిన గంట తరువాత వైద్యుడు భవంతి లోంచి ఇవతలకి వచ్చాడు. ఎవ్వరినీ పలకరించకుండా ప్రాంగణం మధ్యలో ఉన్న మండపం వైపు చకచకా నడిచాడు. అతని నడకలో ఏదో ఆత్రుత. చుట్టూ చేరిన జనాన్ని తోసుకుంటూ మండపం పైకి ఎక్కాడు. చతురాననాచార్యుడు ఆయన వైపు ఆత్రుతగా, ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఆర్యా, అగ్నిభట్టారకుడికి ప్రాణాపాయం తప్పింది. వ్యాధి చక్కగా నిమ్మళిస్తోంది!"

చతురాననాచార్యుడు వికసించిన, చెమ్మగిల్లిన కళ్ళతో చూశాడు.

"శరీరంలో గూడుకట్టి ప్రజ్వరిల్లుతూ వచ్చిన అధికోష్ణ ప్రకోపం స్వేద రూపంలో వెలికి వచ్చేసింది. అబ్బాయి రెండు దినాలలో లేచి తిరుగుతాడు!"

"చాలా సంతోషం వైద్యనాధా! నీ శ్రమకు తగిన పారితోషికం ఇస్తాను.."

"దేవవైద్య శిఖామణి, ధన్వంతరీ, ఆయుర్వేద పితామహులు చరక మహాశయుడు నాకు గొప్ప పారితోషికం బహూకరించారు. వాళ్ళ ఆశీస్సులతో ప్రాణాంతకాలైన సర్పవిషంతో, సింహక్షీరంతో నూతన ఔషధాన్ని రూపొందించి, ధైర్యంగా ప్రయోగించగలిగాను!"

"అవును. వైద్య రంగంలో, చికిత్సా పర్వంలో నీవు చేసింది సాహసమే! చరిత్ర నీ గురించి చెప్పుకుంటుంది! అబ్బాయి లేచి తిరిగే వరకూ నువ్వు వాడి

## నవ్యవీక్లి-నాటా సంయుక్త నిర్వహణలో బహుమతి పొందిన కవిత




### ఒక రోజు

ఉషోదయపు కాంతులు
ప్రసరిస్తున్న కాలంలో
నా బాల్యం బద్ధకంగా ఒళ్ళువిరుచుకుంది!

తెల్లారిందో లేదోగానీ
ఆకాశమంత మబ్బులు కమ్మినట్లు...
నా కళ్ళకి చదువుల సంచి, స్కూలు బెంచీ తప్ప
సరదా పరదాలు, ఆటల తోటలు కనిపించని
సుడిగుండంలో-
కన్నీళ్ళే ఉప్పునీరుగా తాగుతూ
ఒంటరిగా నేను...!!

యవ్వనపు మధ్యాహ్నం
ఆకలి కేకల కాలానికి కడుపు నింపేందుకు
ఉరుకులు పరుగులు తీయించి-
కాసుల రేసుల కోసం రెక్కలు ముక్కలు
చేసుకుంటూ....
మళ్ళీ నేనే!!!

ఇక సాయంత్రం!
మధ్యవయస్సు కాలమంతా కనుసన్నల చూపుల్లో
పిల్లల చదువులు... ఉద్యోగాలు... పెళ్ళిళ్ళ సందళ్ళ మధ్య
సెటిల్మెంట్లతో-
సరదాల నా గాలిపటం ఎటో ఎగిరిపోయింది!!

రాత్రైంది!
చీకటి కమ్ముకున్నట్లు...
కళ్ళు మసకైపోయి...
గతకాలపు ఆనవాళ్ళను తడుముకుంటూ
ఒకొక్కటీ అలికిడి చేసుకుంటున్నాయి!!
అలసిన ఈ దేహపు చాపకి




పందిరి మంచపు పాన్పుపై 'సయ్యాట'లాడాలనే
ఓ సరదా మళ్ళీ పరదా కప్పుకుంటోంది!!!

కాలం తిరిగొస్తే...
మళ్ళీ పాత వయస్సు కలిసొస్తే...
తీరని కోరికల్ని తీర్చుకోవాలనే ఆరాటం-
తీరని ఆశగా, నేలకొరిగే శ్వాసగా...
రేపు అనే మరో జన్మకోసం
ఎదురుచూస్తూ, కాపుకాస్తూ...!!?

**-చలపాక ప్రకాష్**
**సెల్:92474 75975**

తోనే ఉండాలి..." చతురాననాచార్యుడు అన్నాడు.

"అలాగే, అలాగే!" అంటూ వైద్యనాధ అగ్నిహోత్రి మండపం దిగి భవనం వైపు వెళ్ళాడు. అరుగు మీద కూర్చున్న వీరధర్మను చిరునవ్వుతో చూశాడు.

"నాయనా, ఎలా సాధించావో నాకు తెలీదు కానీ, మహా సాహసంతో కూడిన అద్భుతం చేశావు. చతురాననాచార్యుల వారి వంశానికి ప్రాణం పోశావు! భగవంతుడు నిన్ను చల్లగా చూస్తాడు!"

వీరధర్మ చిరునవ్వు నవ్వాడు. "నేను సమకూర్చగలిగింది కేవలం అనుపానం మాత్రమే, ఆర్యా! ఔషధమూ, నిర్ణయమూ, చికిత్సా ఇవన్నీ మీరు చేసిన అద్భుతాలు!"

"మీ ఇద్దరి ప్రయోగాలూ నిజంగా సాహసాలే!" మార్తాండుడు నవ్వుతూ అన్నాడు.

"అంతా పైవాడి దయ, మార్తాండుల వారూ! ఎలాగైతేనేం...దివ్యదర్భవంశం నిలబడింది! సమయానికి ఒక మహాసాహసవంతుడిని తీసుకువచ్చారు!" వైద్యుడు తృప్తికరంగా నవ్వుతూ భవంతి లోపలికి వెళ్ళిపోయాడు.

చతురాననాచార్యులు మండపం దిగి, ఇద్దరు యువకుల సహాయంతో భవనం వైపు వస్తున్నాడు.

"తన వంశాంకురాన్ని చూడటానికి ఆచార్యులు వస్తున్నారు!" మార్తాండుడు చిరునవ్వుతో అన్నాడు.

•••

వీరధర్మనూ, మార్తాండుడినీ ఏకాంతంలోకి పిలిపించుకున్న చతురాననాచార్యుడు ఆప్యాయంగా పలకరించి, కూర్చోమన్నారు. ఆయనకు దగ్గరగా ఆసనాల మీద ఇద్దరూ కూర్చున్నారు.

ఆనందంతో, తృప్తితో కళకళలాడుతున్న చతురాననాచార్యుడి ముఖం మీద చిరునవ్వు కాపురం చేస్తోంది.

"నాయనా మార్తాండా, 'ఇదం బ్రాహ్మ్యం, ఇదం క్షాత్రం' అన్న పరశురామ భగవానుల స్ఫూర్తితో నిండిన నిన్ను నమ్మి సహాయం కోసం పిలిపించి, ఆశ్రయించాను. నువ్వు పెద్ద మనసుతో నీ అశక్తతను వెల్లడించి, యీ వీరకుమారుడి చేత అద్భుతం చేయించావు. నీ మేలు మరిచిపోలేను!"

"అలా అనకండి ఆర్యా...విప్రవిదిశ అగ్రహారమే మీకు రుణపడి ఉంది!" మార్తాండుడు అన్నాడు.

"ఘనత నాది కాదు. వీరధర్మది. ఈ వీరపుత్రుడు చేసిన మహత్కార్యాలు ఇతడిని పరోపకార పరాయణుడిగా నిరూపిస్తున్నాయి!"

"వీరపుత్రుడైన యీ వీరధర్మకు, నేనూ అగ్నిభట్టారకుడూ మాత్రమే కాదు రాబోయే తరాలలో మా వంశంలో జన్మించే వాళ్ళందరూ రుణపడి ఉంటారు. వీరధర్మ సాహసాన్ని నేను స్వహస్తాలతో లిపిబద్ధం చేస్తాను!" అంటూ చతురాననాచార్యుడు వీరధర్మ వైపు చూశాడు.

నాయనా వీరధర్మా, నువ్వు మా దివ్యదర్భ వంశ ప్రాణదాతవు! ఈ మాట నిజం. ఈ యదార్థాన్ని ఒకసారి కాదు, వందసార్లు కాదు; శతకోటి పర్యాయాలు నా హృదయం స్మరిస్తోంది! నీ రుణం తీర్చుకోవడం అసాధ్యం! ఎందుకంటే నీ సహాయానికి విలువ కట్టలేను. కొండంత దేవుడికి గోరంత నైవేద్యంలాగా నా కృతజ్ఞతను...బంగారం రూపంలో తెలియజేయాలనుకుంటున్నాను..." అంటూ అంత సేపూ ఒడిలో ఉంచుకున్న చిన్న మూటను తీసి వీరధర్మ వైపు చూశాడు. "నువ్వు చల్లగా కలకాలం వర్ధిల్లాలి. నువ్వు జన్మించిన వంశం అభివృద్ధి చెందాలి!"

వీరధర్మ చిరునవ్వు నవ్వాడు. "దీనారాలూ, దీవెనలూ ఇచ్చేముందు, దయచేసి దీనిని ఒకసారి తిలకించండి!"

వీరధర్మ నడుములో దోపి ఉంచుకున్న చిన్న అరలాంటి పేటికను తీశాడు. తెరిచి, లోపలున్న లేఖనం సవ్యంగా కనిపించేలా చతురాననాచార్యుడికి అందించాడు.

"ఏమిటి నాయనా ఇది?" అంటూ అందుకుని, కళ్ళు చిట్లిస్తూ చదివాడు చతురాననాచార్యుడు. చదివి, తలెత్తి, వీరధర్మను చూసి, తల దించి, మళ్ళీ జాగ్రత్తగా చదివాడు.

"నాది వీరతిలక వంశం ఆర్యా..." వీరధర్మ అన్నాడు.

అరను పట్టుకున్న చతురాననుడి చేతులు వణికాయి. లేఖనం ఉన్న అర అతని చేతుల్లోంచీ జారి క్రిందపడిపోయింది. ఆయన తల మెల్లగా పైకి లేచింది. ఎర్రటి పెదవులు అదురుతున్నాయి...." నాయనా..."

"ఔను ఆర్యా. మీరు అనుగ్రహించిన శాపాన్ని మోస్తున్న వీరతిలక వంశంలో నాలుగవ తరానికి చెందిన ఏకైక పురుష సంతానాన్ని...వీరతిలక వంశం... మీ శాపం...గుర్తుందా, ఆర్యా?"

చతురాననాచార్యుడు రాతి విగ్రహంలా ఉండిపోయాడు. జరుగుతున్న నాటకాన్ని అయోమయంగా చూస్తున్న మార్తాండుడు చూపులను వీరధర్మ వైపు మళ్ళించాడు.

"వీరధర్మా...ఏమిటిది? తొందరపడి, ఆచార్యులను అనుమానిస్తున్నావా?"

"ఇది అనుమానం కాదు ఆర్యా... సింహగాయత్రీ మాత పలికిన సత్యం!"

మార్తాండుడు నివ్వెరపాటుతో చూశాడు. "సింహగాయత్రి పలికిందా?"

"ఆ తల్లి వాక్కుల సారాంశం వినిపిస్తాను వినండి! 'ధర్మా, నువ్వు ఎవ్వరి వంశాంకురం ప్రాణం కోసం క్షీర వరం కోరుతున్నావో ఆ వంశ వృద్ధుడు చతురాననుడే మీ వంశాన్ని శపించిన వ్యక్తి! శపించిన వ్యక్తే శాపాన్ని ఉపసంహరించాలి. మరొకరు ఆ పని




చేయలేరు; చేయరు. కొందరికి శపించే శక్తి మాత్రమే ఉంటుంది. ఉపసంహరించే శక్తి ఉండదు! నీ వంశాన్ని శపించిన చతురాననుడికి ఉపసంహారశక్తి ఉందో లేదో అతనికే తెలియాలి. శాపం ఉపసంహరించబడేంత వరకూ నేను కూడా నీకు పూర్ణాయుష్షు ప్రసాదించలేను! ఆలోచించుకో! వంశాన్ని శాపగ్రస్థం చేసిన వ్యక్తి వంశాంకురం కోసం సింహక్షీరం ప్రసాదించమంటావా?"

"ఇది ఆ మాత వాక్కు.. నాకు తన చివరి సాక్షాత్కారం అదేననీ, చివరి వాక్కూ కూడా అదే అనీ హెచ్చరించింది. ధర్మం తప్పడం, వాగ్దానభంగం చేయడం నాకు ఇష్టం లేదు. నా వంశం కోసం, నా పూర్ణాయుర్దాయం కోసం ఆలోచించకుండా సింహక్షీరాన్ని వరంగా ప్రసాదించమన్నాను" వీరధర్మ వివరించి, ఆగాడు.

"వీరధర్మా...నువ్వు ఆదర్శ యువకుడివి. ఆదర్శ వీరుడివి!" మార్తాండుడు ఉద్రేకంతో అన్నాడు. "ఆర్యా, విన్నారు కదా! వీరధర్మ మీ వంశాభివృద్ధిని కోరుతూ ఎంత త్యాగం చేశాడో విన్నారు కదా!" అన్నాడు చతురాననుడితో.

"నేను చెవిటివాణ్ణి కాదు మార్తాండా!" చతురాననుడు వణికే కంఠంతో అన్నాడు. చూపులను వీరధర్మ వైపు మళ్ళించాడు.

"నాయనా, నీ త్యాగం నాకు దధీచినీ, శిబిచక్రవర్తినీ, కర్ణుడినీ గుర్తుకు తెస్తోంది! నిజమే! నీ వీరతిలక వంశంలో జన్మించే పురుషులందరూ ఏడు తరాల పాటు అల్పాయుష్కులై మరణించేలా శపించింది నేనే! అందుకు కారణం ఉంది. ఆనాడు నాది అకారణ ఆగ్రహం కాదు. ఆ సమయంలో వైశాలిక రాజ్యం పొలిమేరలో, అరణ్య సమీపాన నా ఆశ్రమం ఉండేది..." చతురాననుడు ఆగి, కళ్ళు మూసుకున్నాడు.

వీరధర్మ, మార్తాండుడు ఇద్దరూ ఆసక్తిగా వింటున్నారు. వీరధర్మ తదేకంగా వృద్ధుడినే చూస్తున్నాడు. తనలో తను ఏదో వల్లె వేసుకుంటున్నట్టు ప్రారంభించాడు చతురాననుడు.

"నా ధర్మపత్ని పేరు విశుద్ధ. మాకు ఇద్దరు కుమారులు, కవలలు కలిగారు. సారూప్య కవలలు. పెద్దవాడి పేరు స్థిరుడు, చిన్నవాడి పేరు సుస్థిరుడు. ఆనాడు మా పుత్రుల ఏడవజన్మదినం. ఆశ్రమ సమీపంలో ఫలవృక్షాలతో నిండిన అరణ్య ప్రాంతంలో విహరించడానికి వెళ్ళాం. అప్పటికి ఏడేళ్ళ నాడు అదే దినాన, అదే ప్రాంతంలో సెలయేటి గట్టున, వటవృక్షం క్రింద నా భార్య కవలల్ని ప్రసవించింది! నా బిడ్డలు భూమిమీద పడిన ప్రదేశానికి తీసుకెళ్ళాం. ఊయల ఊగాలన్నారు పిల్లలు. వటవృక్షం ఊడలను కలిపి, ఊయలగా చేశాను. పిల్లలు ఒకరి వెనుక ఒకరు, సుస్థిరుడి వెనుక స్థిరుడు ఊయల మీద నిలుచుని ఊగుతున్నారు. నా భార్య ఆనందంగా ఊయల ఊపుతోంది. నేను సమిధలు ఏరుతున్నాను.

అంతలో ఉన్నట్టుండి పిల్లలు కెవ్వున అరిచారు. నా భార్య బిగ్గరగా అరిచింది. చూశాను. ఆ దృశ్యాన్ని యీ జన్మలో మరిచిపోలేను. ఊడల ఊయల మీద జంటగా నిలుచున్న నా చిన్నారి కొడుకులిద్దరినీ ఒక్కటిగా గుదిగుచ్చుతూ, గుచ్చుకుంది బాణం! ఇద్దరూ ఒక్కటిగా నేలకూలిపోయారు. ఆ పసిప్రాణాలు ఎగిరిపోయాయి. నా నోట ఆ మాట వెలువడగానే నా ఇల్లాలు కుప్పకూలిపోయింది. మళ్ళీ లేవలేదు...కన్నబిడ్డలతో కన్నతల్లి కానరాని లోకాలకు కదిలిపోయింది.

కట్టుకున్న భార్యా, కన్నబిడ్డలూ శవాలైపోయారు. నన్ను జీవచ్ఛవంలా మిగిల్చారు. నేల మీద పడి రోదిస్తూ ఉండిపోయాను. అశ్వం మీద ఒక విలుకాడు వచ్చాడు. అటుగా పరుగెత్తిన లేడిని కొట్టడానికి బాణం రువ్వానన్నాడు. అప్పటికే నేను తపోధనుణ్ణి. నా దగ్గరున్న ఆయుధం శపించే శక్తి ఒక్కటే... శపించాను. ఏడుతరాల పాటు నా శాపాగ్ని మీ వంశజుల మీద ప్రభావం చూపుతుందన్నాను. భార్యాబిడ్డలతో నలభై యేళ్ళ దాకా జీవించాలి. పరిపూర్ణ జీవితానందాన్ని అనుభవించే ఆ తరుణంలో మరణించాలి. సుఖం తెలియాలి..ఆ సుఖాన్ని కబళించే దుఃఖం తెలియాలి!

"విలుకాడు తనెవరో చెప్పాడు. కులగోత్రాలు చెప్పాడు. క్షమించమని కాళ్ళ మీద పడ్డాడు. శాపాన్ని ఉపసంహరించమని వేడుకున్నాడు. తిరస్కరించాను! మరొక శాపం ఇస్తానని హెచ్చరించాను. వెళ్ళిపోయాడు. అతనే తాళ పత్రం మీద లిఖించి ఉంటాడు.."

**(ముగింపు వచ్చేవారమే)**

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో PCOD సమస్యకు సరైన పరిష్కారం



డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్

PCOD అనేది నేటికాలం స్త్రీలలో నానాటికీ పెరుగుతున్న ఆరోగ్య సమస్య. దాదాపు **25** శాతం నుండి **30** శాతం వరకు స్త్రీలు ఈ PCOD సమస్యతో బాధ పడుతున్నారు. యుక్త వయస్సు వారిలో ఇది తొలుత మొటిమలు, బరువు పెరగడం మరియు అవాంఛిత రోమాలను కలుగజేసే ఒక సౌందర్య సమస్యగా పరిణమిస్తుంది. ఇదే PCOD సమస్య వివాహిత స్త్రీలలో తలెత్తినపుడు పై సమస్యలతో పాటు సంతానలేమి సమస్యను కూడా ఎదుర్కోవడం జరుగుతుంది. నేటికాలపు ఆధునికతతో పాటు మారిన జీవన శైలి, అధిక మానసిక ఒత్తిడి మరియు సరైన వ్యాయామం లోపించడం వంటి అంశాల ప్రభావం హార్మోన్లపై ఎక్కువగా ఉండటం వలన అవి అసమతుల్యతకు గురి కావటమే PCOD సమస్య ఉత్పన్నమవడానికి ప్రధాన కారణం.

పీ.సీ.ఓ.డి. అనగా: అపరిపక్వమైన అండం (ఇమ్మెచ్యూర్ ఫాలికల్) నీటి బుడగల మాదిరిగా రూపాంతరం చెంది, అండాశయపు గోడలపైన ఉండిపోవటాన్ని పీ.సీ.ఓ.డి. అంటారు. ఇలా రెండు అండాశయాలపై ఏర్పడటాన్ని బైలేటరల్ పీ.సీ.ఓ.డి. అంటారు. సాధారణ రీతిలో నెలసరి ఉన్న మహిళలలో నెలసరి అయిన **11-14** రోజుల మధ్యలో, ఇరు అండాశయాలలో ఏదో ఒక అండాశయం నుండి అండం విడుదల అవుతుంది మరియు అది ఫలదీకరణకు సిద్ధంగా ఉంటుంది. కానీ పీ.సీ.ఓ.డి. సమస్య ఉన్న మహిళలలో అండం విడుదల కాకుండా, అపరిపక్వత చెంది, అండాశయపు గోడలపై నీటి బుడగల వలె ఉండిపోతుంది.




**కారణాలు:** పీ.సీ.ఓ.డి. తలెత్తటానికి ఖచ్చితమైన కారణాలు తెలియరాలేదు, కానీ ఇది చాలా వరకు హార్మోన్ల అసమతుల్యత వలన ఉత్పన్నమవుతుందని డాక్టర్లు నిర్ధారించటం జరుగుతుంటుంది. • F.S.H., L.H., టెస్టోస్టిరాన్ మరియు ప్రొలాక్టిన్ హార్మోన్ల స్థాయి పెరగడం. • **ఇన్సులిన్ రెసిస్టెన్స్:** దీని వలన రక్తంలో ఇన్సులిన్ శాతం పెరిగి టెస్టోస్టిరాన్ హార్మోన్ల స్థాయి పెరిగిపోవటంతో- ఇది స్థూలకాయానికి దారితీసి, పీ.సీ.ఓ.డి. సమస్యను ప్రేరేపించటం జరుగుతుంది. • వంశపారంపర్యత, అధిక మానసిక ఒత్తిడి, వ్యాయామం లోపించడం వంటి అంశాలన్నీ ఈ సమస్యకు కారణాలు కావచ్చు.

**లక్షణాలు:** నెలసరి సరిగా రాకపోవడం, నెలసరి సందర్భంలో ఎక్కువ లేదా తక్కువ రక్తస్రావం కావటం, నెలసరిలో రక్తస్రావం **4-5** రోజులకు మించి కొనసాగటం, రెండు ఋతుచక్రముల మధ్యలో రక్తస్రావం అవటం. • నెలసరి సరిగా వచ్చినా కూడా, అండాశయం నుండి అండం విడుదల కాకపోవడం. • ముఖం మరియు వీపు భాగంలో మొటిమలు రావడం. • చర్మపు మడతలతో పాటు మెడ భాగంలో చర్మం మందంగా మరియు నల్లగా మారటం • సంతానలేమి • తలనొప్పి • బరువు పెరగటం • తల వెంట్రుకలు ఎక్కువగా రాలి పోవటం • కొందరిలో బరువు సాధారణంగా ఉండటం మరియు కొందరిలో బరువు తగ్గటం కూడా గమనించవచ్చు. • ముఖం మరియు ఛాతీ పైన మగవారికి మాదిరిగా వెంట్రుకలు రావడం. • మానసిక అశాంతి వంటి లక్షణాలు కనిపిస్తాయి.

దుష్ప్రభావాలు: టైప్-2 డయాబెటిస్, గుండె జబ్బులు, కొలెస్ట్రాల్ సమస్యలు, అధిక రక్తపోటు, ఎండోమెట్రియం క్యాన్సర్ వంటి తీవ్ర సమస్యలకు పీ.సీ.ఓ.డి. దారి తీస్తుంది.

తీసుకోవలసిన జాగ్రత్తలు: జీవన విధానంలో మార్పులు చేసుకుని- ముఖ్యంగా ఒత్తిడిని తగ్గించుకోవాలి. క్రమం తప్పకుండా వ్యాయామం చేయాలి. • బరువును అదుపులో ఉంచుకోవడం ద్వారా డయాబెటిస్, అధిక రక్తపోటు, కొలెస్ట్రాల్ వంటి సమస్యలకు దూరంగా ఉండవచ్చు. • అధిక క్రొవ్వు మరియు జంక్ ఫుడ్స్ తీసుకోకపోవడం వంటి జాగ్రత్తలు తీసుకోవడం ద్వారా పీ.సీ.ఓ.డి. సమస్యను కొంతవరకు నియంత్రణలో ఉంచవచ్చు.

హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స: హార్మోన్ల అసమతుల్యత వలన వచ్చే ఇలాంటి జబ్బులను హోమియోపతి మందులతో పూర్తిగా నయం చేయవచ్చు. హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో మాత్రమే అందించబడే జెనెటిక్ కాన్స్టిట్యూషనల్ చికిత్సతో, ఎటువంటి దుష్ప్రభావాలు చూపని రీతిలో PCOD సమస్య నివారణతో పాటు, అంతవరకూ ఎదుర్కొన్న దుష్ప్రభావాలను కూడా పూర్తిగా తగ్గించవచ్చు. యుక్తవయస్సులోనే ఈ సమస్యను గుర్తించి, సరైన చికిత్సను తీసుకోవటం వలన ఇన్‌ఫెర్టిలిటీ, ఒబేసిటీ వంటి కాంప్లికేషన్ల బారిన పడకుండా కాపాడవచ్చు.

ఉచిత కన్సల్టేషన్ **955 000 1188 / 99**

www.homeocare.in



# సినీ నారాయణీయం

## (ఎమ్మెస్ నారాయణ జీవితచిత్రం) 20

**సిగరెట్ ఒకటి కాల్చుకొస్తాం సార్. ఆపుదాం ఇక్కడ అన్నారు వాళ్ళు. వెళ్ళి సిగరెట్ కాల్చుకుని వచ్చారు. మళ్ళీ కథ చెబుతుంటే రికార్డింగ్ చేశారు. అయిపోయేవరకూ ఇక కదలకుండా అలాగే కూర్చుండిపోయారు. ఇక అప్పటి నుంచీ ఇప్పటి వరకూ వాళ్ళందరూ నా బెస్ట్ ఫ్రెండ్స్. ఆల్ టీమ్. బికాజ్ ఆఫ్ దట్ 'సవ్యసాచి'. అట్లాంటి కథ వాళ్ళు వినలేదు. అది ఎలాంటి స్క్రీన్‌ప్లే అంటే ఇవాల్టికీ అప్‌డేటే.**

ఇక్కడి నుంచి ముప్ఫై సంవత్సరాల వెనక్కు వెళ్ళి సౌండ్ కార్డ్ పడుతుంది. దటీజ్ ది స్ట్రీన్ ఆఫ్ ది సబ్జెక్టు. అది రవిరాజాగారు సొంతంగా తీయడానికి తీసుకున్నారు. ఆ విధంగా నేను మద్రాసులో రచయితగా స్థిరీకరించబడ్డాను. అయితే రవిరాజాగారు సవ్యసాచి సినిమా తీయలేకపోయారు. ఆ కథ తీద్దామని అనుకుంటూ ఉండగా, 'చంటి' ఆఫర్ వచ్చింది.

# నెం.1 కమెడియన్‌గా నన్ను విజువలైజ్ చేశాడాయన

మంచి బ్యానరు. మంచి సినిమా. సొంత సినిమా తీసి రిస్కు చేయడం ఎందుకు. ఎవరైనా అలాగే ఆలోచిస్తాం. అందుచేత వెంకటేష్, మీనాలతో 1992లో చంటి తీశారు. ఇక అక్కడి నుంచి ఆయన బిజీ అయిపోయారు. చంటి నుంచి పెదరాయుడు. ఇలాగా పెద్ద డైరెక్టర్ అయిపోయి వీటి ల్లోకి వెళ్ళిపోవడం వల్ల ఆ సినిమా తీయలేకపోయారు. ఆ సినిమా తీద్దాం అనుకునే సరికి మళ్ళీ తమిళంలో అమైధి పడై సినిమా తీశారు. ఇదే చిత్రాన్ని తెలుగులో మోహన్‌బాబు గారితో 'యమ్. ధర్మరాజు ఎం.ఏ' గా తీశారు.

### చెవిటివాడిగా తొలి వేషం

సవ్యసాచి కోసం నేను వెయిట్ చేస్తున్నా. ఒక గ్రేట్ రైటర్ అనే పేరు వస్తుందన్న ఆశతోటి. ఆయన దగ్గరే ఉన్నా.

అప్పుడు ఆయనేం చేశారు. యమ్. ధర్మరాజు ఎం.ఏ తీసేటప్పుడు ఒక చెవిటి వేషం రాశారు. ఎం.ఎస్. హరినాథరావు గారు దానికి రచయిత. రాస్తే ఈ చెవిటి వేషం వేయటానికి ఒక వెర్రి పప్ప మొహం ఉన్నవాడు ఒకడు కావాలి మనకి అని వీళ్ళు డిస్కషన్ చేసుకుంటున్నారు. దాంట్లో వెర్రిపప్పం మొహం అంటే మనకి ఎమ్మెస్ అనే రైటర్ ఉన్నాడు కదండి, అతను కరెక్టుగా అలాగే ఉంటాడు అని వీళ్ళు అన్నారు. కరెక్టేనయ్యా ఆయనలో నాకదే అనిపించింది అని ఈయన అన్నారు. డైరెక్టరుగారే నా పేరు సజెస్ట్ చేశారు. నన్ను పిలిచారు.

నేను వెళ్ళా. ఏమండీ మీకొక వేషం ఉంది రేపు వేయాలి అన్నారు. నాకొద్దు సార్. వేషాలు వద్దండి. నేనొక లెక్చరర్‌ని. డిస్టర్బ్ అయిపోతాను అన్నా. లేదండి. మీరు ఒక గొప్ప నటుడు అవుతారు. నెంబర్ వన్ కమెడియన్ అవుతారు మీరు. నా మాట వినండి. వేయండి అన్నారు. అది దర్శకుడి విజన్. ఇప్పుడు ఇక్కడ ఇలా మాట్లాడుతున్న నన్ను 1994లోనే నెంబర్ వన్ కమెడియన్‌గా ఆయన నన్ను విజువలైజ్ చేసుకున్నారు. సరే అన్నాను.

### అద్భుతంగా పండిందాసీను

మూడు సీన్లు ఉన్నాయి ఆ సినిమాలో. మొదటి సీనులో, మోహన్‌బాబు రంభని పెళ్ళి చూపులు చూట్టానికి వస్తాడు. నేను చెవిటోడ్ని. రాళ్ళపల్లేమో రంభ నాన్న. నేను ఆయన ఫ్రెండ్‌ని. సీన్లో మోహన్‌బాబుగారు, మల్లికార్జున రావుగారు కానిస్టేబుల్స్ అలా కూర్చుని ఉన్నారు. నేను చెవి టోణ్ణి. రాళ్ళపల్లితో రాసుకోమన్నారు సీను. అక్కడే ఒక పేజీ మీద రాశాను. ఆ పొడుగ్గా ఉన్న వాడేనా పెళ్ళికొడుకు అంటాను నేను రాళ్ళపల్లితో. అవున్రా, పొడుగ్గా ఉన్నవాడే అంటాడు. ఆ నేను ఇంకా పొడుగ్గా ఉన్నవాడేమో అనుకుంటున్నాను అన్నా. అంటే ఆయనంటాడు. పొడుగ్గా ఉన్నవాడని చెప్తున్నాను కదా నీకు అన్నాడు. అయితే ఆ పొడుగంటి వాడు కాదన్నమాటా అన్నా. పెళ్ళోళ్ళు వచ్చారు కాబట్టి సరిపోయింది. లేకపోతే కుళ్ళపొడిచేద్దును నాకొడకా. పొడుగ్గా ఉన్నవాడు పెళ్ళికొడుకు. నువ్వు చెప్పావు కాబట్టి అర్థమైంది సుమా, లేకపోతే పొడుగా టోడు అనుకుందును నేను....అని మళ్ళీ నేను.

అసలు డైరెక్టరు గారు కెమెరా నుంచి వెళ్ళిపోయారు. పొట్టపట్టుకుని నవ్వుతున్నారు. యూనిట్‌లో అందరూ నవ్వుతున్నారు. అసలు షేక్ అయిపోయిందా సీను. సినిమాలో కూడా అద్భుతంగా పండింది. నేను నటుడు అవ్వటానికి రవిరాజాగారు నాతో చేయించిన మొదటి సీను. ఆ తరువాత రెండు అద్భుతమైన సీనులుంటాయి. ఈ సీను తోటి రవిరాజాగారు నన్ను ఆర్టిస్టుని చేశారు. నన్ను రచయితని చేసిందీ ఆయనే. నటుడ్ని చేసిందీ ఆయనే. అయితే రచయితను చేసింది ఆయనే అయినా రచయితగా ఆయనతో నా సినిమా రాలేదనుకోండి.

### 8 పిక్చర్లకు కథలు

అది అలా ఉండగానే 'ప్రయత్నం' అనే సినిమా పరుచూరి గోపాలకృష్ణగారి ఆధ్వర్యంలో వచ్చింది. 'పేకాట పాపారావు' కథ, 'ప్రతిష్ఠ' కథ, 'హలో నీకూ నాకూ పెళ్ళంట', 'అదిరింది గురూ'



రవిరాజా పినిశెట్టి



అని కృష్ణ గారి కథ, ఇలా ఎనిమిది సినిమాలు వచ్చాయి. ఈ ఎనిమిది సినిమాలకి రచయితగా వర్క్ చేశా.

## సినిమా కష్టాలు

**భీమవరం నుంచి మద్రాసు ప్రయాణాలు చేసే రోజులలో రైల్లో జరిగిన కొన్ని సంఘటనలను ఎమ్మెస్ చాలా వివరంగా చెప్పారు.**

"ఒకసారి సర్కారు ఎక్స్‌ప్రెస్‌లో వెళుతున్నా. టికెట్టు తీసుకుని భీమవరంలో ఎక్కా. విజయవాడలో ఏడుగురు ఎక్కారు. వాళ్ళు తిరుపతి వెళ్ళాలి. అంటే ఆ ఏడుగురూ గూడూరు జంక్షన్‌లో దిగాలి. అంతకుముందు నుంచీ నా పక్కన కూర్చున్న పంతులొకడు నన్ను ఏంటి తమ్ముడూ అని పలకరించాడు. ఏం సార్ అన్నా. ఎక్కడికి వెళుతున్నావు అన్నాడు. మద్రాసు వెళుతున్నా. ఆ ఏంటీ వర్క్ అన్నాడు. కథలు రాయడానికి అన్నా. అలాగేం! అన్నాడు. తమ్ముడూ తమ్ముడూ అంటున్నాడు నన్ను. కంపార్ట్‌మెంట్‌లో ఏడుగురు ఉన్నారు కదా, వాళ్ళు టికెట్ తీసుకోడానికి సమయం లేక కదులుతున్న రైలు ఎక్కేశారు. వాళ్ళ దగ్గర టికెట్ లేవనే విషయం వాళ్ళు మాట్లాడుకునే మాటల్ని బట్టి నా పక్కోడికి అర్థమైంది. కానీ నేను పరధ్యానంగా ఏదో ఆలోచనలో ఉన్నా. టికెట్లు ఎక్కడ తీసుకుందాం? అని వాళ్ళు మాట్లాడుకుంటున్నారు. ఒంగోలు స్టేషన్ మాస్టారు మా బావే నండి. నేను కూడా టికెట్ తీసుకోలేదు. మీరు డబ్బులివ్వండి నేనెళ్ళి పట్టుకొస్తానన్నాడు మా పక్కోడు. వీళ్ళు రెండొందలలో, మూడొందలలో, అయిదొందలలో ఇచ్చారు. వాడు తీసుకున్నాడు. ఒంగోలు వెళ్ళేటప్పటికి నేను పై బెర్త్ ఎక్కి పడుకున్నా. నా తమ్ముడు పై బెర్తుమీద పడుకున్నాడు. ఐ. టి. ఐలో జాయిన్ చేయడానికి తీసుకెళ్తున్నాను. వాణ్ణి మీరు జాగ్రత్తగా చూస్తూ ఉండండి అని వీళ్ళ దగ్గర డబ్బు తీసుకుని వాడు ఒంగోలు స్టేషన్‌లో దిగిపోయాడు.

ఒంగోలు దాటి ఐదు కిలోమీటర్లు వెళ్ళినాక వీళ్ళు నన్ను లేపారు. పై బెర్తులో నిద్రపోతున్నా. ఏయ్ కిందకు దిగు అన్నారు. కిందకు వచ్చా. కూర్చో అన్నారు. కూర్చున్నా. మీ అన్నయ్య ఏడి అన్నారు. అన్నయ్య ఎవరన్నా. తమ్ముడు అని పిలిచాడు కానీ వాడు అన్నయ్య కాదు నాకు అన్నా. ఏంటి ప్రాబ్లమ్ అన్నా. మా దగ్గర డబ్బులు తీసుకుని ఒంగోలు స్టేషన్‌లో టికెట్లు తెస్తానని దిగిపోయాడన్నాడు. ఎంతిచ్చారు మీరు అన్నాను. మీ అన్నయ్య కాదా అన్నారు. నా అన్న అయితే ఇవ్వమని నేను చెప్పాలి గానీ, వాడు తీసుకుంటే మీరెందుకిచ్చారు అన్నాను. వెధవ వేషాలు వెయ్యకు అన్నాడు వాళ్ళల్లో ఎవడో. అయితే ఏంటన్నా! ఒరేయ్ వీడి సూట్‌కేసు తీయరా అన్నాడు ఇంకోడు. సూట్‌కేస్ తీసి వాళ్ళ దగ్గర పెట్టుకున్నారు. నేను అగ్రెసివ్‌గా బిహేవ్ చేస్తే లాభం లేదు. జనసంఖ్య ఎక్కువైంది. ఫస్ట్ పాయింట్ ఏంటంటే మ్యాన్ హేండ్లింగ్ చేస్తారు. ఏదైనా రికవర్ చేయవచ్చు గానీ మ్యాన్ హేండ్లింగ్ రికవర్ చేయలేం. మ్యాన్ హేండ్లింగ్ ఎలా రికవర్ చేయాలంటే ఫ్యాక్షనిస్ట్ లాగా వాళ్ళని చంపెయ్యాలి. కసి అంటే అది. అదే ఫ్యాక్షనిజం. మనకంత లేదు.


మోహన్‌బాబుతో...

**ఒకసారి రైల్లో మద్రాసు వెళుతున్నారు ఎమ్మెస్. విజయవాడలో ఏడుగురు టికెట్లు కొనకుండా కదులుతున్న రైలు ఎక్కేశారు. ఏం చెయ్యాలో తెలీక తర్జన భర్జన పడుతున్నారు. ఇదేం పట్టించుకోకుండా ఎమ్మెస్ పైన బెర్త్ మీదకెళ్ళి పడుకున్నారు. నా తమ్ముడు నిద్రపోతున్నాడు చూస్తూ ఉండండి, నేను వెళ్ళి టికెట్లు తెస్తానని ఒకతను వాళ్ళ దగ్గర డబ్బు తీసుకుని రైలు దిగి వెళ్ళిపోయాడు. అప్పుడు వాళ్ళు ఎమ్మెస్‌ని ఏం చేశారు?**

## టచ్ చెయ్యకు

వాళ్ళకి నేను ఒకటే చెప్పా. వాడెవడో లేచి కొట్టబోయాడు. చంపేస్తాను. నన్ను కొట్టకు. తల్లి దండ్రులు కొట్టలేదు. స్కూల్లో ఉపాధ్యాయుడు కొట్టలేదు. నువ్వు ఎవడ్రా అన్నా. వాయిస్‌కున్న పవర్ చేతికి ఉండదు. గాంధీ ఒక్క వాయిస్‌తోనే గెలిచాడు. చెప్పా. ఆగాడు. సూట్‌కేస్ తీసుకో అన్నాడు. తీసుకున్నాను. ఎక్కడ్రా మీ అన్నయ్యా అన్నాడు. గూడూరుకి ఒంగోలుకి జరిగే టాపిక్. ఏడ్రా మీ అన్నయ్య అన్నాడు. వాడు నా అన్నయ్య కాదని చెప్పా. నన్ను అడుగుతావేంటి. వాడు ఎక్కడున్నాడో నువ్వు చూసుకో. చంపేయ్ కొడుకుని అన్నాను. వెధవ వేషాలు వెయ్యద్దు. గొలుసు లాగుతా. మీ దగ్గర టికెట్లు లేవు. ట్రైన్ ఆగిపోద్ది. దింపుతా మొత్తం మ్యాటర్ చెప్తా. పోతారు జాగ్రత్త. టచ్ చెయ్యద్దు నన్ను అన్నాను. ఎవడన్నా నన్ను టచ్ చేస్తే, నేను మరణించేలోపు మా నాన్నగారు చెప్పిన ఒక డైలాగు. మరణం నీ చేతిలో లేదు. నీ వెనకాల నుంచి ఒకడు పొడుస్తాడు. నీవు చనిపోతావు. నీకు తెలీదు కాబట్టి నువ్వు ఫీలవ్వకు. ఎదురుగుండా అన్యాయంగా నిన్ను చంపటానికి ఒకడు వచ్చాడనుకో. ఏ అన్యాయమైనా సరే చేసి వాణ్ణి చంపెయ్ అని చెప్పారు. నాకు బాగా జ్ఞాపకం.

వాడితో చెప్పా. కొట్టకు. వద్దు. చైన్ లాగుతా. మీ దగ్గర టికెట్లు లేవు అని చెప్పా. వాళ్ళు షాక్. ఆగిపోయారు. గూడూరులో ట్రైన్ ఆగింది. దిగా. లిటరల్లీ పరుగుపెట్టుకుంటూ స్టేషన్ మాస్టరు దగ్గరికి వెళ్ళా. ఏంటి సార్ అన్నాడు. నేను చెన్నయ్ వెళుతున్నా. ఇదిగో నా టికెట్. ఎవరో ఎక్కారు. వాళ్ళ దగ్గర టికెట్లు లేవు అన్నా. రండి మీరు. వాళ్ళు నా సూట్‌కేస్ తీసుకున్నారు. ఆయనొచ్చాడు. ఎవరయ్యా అన్నాడు. అందర్నీ దింపారు. వాళ్ళు గూడూరులో దిగాలి. లగేజి దింపారు. ఎవరు మీరు అన్నారు. టిక్కెట్లు ఏవీ? టిక్కెట్లు లేవన్నారు. ఏయ్ నువ్వు ఎక్కేయ్. నీ లగేజ్ ఏది. ఈ సూట్‌కేసు సార్. తీసుకో. నువ్వు ఎక్కేయ్ అన్నాడు. ఆ సూట్‌కేస్ ఇచ్చాడు. నేను ఎక్కేశా. టికెట్ జేబులో పెట్టుకున్నా. ట్రైన్ వెళ్లిపోయింది. వాళ్ళు ఏమయ్యారో ఇవాళ్టివరకూ నాకు తెలియదు. అక్కడ జరిగిందీ ప్రెజన్స్ ఆఫ్ యాక్షన్. ఎందుకు చెప్తా. ప్లాట్‌ఫారం మీద పరిగెత్తా. ఎవరు పరిగెడతారు. మంది లేకుండా.

*(ఇంకావుంది)*

**-కూనపరాజు కుమార్**

**సెల్: 99899 99599**

# పరివర్తన

-విరించి



**ఉదయం పదయింది. ఆదివారం కావడంతో సోమయాజులు ఇంట్లోనే ఉన్నాడు. గేటు దగ్గర చప్పుడైతే ఇంట్లోంచి బయటకు వచ్చి చూశాడు. రోడ్డు మీద నుంచి ఎవరో కుర్రాడు కాంపౌండులో ఉన్న జామ చెట్టు మీదకు రాళ్లు వేస్తున్నాడు. చెట్టునున్నవన్నీ కసుకాయలే. చిన్నచిన్నవి, పండనివి. ఒక్కక్షణం ఆలోచించి లోపలికెళ్లి ఫ్రిజ్‌లోంచి ఓ నాలుగు జామకాయలు చిన్న ప్లాస్టిక్ కవరులో వేసుకుని గేటు దగ్గరకు వచ్చాడు. ఆ కుర్రాడింకా రాళ్లు వేస్తూనే ఉన్నాడు. సోమయాజులు రాకను గమనించే స్థితిలో లేడు. గేటు తీసి నెమ్మదిగా కుర్రాడి దగ్గరకు వెళ్లాడు.**

తైల సంసారం లేని చింపిరి జుట్టు, చిరిగి, మాసి పీలికల్లా ఉన్న నిక్కరు, బనీను, ఒంటి నిండా మట్టితో దుర్గంధభరితంగా ఉన్నాడు. వెనుక నుంచి వెళ్లి ఆ కుర్రాడి భుజం మీద చెయ్యి వేశాడు. వాడు ఉలిక్కిపడి ఒక్కసారి బిక్కచచ్చి పోయాడు. సోమయాజులు ఎక్కడ కొడతాడో నని వణికిపోతున్నాడు.

సోమయాజులు "దా, తీస్కో" అని జామ కాయల కవరు ఇచ్చాడు. వాడు నమ్మలేనట్లుగా తీసుకో డానికి సందేహిస్తూ భయం భయంగా చూస్తు న్నాడు.

"వద్దయ్యా! వద్దు. తప్పయిందయ్యా! ఇంకె పుడూ రాళ్ళెయ్యనయ్యా!" అన్నాడు వాడు వణు కుతూ.

"భయపడకు, నేను నిన్నేం చెయ్యను" అన్నాడు సోమయాజులు భుజం మీద చెయ్యి తీయకుండానే. తీస్తే భయపడి పారిపోతాడని తెలుసు. సోమయాజులు చిరునవ్వుతో వాడికి కాస్త ధైర్యం వచ్చింది.

"ఆకలేస్తోందా?" అన్నాడు అనునయంగా.

"అవునయ్యా!" అన్నాడు వాడు.

నెమ్మదిగా వాడిని తీసుకుని ఇంటి కాంపౌండు లోకి వచ్చాడు. నూతి దగ్గరకు తీసుకెళ్లి రెండు బకెట్ల నిండా నీళ్లు తోడాడు.

"అభీ!" గట్టిగా పిలిచాడు.

ఇంట్లోంచి అభిజిత్ పరిగెత్తుకుంటూ వచ్చాడు. తన ఈడు కుర్రాడే నూతి గట్టు మీద తండ్రి పక్కన ఉండటం చూసి ఆశ్చర్యపోయాడు.

"పిలిచారా నాన్నా!" అన్నాడు.

"అభీ! అమ్మనడిగి ఓ సోప్, షాంపూ ప్యాకెట్, టవల్ పట్రా" అన్నాడు.

"నీ పేరేమిటి?" అన్నాడు సోమయాజులు.

"బండోడు అయ్యా!" అన్నాడు వాడు.

"అదేం పేరురా?"

"మా అమ్మ అలాగే పిలిచేదయ్యా!" అన్నాడు.

"సరే! ఈ షాంపూతో తల, సోప్‌తో ఒళ్లు రుద్దుకుని స్నానం చెయ్యి. ఇడ్లీ తిందువుగానీ" అన్నాడు.

"తానం ఎందుకయ్యా? నేను చెయ్యనయ్యా! నేనెల్లిపోతానయ్యా!" అన్నాడు బండోడు బిక్కు బిక్కుమంటూ. వాడికి ఆ బట్టలు తప్పితే వేరే బట్టలు లేవు.

"స్నానం చేస్తే పది రూపాయలిస్తా. ఆ బట్టలు తడిపేసి ఈ తువ్వాలు కట్టుకో" అన్నాడు.

బండోడికి పదిరూపాయలనగానే ఆశ కలి గింది.

"అభీ! పదిరూపాయలు, నీదో జత బట్టలు పట్రా" అన్నాడు.

దాంతో బండోడికి నమ్మకం కలిగింది. గబ గబా నీళ్లు పోసుకోవడం మొదలుపెట్టాడు. షాంపూ, సబ్బు పూర్తిగా అయిపోయాయి. వాడు స్నానం చేసి ఎన్నాళ్లయిందో, వాడి ఒంటి మీద నుంచి వచ్చిన మురికితో నూతి చెప్టా అంతా నల్లగా తయారయింది. మరో రెండు బకెట్లు నీళ్లి చ్చాడు సోమయాజులు. వాడి స్నానం అవగానే అభిజిత్ పదిరూపాయలు, బట్టలు తెచ్చి బండో డికి ఇచ్చాడు.

"ఆ తడి బట్టలు బయటపడేసి ఈ బట్టలు కట్టుకో" అన్నాడు సోమయాజులు.

**ఆ కుర్రాడు జామకాయల్ని రాళ్ళతో కొడుతున్నాడు. అది చూసి ఆ ఇంటి యజమాని తన ఇంట్లో ఫ్రిజ్‌లో ఉన్న కాయల్ని తెచ్చి ఆ కుర్రాడికిచ్చాడు. మొదట భయపడ్డాడు. తర్వాత బెరుకుగా ఆ కాయలు తీసుకున్నాడు. ఆ చిన్న సంఘటన ఆ కుర్రాడి జీవితాన్నే మార్చేసింది. ఆ చిన్న సంఘటన ఒక మహా యజ్ఞానికి తెర లేపింది! ఏమిటా మహాయజ్ఞం?**

వాడు అలాగే చేశాడు. అభి ప్యాంటూ, షర్టు వేసుకుని తనని తను చూసుకుని మురిసిపోయాడు.

"అభి! అమ్మని ఓ నాలుగు ఇడ్లీలు ప్లేట్‌లో పెట్టి పట్టుకు రమ్మను" అన్నాడు.

పదినిమిషాల్లో అన్నపూర్ణ ప్లేటులో నాలుగు ఇడ్లీలు, మంచినీళ్ల గ్లాసుతో వచ్చింది. అరుగు మీద పెట్టగానే సోమయాజులు తినమని సౌంజ్ఞ చేశాడు. వాడు అన్నం తిని ఎన్నాళ్లయిందో! మంచి ఆకలి మీద ఉన్నాడేమో నాలుగు ఇడ్లీలు రెండు నిమిషాల్లో తినేసి ప్లేటు, వేళ్లు నాకుతున్నాడు. వాడి ఆకలి తీరలేదని అర్థమై అన్నపూర్ణ మరో నాలుగు ఇడ్లీలు, చట్నీ వేసింది. వాడు ఆవురావురు మంటూ తినేసి నీళ్లు తాగాడు. ప్లేటు, గ్లాసు, చెయ్యి నూతి దగ్గరకు వెళ్లి కడుక్కొచ్చాడు.

"కూర్చో" అన్నాడు సోమయాజులు. పక్కనే అన్నపూర్ణ, అభిజిత్ నుంచున్నారు.

"రోజూ ఏంచేస్తావ్?" అన్నాడు సోమయాజులు.

"సెత్త కాగితాలు ఏరుతానయ్యా!" అన్నాడు బండోడు చొక్కాతో మూతి తుడుచుకుంటూ.

"మీ నాన్న ఏం చేస్తాడు? మీ ఇల్లెక్కడ?"

"మా అయ్యా, అమ్మ ఏనాడో పోయారయ్యా! మా మామ్మ కూడా మొన్న సంకురేత్రికి పోయిందయ్యా. మాకు ఇల్లు ఏడుంటాదయ్యా! రైల్వే టేసన్, బస్టాండే ఇల్లయ్యా!"

"సరే! నీకు ఎప్పుడు రావాలనుంటే అప్పుడు రా. నీకేం కావాలన్నా అడుగు" అన్నాడు సోమయాజులు జామకాయల సంచి ఇస్తూ.

వాడు తలూపి, పదిరూపాయల కాగితం చూసుకుంటూ, నెమ్మదిగా నడుచుకుంటూ గేటు దాటాడు. రోడ్డు ఎక్కగానే వాడి దోస్తుల కోసం పరుగందుకున్నాడు.

సోమయాజులు ఇన్స్యూరెన్స్ ఆఫీసర్. సొంత ఇల్లు, కారు ఉన్నాయి. కూతురు గాయత్రి పి.ఆర్. గవర్నమెంట్ కాలేజిలో ఇంటర్ చదువుతోంది. కొడుకు అభిజిత్ గాంధీనగరం మున్సిపల్ హైస్కూల్లో సెవెన్త్ చదువుతున్నాడు. సోమయాజులుకు కార్పొరేటు విద్యాసంస్థలంటే సదభిప్రాయం లేదు. అవి స్కూళ్లు కాదు జైళ్లు అంటాడు.

సోమయాజులుకు సమస్యలేం లేవు. ఉన్న చింతల్లా సమాజం గురించే. ఇల్లూవాకిలీ, చదువు సంధ్య, కూడూగుడ్డా లేకుండా రోడ్ల మీద తిరిగే ఈ పిల్లలు ఎలా బతుకుతారు? వీళ్ల భవిష్యత్తు ఏమిటి? అన్ని సౌకర్యాలు ఉండి, పెద్దవాళ్ల పర్యవేక్షణ ఉన్న పిల్లలే చెడు స్నేహాలతో చెడ్డ దార్లు తొక్కుతుంటే, ఏ మార్గదర్శనం లేని వీళ్లు ఎలా తయారవుతారు? కూడు, గుడ్డ, నీడ వేటలో వీళ్లు దొంగలు, హంతకులు, దేశద్రోహులు, ఉగ్రవాదుల వలలో చిక్కితే దేశం భవిష్యత్తేమిటి? ప్రజలకు రక్షణేమిటి? తన కూతురు, కొడుకు బాగా చదువుకుంటే సరిపోతుందా? రేపు వీళ్లకు మాత్రం ఆ సంఘవిద్రోహుల వల్ల ప్రమాదం ఉండదా? సమాజం ఏమవుతుంది? ప్రజలకు ప్రశాంతత, భద్రత ఎలా ఉంటుంది? వాళ్లనలా వదిలేయడమేనా? తను ఒక్కడి జీవితంలోనయినా మార్పు తీసుకు రాగలడా? సోమయాజులు రోజూ అదే ఆలోచిస్తుంటాడు. సాయంత్రం గాంధీనగరం పార్కులో నడక వేళ మిత్రులు డాక్టర్ రవిచంద్ర, లాయర్ సూర్యారావు, ఇంజనీర్ సత్యమూర్తితో ఇదే చర్చించాడు. వాళ్లూ ముందుకు వచ్చారు. కానీ, ఏం చెయ్యాలో ఎవ్వరికీ పాలుపోలేదు. ఏదో చెయ్యాలనే తపన మాత్రం ఉంది.

మరో నాలుగు రోజుల తర్వాత ఉదయం సోమయాజులు మొక్కలకు నీళ్లు పోస్తుంటే గేటు దగ్గర్నుంచి "అయ్యా!" అన్న కేక వినపడింది. బండోడు, పక్కన మరొకడు ఉన్నాడు. సోమయాజులు గేటు తీశాడు.

"ఈడు బుడ్డోడండి. ఈడు కూడా తానం సేత్తాడండి. పది రూపాయలిస్తారా అయ్యా?" అన్నాడు బండోడు. వాడు సోమయాజులు ఇచ్చిన బట్టలే వేసుకుని ఉన్నాడు.

సోమయాజులుకు నవ్వొచ్చింది. స్నానం వాళ్ల కోసం కాక తన కోసమన్నమాట.

"సరే! ఇద్దరూ ఆ తువ్వాలు, సబ్బు తీసుకుని స్నానం చెయ్యండి. చెరో పది ఇస్తా" అన్నాడు నవ్వుతూ.

ఇద్దరూ ఒకళ్ళ తర్వాత ఒకళ్ళు నూతిలో నీళ్ళతో స్నానం చేశారు. సోమయాజులు ఇంట్లోకి వెళ్ళి అభిజిత్ బట్టల్లోంచి బాగున్నవి ఓ జత బుడ్డోడికి ఇచ్చాడు. వాళ్లిద్దరి మొహాలు సంతోషంతో వెలిగిపోతున్నాయి. బండోడికి కృతజ్ఞతతో కళ్లమ్మట నీళ్లు తిరిగాయి.

"మీకు ఏం కావల్సినా రండి బాబూ!" అంది అన్నపూర్ణ. అప్పటికే గాయత్రి కాలేజీకి వెళ్ళిపోయింది. అభిజిత్ సైకిల్‌పై స్కూలుకు బయల్దేరాడు. 'బై మమ్మీ, బై డాడీ' అన్నాడు. వాళ్లిద్దరూ అభిజిత్‌ను చూస్తూ అలాగే ఉండిపోయారు. కాసేపటికి తేరుకుని బయటకు నడిచారు.

మరో నాలుగు రోజులకు మరో ఇద్దర్ని తీసుకుని బండోడు, బుడ్డోడు వచ్చారు. స్నానం చేస్తే పదిరూపాయలు ఇస్తారని, టిఫిన్ పెడతారనే ఆశతోనే వాళ్లు వచ్చారని సోమయాజులు గ్రహించాడు. వాళ్లను చిరునవ్వుతో ఆహ్వానించాడు.

## ఐష్‌ని అలా చూపించారట!

*రియల్ క్యారెక్టర్‌ను తెర మీద పోషించాలంటే ఆర్టిస్టులకు కత్తిమీద సాములాంటిదే! ఐష్ కూడా ఇలాంటి సాహసమే చేస్తోంది. 'సరబ్‌జిత్' సినిమాలో దల్బీర్ కౌర్ పాత్రను ఐష్ పోషిస్తోంది. ఇందులో దల్బీర్ యవ్వనంలో ఉండగా ఎలా ఉంటుంది? మధ్య వయస్సులో ఎలా ఉంటుంది? వయస్సు మళ్ళుతున్నప్పుడు ఎలా ఉంటుంది? ఇలా మూడురకాలుగా ఐష్ కనిపిస్తుంది. మొదటి రెండు వయస్సులకు ఐష్‌ను తేలికగానే చూపించారట! వయస్సు మళ్ళుతున్న పాత్ర దగ్గరకి వచ్చే సరికే రకరకాల మేకప్ చేయాల్సి వచ్చిందట! దీని కోసం చాలా సమయం పట్టేదనీ, అయినా ఐష్ చాలా ఓపికగా ఉండేదనీ ఆ సినిమా మేకప్ టీం చెబుతోంది. చివరకి వయస్సు మళ్ళిన పాత్రలో ఐష్‌ను చాలా సహజంగా చూపించగలిగామని వారు అంటున్నారు.*



నలుగురూ నూతి దగ్గర స్నానాలు చేశారు. అన్నపూర్ణ అందరికీ పులిహోర చేసి పెట్టింది. ఎప్పట్లా సోమయాజులు తలో పదిరూపాయలు ఇవ్వబోయాడు. వాళ్లు చేతులు కట్టుకుని నుంచున్నారు గానీ చేయి చాపలేదు.

"ఏరా?" అన్నాడు సోమయాజులు.

"డబ్బులొద్దండయ్యా!" అన్నాడు బండోడు.

"ఫర్వాలేదు తీస్కోండి"

వాళ్ళు ఒకళ్ళ మొహాలు ఒకరు చూసుకున్నారు.

"వద్దండయ్యా!" అన్నారు మళ్లీ.

"మరేం కావాలి?"

"సదువు కావాలయ్యా! మాకు సదువు సెప్పిత్తారా అయ్యా!" అన్నాడు బండోడు.

సోమయాజులు ఆశ్చర్యపోయాడు. ఆ మాట వాళ్ల దగ్గర్నుంచి వచ్చినందుకు. వెంటనే ఏం చెప్పాలో అర్థం కాలేదు. వాళ్లు అడిగేదాకా తనకే ఈ ఆలోచన ఎందుకు రాలేదు? వాళ్లు తనకే మార్గదర్శనం చేసినట్లు, కర్తవ్యం బోధించినట్లు అనిపించింది.




"మీరు ఎంతవరకు చ దివారు?" అన్నాడు సోమయాజులు.

"ఈడు అ, ఆలు సదివాడయ్యా. ఈడు ఆళ్ల నాన్నకాడ ఉండేటోడు. మేమేం సదవలేదయ్యా!" అన్నాడు బండోడు బుడ్డోడిని చూపిస్తూ.

"బుద్ధిగా చదువుకుంటాం, డాక్టర్లు, కలెక్టర్లు అవుతాం అని నాకు మాటిస్తే తప్పకుండా చదివిస్తా" అన్నాడు సోమయాజులు.

మళ్లీ ఒకళ్ళ మొహాలు ఒకళ్ళు చూసుకున్నారు. నలుగురూ ఒక్కసారిగా సోమయాజులు కాళ్ల మీద పడ్డారు.

"మీ దయ అయ్యా!" అన్నారు.

సోమయాజులు హృదయం ద్రవించిపోయింది. నలుగురినీ దగ్గరకు తీసుకుని గుండెలకు హత్తుకున్నాడు. 'ఏ తల్లి కన్నబిడ్డలో.. ఆకలేస్తే ఎవర్ని అన్నం అడుగుతారు? భయమేస్తే ఎవరు ధైర్యం చెబుతారు? రోగమొస్తే ఎవరు మందేస్తారు? ఎండకు, వానకు, చలికి తట్టుకుని ఎలా బతుకుతున్నారు వీళ్లు? వీధి కుక్కలతో పోటీపడి ఎంగిలి ఆకుల కోసం కాట్లాడుకునే వీళ్లను ప్రభుత్వంగానీ, ప్రజలుగానీ మనుషుల్లా చూస్తున్నారా? దిక్కూమొక్కూ లేని వీధి బాలలు వీళ్లు. విధివంచితులు. ఇటువంటి వారిని చూస్తేనే నా జన్మ సార్థకం. ఇది భగవంతుడు తనకిచ్చిన అవకాశం' అనుకున్నాడు సోమయాజులు. అర్ధాంగి అన్నపూర్ణకేసి చూశాడు. ఆమె కళ్లతోనే భరోసా ఇచ్చింది.

"మీరు ఈరోజు నుంచీ మా ఇంట్లోనే ఉండండి. మీ చదువు సంగతి నేను చూస్తాను" అన్నాడు సోమయాజులు.

నలుగురూ ఒకళ్లనొకళ్లు ఆనందంతో కౌగలించుకున్నారు. అన్నపూర్ణ కాళ్లకు నమస్కారం పెట్టారు.

"దీర్ఘాయుష్మాన్‌భవ, మంచి వృద్ధిలోకి రండి" అంది అన్నపూర్ణ.

"మీరేం చెయ్యమన్నా చేస్తానయ్యా! రోజూ ఒక్కపూట ఇంత ముద్ద పెట్టండయ్యా చాలు" అన్నాడు బండోడు.

"గంజినీళ్లయినా చాలయ్యా!" అన్నాడు బుడ్డోడు.

"సరే! మీరెక్కడికయినా వెళ్లండి. రాత్రికి వచ్చేయండి" అన్నాడు సోమయాజులు.

నలుగురూ హుషారుగా పరిగెత్తారు.

"ఏం చేద్దామనుకుంటున్నారు?" అంది అన్నపూర్ణ వాళ్లు వెళ్లగానే.

"సత్యం, సూర్యం, రవితో మాట్లాడతా. అంతవరకు మేడపైన భోజనం, పడక ఏర్పాటు చెయ్యి" అన్నాడు సోమయాజులు.

ఆ రోజు సాయంత్రం ఆఫీసు నుంచి సరాసరి గాంధీనగరం పార్కుకు వచ్చాడు సోమయాజులు. అప్పటికే మిత్రులు ముగ్గురూ వచ్చి ఎదురు చూస్తున్నారు.

"మీకు ఫోన్‌లో చెప్పానుగా, అదిరా విషయం" అన్నాడు సోమయాజులు.

"ఓ పని చేద్దాం. తలా ఒకర్ని ఎడాప్ట్ చేసుకుని చదివిద్దాం. నలుగుర్నీ నాలుగిళ్లలో పెట్టుకుందాం." అన్నాడు డాక్టర్ రవిచంద్ర.

"రేపు మరొకడు వచ్చి జేరతాడు. వాణ్ణేం చేస్తాం? అందరిళ్లలోనూ సావకాశం ఉండాలి. అర్థాంగులు అంగీకరించాలి. అందుచేత అది కరెక్ట్ కాదు" లా పాయింట్ తీశాడు లాయర్ సూర్యారావు.

నలుగురూ ఆలోచనలో పడ్డారు.

"ఒక పని చేద్దాం. మా ఇంటికి దగ్గర్లోనే ఓ స్టూడెంట్సు రూం ఖాళీ అయింది. ఆ రూంలో పెడదాం. ఫుడ్‌కు రోజూ రెండు పూట్ల క్యారేజీలు ఇంటికి ఇచ్చేవాళ్లు ఉన్నారు. వాళ్లకు పురమాయిద్దాం" అని ప్లాన్ చెప్పాడు ఇంజనీరు సత్యమూర్తి.

"ఇది గుడ్ ఐడియా. అలా చేద్దాం. వాసం, గ్రాసం సమస్య పరిష్కారమవుతుంది. ఇక ఆ వయస్సులో అ, ఆల నుంచి నేర్పాలంటే కొన్నాళ్లు ఎవరయినా ట్యూటర్ చేత ట్యూషన్ చెప్పించాలి. ఆ తర్వాత రామకృష్ణ మిషన్ వాళ్ల స్కూల్లో వేయొచ్చు" అన్నాడు సోమయాజులు.

మిత్రులు నలుగురూ అనుకున్నట్లుగానే రూం తీసుకుని క్యారేజీ ఏర్పాటు చేశారు. రిటైర్డ్ టీచర్ గురుమూర్తిగార్ని ట్యూటర్‌గా పెట్టారు. గాయత్రి కూడా రోజూ సాయంత్రం వాళ్లకు అర్థం కానివి చెప్పి చదివిస్తోంది. ఆరు నెలలు గడిచేటప్పటికీ అక్షరాలు, అంకెలూ, గుణింతాలు వచ్చేశాయి. నెమ్మదిగా చిన్నచిన్న పదాలు, వాక్యాలు, లెక్కలు చెయ్యడం వచ్చేసింది. సంవత్సరం అయ్యేటప్పటికి మిత్రులు నలుగురు, మరో ఆరుగురు వీధిలో తిరిగే పిల్లల్ని జేర్పించారు. ఇప్పుడు పదిమందయ్యారు. వీళ్ల సంక్షేమం చూడ్డానికి ఓ గుమాస్తాను, వంటకో వంటమనిషిని ఏర్పాటు చేశారు. చిన్న రూంలోంచి పెద్ద ఇంట్లోకి మారారు. అందరినీ రామకృష్ణ మిషన్ వాళ్ల స్కూల్లో జేర్పించారు. బండోడు బి.జి. తిలక్ అంటే బాల గంగాధర తిలక్, బుడ్డోడు జి.కె. గోఖలే అంటే గోపాలకృష్ణ గోఖలే అయ్యారు. ఇప్పుడు అందరికీ పేర్లున్నాయి. పుస్తకాలున్నాయి. చదువులున్నాయి. భవిష్యత్తు గురించి ఆశలు, ఆలోచన్లున్నాయి. సేవాగుణం లేని గుమాస్తాలు, వంట మనుషులు మారుతూనే ఉన్నారు. తిలక్, గోఖలే బ్యాచ్ తర్వాత మరో రెండు బ్యాచ్‌లు డిగ్రీలు పూర్తిచేసి బతుకుదెరువుకు బయటకు వెళ్లిపోయాయి.

క్రమంగా పదిమంది ఇరవైమంది అయ్యారు. ఇరవై మంది అరవై అయ్యారు. కేజీ నుంచి పీజీ దాకా చదువుతున్నారు. గవర్నమెంటు నుంచి పైసా సహాయం లేదు. ఎన్నారై మిత్రులు, చుట్టుపక్కల వాళ్లు పుట్టినరోజులకు, పెళ్లిరోజులకు, పోయిన పెద్దల పేరున ఇచ్చే చిన్నచిన్న మొత్తాలే విరాళాలు. 'పరివర్తన' వీధిబాలల ఆశ్రమం పేర రిజిస్టర్ చేయించారు.

రిటైర్ అయిపోవడంతో సోమయాజులుదే పూర్తి బాధ్యత అయిపోయింది. మిగతా ముగ్గురు వృత్తిరీత్యా బిజీ కారణంగా రోజువారీ సేవ చేసే అవకాశం వాళ్లకు లేదు. సోమయాజులు కూతురు గాయత్రి పెళ్లి చేసేశాడు. అభిజిత్ యూ.ఎస్‌లో యం.ఎస్ చేసి అక్కడే సెటిల్ అయ్యాడు.

ఒకరోజు ఉదయాన్నే కలెక్టర్ త్రివేదీ గారి నుంచి మిత్రులు నలుగురిని కలవమని పిలు

# మేకప్ మీద అవగాహన లేనందువల్లేనట!

**కొం**త కాలం కిందట అనుష్కశర్మను చూసిన బాలీవుడ్ జనం భయపడిపోయారు. కారణం ఆమె పెదవులు. కొద్దిగా ఉబ్బిపోయి అందవికారంగా కనిపిస్తూ అందర్నీ హడలెత్తించాయి. ఇటీవల అనుష్క శర్మ పెదవులలో మార్పు వచ్చింది. అందంగా మెరిసిపోతూ ఆమె ముఖానికి మరింత అందం తీసుకొచ్చాయి. పెదవుల అందం గురించి ఏదైనా సర్జరీ చేయించారా? అని పాపం ఓ విలేకరి అమాయకంగా అడిగిన ప్రశ్నకు అనుష్క అంతెత్తున ఎగిరిపడిందట! 'ఇలాంటి మాటలు మళ్ళీ నా దగ్గర మాట్లాడకండి. బాగుండదు' అంటూ సీరియస్‌గా వార్నింగ్ ఇచ్చిందట! గతంలో పెదవుల అందం మీదా, మేకప్ మీదా పెద్దగా అవగాహన ఉండేది కాదు. ఇప్పుడు ఆ రెండింటి మీద మంచి అవగాహన వచ్చింది. ఇక నుంచి అందమైన అనుష్కనే చూస్తారంటూ చెప్పుకొచ్చిందట! ఇంతకీ సర్జరీ గురించి చెప్పకుండా ఇన్ని మాటలు చెప్పిన అనుష్కను ఎలా అర్థం చేసుకోవాలో అర్థం కావడం లేదని బాలీవుడ్ జనాలు అంటున్నారు. గతంలో చాలా మంది బాలీవుడ్ హీరోయిన్లు తమ అందం రెట్టింపు చేసుకోవడానికి ప్లాస్టిక్ సర్జరీని ఆశ్రయించారు. అంతెందుకూ... ఈనాటికీ అతిలోక సుందరిగా అందరి చేతా మన్ననలు అందుకుంటున్న శ్రీదేవి కూడా తన ముక్కుకు సర్జరీ చేయించుకుని నాజూకుగా తయారైందన్న విషయాన్ని బాలీవుడ్ జనాలు గుర్తు చేస్తున్నారు.



పొచ్చింది. క్యాంప్ ఆఫీస్‌కు వెళ్లగానే క్యాంప్ క్లర్క్ ఎదురొచ్చాడు.

'పరివర్తన' ఆశ్రమం అని చెప్పగానే "కలెక్టర్ గారు మీ కోసమే ఎదురు చూస్తున్నారు. రండి" అని లోపలికి తీసుకెళ్లాడు. అంత బిజీగా ఉన్న కలెక్టర్‌గారూ వీళ్లను చూడగానే "వెల్‌కం, మీ గురించి నాకు అంతా తెలుసు. ప్లీజ్ కూర్చోండి" అని కరచాలనం చేశారు. నలుగురూ కూర్చున్నారు.

"మీరు నిస్వార్థంగా చేస్తున్న సేవ ప్రభుత్వాన్ని ఆకట్టుకుంది. మీ ఖర్చులో సగం భరించడానికి సిద్ధంగా ఉంది" అన్నారు.

"థాంక్యూ సర్" అన్నారు నలుగురూ.

"అయితే ఒక కండీషన్. ప్రస్తుతం మీ దగ్గరున్న పిల్లల్ని యస్‌సీ, బీసీ హాస్టల్స్‌లో జాయిన్ చేద్దాం. ప్రతీ ఏడూ కొత్తగా ఓ అరవైమందిని తీసుకుందాం. అలా అయితే కొన్నాళ్లకు వీధి బాలలనే వాళ్లు ఉండరు. అలా అయితేనే మీకు ఫండ్ ఇవ్వడానికి కుదురుతుంది" అన్నారు కలెక్టర్ త్రివేదీ.

మిత్రులు ఒకళ్ళ మొహాలు ఒకళ్ళు చూసుకున్నారు.

"చిన్న సబ్‌మిషన్ సార్!" అన్నాడు సోమయాజులు.

"చెప్పండి."

"మేము వీళ్లందర్నీ ఒకేసారి జేర్చుకోలేదు సార్! వీళ్లంతా అల్లరిచిల్లరగా తిరిగే వీధి బాలలు. ఒక సంవత్సరం దాకా వేరే ఉంచి అబ్జర్వేషన్‌లో పెడతాం. వాళ్లకి స్వేచ్ఛనిస్తూనే కౌన్సెలింగ్ ఇస్తాం. వాడంతటవాడు చదువుకుంటాననేదాకా చదువు ప్రసక్తి తీసుకురాం. మా దగ్గరకు వచ్చిన వాళ్లంతా ఉండరు సార్! ఎంత బాగా చూసినా సంవత్సరంలో సగం మంది ఎప్పుడయినా పారిపోవచ్చు. వాడు సక్రమంగా ఉన్నాడు, బుద్ధిగా చదువుకుంటాడు అన్నప్పుడు మిగతా పిల్లలతో కలుపుతాం. అందర్నీ మేం కన్న బిడ్డల కంటే ఎక్కువగా చూస్తాం. మీరు చెప్పిన హాస్టల్స్‌కి పంపడమంటే మళ్లీ మొదటికి తీసుకురావడమే. మా శ్రమంతా బూడిదలో పోసిన పన్నీరే సార్!" అన్నాడు సోమయాజులు.

"మీరు చెప్పింది కరెక్టే. కానీ, రూల్స్ ఒప్పుకోవు" అన్నారు కలెక్టర్.

"సార్! మాకు మీ ఫండ్స్ వద్దు సార్! అడగకుండానే ఫండ్స్ ఇచ్చే ధర్మప్రభువులున్నారు. మాకు ప్రజల సహకారం ఉంది. మీకు మా సంస్థ మీద, మా మీద నమ్మకం ఉంటే, మా సేవ నచ్చితే, శిథిలావస్థలో ఉన్న మున్సిపల్ కమ్యూనిటీ హాలు ఇప్పించండి. ఆశ్రమంలో మరో పది మందికి ఆశ్రయం కల్పిస్తాం" అన్నాడు సోమయాజులు.

"ఓకే! తప్పకుండా. ఆర్డర్స్ నాలుగు రోజుల్లో ఇప్పిస్తా. కానీ, మీరు ఇంత ఖర్చు ఎలా భరిస్తున్నారు?" అన్నారు కలెక్టర్ కుతూహలంగా.

సోమయాజులు బ్యాగ్ నుంచి ఓ రిజిస్టర్ తీశాడు.

"చూడండి సార్! మాకు వచ్చే ప్రతీ పైసా లెక్క ఉంటుంది. మేం ఎవ్వర్నీ యాచించడం లేదు. అలా అని మా జేబులోంచి పైసా పెట్టడం లేదు. చుట్టుపక్కల గ్రామాల వాళ్లు ఇచ్చే తోట కూర, ఆనపకాయ, పాతబట్టలు దగ్గర్నుంచి ఏమిచ్చినా తీసుకుంటాం. రోజువారీ అన్నీ నమోదు చేస్తాం. మా దగ్గర కేజీ నుంచి పీజీ దాకా చదివే పిల్లలున్నారు సార్!" అని రిజిస్టర్ చూపించాడు సోమయాజులు.

"వెరీగుడ్! నా సహాయం ఏం కావల్సినా చెప్పండి. ఆల్ ద బెస్ట్" అంటూ లేచి షేక్‌హ్యాండ్ ఇచ్చారు

కలెక్టర్.

నలుగురూ లేచి బయటకు వచ్చారు. నాలుగు రోజుల్లో ఆర్డర్స్ ఇస్తానన్న కలెక్టర్ త్రివేది గారికి ఆ మర్నాడే ట్రాన్స్‌ఫర్ ఆర్డర్స్ వచ్చాయన్న వార్త నలుగురినీ నిరాశకు గురిచేసింది. ట్రాన్స్‌ఫర్ ఆర్డర్స్ వచ్చాక తనేం నిర్ణయం తీసుకోలేనని చేతులెత్తేశారు కలెక్టర్ త్రివేది.

మరో నాలుగు రోజుల తర్వాత ఓ రోజు ఉదయాన్నే సోమయాజులు ఫోన్ రింగయితే లిఫ్ట్ చేశాడు.

"హలో" అన్నాడు.

"సార్! నేను తిలక్‌ని... అదే సార్ బండోడ్ని" అన్నాడు తిలక్.

"ఆ... తిలక్! ఎన్నాళ్లకెన్నాళ్లకు? ఎలా ఉన్నావ్? ఎక్కడున్నావ్? నిన్ను చూసి చాలా ఏళ్లయింది. కనీసం ఫోన్ కూడా చేయలేదు" అన్నాడు సోమయాజులు.

"సర్! నేను రేపు ఉదయాన్నే గౌతమీలో వస్తున్నాను. తమర్ని కలుస్తాను సార్! ఇన్నాళ్లు ఒక మహాయజ్ఞంలో ఉన్నాను సార్! ఓ ఆశయ సాధన కోసమే ఇన్నాళ్లు మీతో మాట్లాడలేదు సార్" అన్నాడు తిలక్.




"వెరీగుడ్ తిలక్! నిన్ను చూడాలని మా అందరికీ కోరికగా ఉంది" అన్నాడు సోమయాజులు.

"రేపు కలుస్తాను సార్! ఉంటాను సార్!" అన్నాడు తిలక్.

"ఓకే నాయనా!" అని సెల్ ఆఫ్ చేశాడు.

మర్నాడు ఉదయమే ఆరుగంటలకు కలెక్టర్ గారి కారు 'పరివర్తన' ఆశ్రమం ముందు ఆగింది. కలెక్టర్‌గారు కారు దిగి వచ్చేటప్పటికి పిల్లలంతా చదువుకుంటున్నారు. సోమయాజులు ఇంకా రాలేదు. పిల్లలందర్నీ పేర్లు అడిగి పలకరించి, అందరికీ గిఫ్ట్‌లు, స్వీట్లు ఇచ్చారు. వాళ్లతో పాటే యోగ, ధ్యానం చేశారు. పిల్లలందరిచేత ప్రార్థన చేయించి బ్రేక్‌ఫాస్ట్ చేశారు. విజిటర్స్ రిజిస్టర్‌లో సంతకం పెట్టారు. సోమయాజులుగారు వచ్చాక ఒకసారి కలెక్టర్ ఆఫీసుకి రమ్మని చెప్పి వెళ్లిపోయారు.

సోమయాజులు రాగానే ఆయా ఈ విషయాలన్నీ చెప్పింది. కలెక్టర్ గారు ఎందుకు రమ్మన్నారో సోమయాజులుకు అర్థం కాలేదు. బహుశ, పాడుబడిన మున్సిపల్ కమ్యూనిటీ హాలు విషయం మాట్లాడ్డానికేమో!

సోమయాజులు తిలక్ కోసం చూశాడు. గౌతమి ఎప్పుడో వచ్చి ఉంటుంది. పదకొండింటిదాకా చూసినా తిలక్ రాలేదు. కలెక్టర్ ఆఫీసుకు బయల్దేరాడు. కలెక్టర్ ఆఫీస్ చాలా హడావిడిగా ఉంది. కలెక్టర్ త్రివేదిగారు ఆ రోజే రిలీవ్ అవుతున్నారట.

కలెక్టర్‌గారి క్యాంప్ క్లర్క్ దగ్గరకు వెళ్లి విజిటర్ స్లిప్ రాసిచ్చాడు. ఆ స్లిప్ చూడగానే సి.సి "సోమయాజులుగారు మీరేనా? కలెక్టర్‌గారు వస్తారు. మీరు కలెక్టర్ గారి చాంబర్‌లో కూర్చోండి" అన్నాడు.

సోమయాజులు చాంబర్‌లోకి వచ్చి కుర్చీలో కూర్చున్నాడు. బయట ఆర్డీవోలు, తాసీల్దార్లు హడావిడిగా తిరుగుతున్నారు. పది నిమిషాల తర్వాత కలెక్టర్ త్రివేదిగారు, మరో వ్యక్తి చాంబర్‌లోకి వచ్చారు.

సోమయాజులు లేచి నుంచున్నాడు. కలెక్టర్ త్రివేదీగారిని చూడగానే నమస్కారం పెట్టాడు. సూటూ, బూటూతో పక్కన ఉన్న వ్యక్తి దగ్గరకు రాగానే టక్కున వంగి సోమయాజులు కాళ్లకు నమస్కారం పెట్టాడు. అనుకోని ఈ పరిణామానికి సోమయాజులు ఉలిక్కిపడి రెండడుగులు వెనక్కి వేశాడు. ఆ వ్యక్తి పైకి లేవగానే చూసి ఆశ్చర్యపోయాడు.

"తిలక్?" అన్నాడు సంభ్రమాశ్చర్యాలతో.

"కాదు సార్! మీ బండోడ్ని" అన్నాడు తిలక్.

"ఏమిటిలా? ఇక్కడ? అన్నాడు.

"నన్ను ఆశీర్వదించండి" అన్నాడు తిలక్ తల వంచి నమస్కరిస్తూ చేతులు జోడించి.

సోమయాజులుకు అంతా అయోమయం గానూ, ఆశ్చర్యంగానూ ఉంది.

"సోమయాజులుగారూ! మీరు కోరిన విధంగా మున్సిపల్ కమ్యూనిటీ హాలు మీకు హాండోవర్ చేస్తూ కలెక్టర్ తిలక్‌గారు మొట్టమొదటి సంతకం పెట్టిన ఆర్డర్స్ ఇవిగో" అన్నారు త్రివేది.

సోమయాజులు ఇంకా షాక్ నుంచి తేరుకోలేదు. ఆ కాగితాలు అప్రయత్నంగా తీసుకున్నాడు. త్రివేదిగారు షేక్‌హాండ్ ఇచ్చి వెళ్లిపోయాక "సార్! ఇది మీరు పెట్టిన భిక్షే సార్! మీరు పెంచిన అతి చిన్న మొక్క ఎంత పెద్ద వృక్షమయిందో చూసి మీరు ఆనందించాలనే మిమ్మల్ని ఇక్కడికి రమ్మన్నాను. నన్ను క్షమించండి" అన్నాడు తిలక్.

"డిగ్రీ అయ్యాక ఏదో హైదరాబాద్‌లో చిన్న ఉద్యోగానికి వెళ్లిన గుర్తు. కానీ, ఆ తర్వాత సివిల్స్ పాస్ అయిన విషయం మాకు తెలిస్తే సంతోషించే వాళ్లం గదా తిలక్!" అన్నాడు సోమయాజులు నొచ్చుకుంటూ.

"సార్! మీ దగ్గరకు ఓ గుమాస్తాగా రావడం నాకు ఇష్టంలేదు. మీరు మొట్టమొదట ఓ మాటన్నారు డాక్టర్లు, కలెక్టర్లు అవుతామంటే తప్పక చదివిస్తానని. ఎప్పటికయినా కలెక్టర్‌గా రావాలన్నదే నా కోరిక. మేం ఉన్నతంగా బతకాలన్నదే మీ ఆశయం. అది తీరాలని పట్టుదలగా ప్రయత్నించాను. సివిల్స్‌కు సెలెక్ట్ అయినా కలెక్టర్‌గా వచ్చి మీ ఆశీస్సులు అందుకోవాలని, మీ కళ్లలో ఆనందాన్ని చూడాలని మీకు తెలియజేయలేదు. నేను వచ్చేముందు త్రివేదిగారికి మీ గురించి చెప్పాను. ఆయన ఆ మున్సిపల్ కమ్యూనిటీ హాలు గురించి చెప్పారు. 'హాలును రిపేర్ చేయించి, ఆర్డర్స్ రెడీగా ఉంచండి. నేను సైన్ చేస్తాను" అని ఆయన్ని రిక్వెస్ట్ చేశాను. ఆయన ఆ విధంగా చేశారు" అన్నాడు తిలక్.

"బుడ్డోడు... ఐమీన్ గోఖలే ఎక్కడ?" అన్నాడు సోమయాజులు.

"వాడు దేశసేవలో ఉన్నాడు సార్! అదీ దేశ సరిహద్దుల్లో కాపలా కాస్తూ సైన్యంలో" అన్నాడు తిలక్.

"మా తర్వాత మన 'పరివర్తన'ను ఎవరు కొనసాగిస్తారని బెంగగా ఉండేది. ఇక ఫర్వాలేదు. వారసుడొచ్చాడు అన్న ధైర్యం వచ్చింది"

"ఇక వీధి బాలలనే వాళ్లు లేకుండా చూసే బాధ్యత నాది సార్" అన్నాడు తిలక్.

విజిటర్స్ రిజిస్టర్‌లో 'బండోడు' అన్న సంతకం చూసుంటే తను నాటిన మొక్క ఎంత ఎదిగిందో అప్పుడే తెలిసేది. ఈరోజు సోమయాజులు ఆనందానికి ఆకాశమే హద్దు. అవధులు లేని ఆ ఆనందాన్ని అందరూ అనుభవంలోకి తెచ్చుకోవాలన్నదే సోమయాజులు ఆశ.

గూడు కడితే గొంగళిపురుగు కూడా సీతాకోకచిలుకగా పరివర్తన చెందుతుంది. ప్రతీ వాళ్లూ ఓ అనాథకు గూడు అయితే సమాజం కూడా దోపిడీదారులు, తీవ్రవాదులు లేనంతగా పరివర్తన చెందదా?

**సెల్: 98487 89094**

## కొలెస్ట్రాల్

మారుతున్న జీవనశైలి, పెరుగుతున్న శారీరక, మానసిక ఒత్తిడి, ఆహారపు అలవాట్లులోని మార్పుల వల్ల జీవిప్రక్రియలో మార్పులు జరిగి తద్వారా మానవ శరీరంలోని రోగ నిరోధక శక్తి తగ్గి రకరకాల వ్యాధులు వస్తున్నాయి. ఈ వ్యాధుల్లో కొలెస్ట్రాల్ ఒకటి. జీవనవిధానంలో కృత్రిమ ఆహారాలు, మధ్యపానం వంటి అలవాట్లు, శారీరక శ్రమ తగ్గటంద్వారా జీర్ణవ్యవస్థలో అసమతుల్యత ఏర్పడుతుంది. ఆ పరిణామాల వలన వచ్చే సమస్యలో ఒకటి ఈ కొలెస్ట్రాల్.ఇది మన శరీరం అంతటా ఉంటుంది. కొలెస్ట్రాల్ శరీరం లో తీసుకున్న ఆహారం నుండి, శరీరం లోపల నుండి తయారవుతుంది. కొలెస్ట్రాల్ లివర్‌లో తయారవుతుంది. కొలెస్ట్రాల్ పెరిగితేనే కాదు, తగ్గిపోయినా సమస్యలు తలెత్తుతాయి. రక్తంలో ఉండే కొవ్వు లాంటి పదార్థమే కొలెస్ట్రాల్. సహజంగా కాలేయం, శరీరంలోని ఇతర కణాలు 75శాతం కొలెస్ట్రాల్‌ను ఉత్పత్తి చేస్తాయి. మనం తీసుకునే ఆహారం నుంచి మిగిలిన 25శాతం కొలెస్ట్రాల్ ఉత్పత్తి అవుతుంది. మన శరీరంలో ఉన్న ప్రతి కణానికీ కొలెస్ట్రాల్ కావాలి. విటమిన్‌డి హార్మోన్ల తయారీకి కొలెస్ట్రాల్ ఉండాల్సిందే. కొలెస్ట్రాల్ అనగా అది హానికరమైనదే అనే మాట తరచూ వినిపిస్తుంది. గుండె జబ్బుల బారినపడు తున్న వా సంఖ్య రోజురోజుకీ పెరుగుతుండటంతో ఇటీవలి కాలంలో చాలామంది కొలెస్ట్రాల్‌పై దృష్టి కేంద్రీకరిస్తున్నారు.

<u>రకాలు</u>: 1. <u>హైడెన్సిటీ లైపో ప్రోటీన్లు(HDL):-</u>
హైడెన్సిటీ లైపో ప్రోటీన్లు ఈ కొలెస్ట్రాల్ మనకు మేలుజేసేది. మంచి కొలెస్ట్రాల్‌ను హెచ్‌డీఎల్ అంటారు. దీని సాధారణ విలువ 40-60 మధ్యన ఉండాలి. అరవైకన్నా ఎక్కువ ఉంటే గుండెలోని రక్తనాళాల్లో కొవ్వు చేరకుండా చేస్తుంది. అందుకే దీన్ని మంచి కొలెస్ట్రాల్ అంటారు. 2. <u>లోడెన్సిటీ లైపో ప్రోటీన్లు (LDL):-</u>
లోడెన్సిటీ లైపోప్రోటీన్‌తో కూడిన కొలెస్ట్రాల్ హానికరమైనది. రక్తప్రవాహానికి ఆటంకం కలిగించే కొలెస్ట్రాల్ ఇదే. డెసి లీటరు రక్తంలో 130 మిల్లీగ్రాముల కన్నా తక్కువ ఉండడం మంచిది. దీన్ని చెడు కొలెస్ట్రాల్ అంటారు. ఇది ఎక్కువగా ఉంటే ధవునుల్లో కొవ్వు చేరి గుండెపోటు, పక్షవాతం వంటి జబ్బులు వచ్చే ప్రమాదం ఉంది. అందుకే ఎల్‌డీఎల్‌ను చెడుకొలెస్ట్రాల్ అంటారు. కాబట్టి శరీరంలో దీని స్థాయిని తగ్గించుకోవాలి. చెడుకొలెస్ట్రాల్ 140-150లోపు ఉండాలి.

<u>చెడు కొలెస్ట్రాల్ పెరుగుదలకు కారణాలు</u>: చెక్కర, కొవ్వు ఎక్కువగా ఉండే ఆహారాన్ని తీసుకోవటం, వేపుడు పదార్థాలు, వెన్న, నెయ్యి, మాంసం, జంక్‌ఫుడ్స్ మాదక ద్రవ్యాల అలవాట్లు, పిండిపదార్థాలు వంటివి ఎక్కువగా తినటం.గర్భనిరోధక మందులు, స్టిరాయిడ్స్ హార్మోన్ మందులు, మూత్రం ఎక్కువగా రావటానికి వాడే (డుమూలిటిక్స్) మొదలైనవి. వంశపారంపర్యంగా కూడా కొందరిలో మొతాదు ఎక్కువగా ఉంటుంది. మద్యపానం, మత్తుపదార్థాలు, పొగత్రాగటం వంటి అలవాట్లు. శారీరక శ్రమలేకపోవటం, మానసిక ఒత్తిడి, ఆందోళన, పౌష్టికాహార లోపం.

<u>లక్షణాలు</u>: కండరాలు బిగుసుకుపోవటం, బలహీనత. కొంతమందిలో కంటి కింద లేదా కండరాలలో పసుపు రంగులో చర్మంలో కొవ్వు ముద్దలు ఏర్పడవచ్చు.

<u>జాగ్రత్తలు</u>: నడక వలన హెచ్‌డిఎల్ మంచి కొలెస్ట్రాల్ స్థాయి పెంచుకోవచ్చు.ఆల్కహాల్, మాంసాహారసేవన, సిగరెట్లు మానివేయాలి. పీచు ఎక్కువగా ఉన్న పండ్లు, కూరగాయులు, ఆహారం, ఓట్స్ తీసుకోవటం వలన కొలెస్ట్రాల్‌ను పూర్తి స్థాయిలో నియంత్రించవచ్చు



**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**

వ్యాయామం ద్వారా ట్రైగ్లిజరైడ్లను తగ్గించి హెచ్‌డిఎల్ స్థాయిని పెంచవచ్చు. <u>నిర్ధారణ పరీక్ష :</u> కొలెస్ట్రాల్ ఎంత ఉన్నదీ తెలుసుకునేం దుకు లిపిడ్ ప్రొఫైల్ పరీక్ష చేయించుకోవాలి.

<u>హోమియో చికిత్స</u>: కొలెస్ట్రాల్‌ను తగ్గించడానికి హోమియోపతిలో మంచి మందులు ఉన్నాయి. దీనికి సాధారణంగా వాడే మందులు కాల్కేరియా కార్బ్, ఫ్యూకస్, ఫైటోలిక్కా కొలెస్టినమ్, గ్రాఫైటిస్, కాక్టస్, రాఫుల్ఫియా, సర్పెంటైనా మొదలైనవి. ఇవే కాకుండా నిపుణులైన వైద్యుల పర్యవేక్షణలో సరైన హోమియో మందులను క్రమం తప్పకుండా వాడితే దీనికి మంచి పరిష్కారం లభిస్తుంది. హోమియోపతి వైద్యవిధానంలో కాన్‌స్టిట్యూషనల్ ట్రీట్‌మెంట్ ద్వారా మంచి ఫలితం ఉంటుంది. శారీరక, మానసిక, వ్యక్తిగత లక్షణాలను పరిగణలోకి తీసుకొని శాస్త్రీయపద్ధతిలో వైద్యం చేయుటం ద్వారా వ్యాధి మూలం నుండి నివారించబడి శాశ్వత పరిష్కారం దీనికి లభిస్తుంది. వంశపారంపర్యంగా ఉన్న జబ్బులకి కూడా దీని ద్వారా చక్కని ఫలితాలు ఎటువంటి సైడ్ ఎఫెక్ట్స్ లేకుండా లభిస్తాయి.



## డయాబెటీస్ - ఆయుర్వేదం

ఎవరు చెప్పారు? డయాబెటీస్ వ్యాధి ఇక జీవితాంతం సమస్య అని, ఇప్పుడు స్టార్ ఆయుర్వేద మీకొరకు తీసుకొని వచ్చింది. ప్రపంచ ప్రామాణికమైన అత్యున్నత సౌకర్యాలు కలిగిన వైద్యం. దీనితో మీ సమస్యలన్నీ పరిష్కారమవుతాయి. ఈ రోజు భారతదేశంలో ప్రతి 100 మందిలో 14 మంది డయాబెటీస్ బారిన పడుతున్నారు. ఈ వ్యాధి దుష్ఫలితాలు. విపరీతమైన దాహం. అధిక మూత్రవిసర్జన. ఆకలి ఎక్కువగా ఉండటం, ఎంత ఆహారం తీసుకున్నా శక్తి లేక పోవడం, బలహీనంగా ఉండటం. బరువు తగ్గడం, నీరసం, నిస్సత్తువ, చూపు మందగిం చటం, మబ్బుగా, మసకగా కనిపించటం, ఎక్కువ అలసట, కాళ్ళు లాగడం, ఏదైనా దెబ్బలు (గాయాలు) తగిలితే త్వరగా తగ్గక పోవడం. కొన్నేళ్ళ తర్వాత శరీరం లోని గుండె, మెదడు, కాళ్ళు, చేతలలోని పెద్ద రక్తనాళాలు దెబ్బ తినడం. చిన్న రక్తనాళాలు దెబ్బతిన్నందు వల్ల కంటిలోని రెటీనా దెబ్బ తినటం. నరాల బలహీనత, కళ్ళుమంటలు, మానసిక, సెక్స్ సమస్యలు.నిత్యం వాడే షుగర్ వ్యాధి నిరోధక పాశ్చాత్య రసాయనాలు చర్మంమీదమచ్చలు, తలనొప్పి, జీర్ణ సంబంధిత సమస్యలకు కారణమవుతా యి. దాంతో పాటు అవాంఛిత ఫలితాలు కలగవచ్చు. కానీ ఆయుర్వేదంతో ప్రతికూల ఫలితాలుండవు. ఇది ఎంత ప్రభావపూర్వకమో, అంత శాశ్వతంకూడా. ఇప్పుడు స్టార్ ఆయుర్వేద సరికొత్త ఫార్ములాతో మీ ముందుకు వచ్చింది. ప్రకృతిలో ఉన్న వన మూలికలనుపయోగించి, 36సం॥ల అనుభవం తో లక్షలమంది పేషెంట్లకు ఉపశమనం కలిగించిన మందులు ఇప్పుడు మీఅందుబాటులోకి వచ్చాయి. మీరు ఎనేళ్ళ నుండి బాధపడుతున్నారు, ఇది అనువంశి కమా లేదా మానసిక ఒత్తిడి వల్ల వచ్చిందా? రోగలక్షణాలకు మీ వ్యాధి తీవత్రకు మా నిపుణులైన డాక్టర్లు అమూలాగ్రం పరిశీలించి, మందులు ఇస్తారు. ఈ మందులు మొదలు పెట్టాక వాటిని మెల్లమెల్లగా పాశ్చాత్య రసాయనిక మందులు తగ్గించబడతాయి. ఈ అత్యాధునిక ఫార్ములాతో కూడిన మందులు వల్ల మీకు సరికొత్త జీవితం ఖాయం. డయాబెటీస్‌ను వ్యాధిగా భావించకండి. అది కేవలం మీరు చేయవలసిన జీవితవిధానాలలో మార్పులను సూచిస్తుంది. మీ జీవితంలో మార్పును తీసుకు వచ్చి దానిని కంట్రోలులో ఉంచడమే కాదు. ప్రీ-డయాబెటిక్స్‌తో పూర్తిగా తగ్గించవచ్చు. ఉదా॥అత్యాధునిక స్టార్ ఆయుర్వేద మందులతో పాటు పీచుపదార్థాలు అధికంగా తీసుకోవడం, ఉప్పు, చక్కెర సంబంధిత పదార్థాలు అధికంగా తీసుకోవడం, వ్యాయామం చేయడం ద్వారా డయాబెటీస్‌ను శాశ్వతంగా పరిష్కరించవచ్చు. సంప్రదాయ, అత్యాధునిక టెక్నాలజీ, అత్యాధునిక మందులు 36 సం॥ల అనుభవం కలిగిన ఆయుర్వేద డాక్టర్‌లు ఇప్పుడు స్టార్ ఆయుర్వేదలో మీకు అందు బాటులోఉన్నారు. డయాబెటీస్ గురించి బాధ పడకండి. దానిని మీరు సరైన శ్రద్ధతో కంట్రోలులో ఉంచు కోకపోతే మెల్లిమెల్లిగా అది మీశరీరాన్ని కబలిస్తుంది. 5000ఏళ్ల ఆయుర్వేద వైద్య విధానం ఇప్పుడు అత్యాధునిక టెక్నాలజీ రూపంలో మీ సేవకై వచ్చింది మా స్టార్ ఆయుర్వేద.

**డా. మనోహర్.** M. D (Ayurveda)
**స్టార్ ఆయుర్వేద**

ADVT



# స్నేహమంటే ఇదేరా!

**"దదాతి ప్రతి గృహ్ణాతి గుహ్యమాఖ్యాతి పృచ్ఛతి**
**భుంక్తే భోజయతే చైవ షడ్విధం ప్రీతి లక్షణమ్"**

**"ఇవ్వడం, తీసుకోవడం, దాపరికాలు లేకుండా రహస్యాలు పంచుకోవడం, అడగటం, తినడం, తినిపించడం అనే ఈ ఆరు లక్షణాలు స్నేహమున్న చోటనే ఉంటాయి'.**

**-హితోపదేశం**

సృష్టిలో తీయనిది స్నేహం. తల్లిదండ్రులతో చెప్పుకోలేనివి. తోబుట్టువులతో పంచుకోలేనివి కూడా స్నేహితులతో చెప్పుకుంటాం. మనలోని తప్పులను ఎత్తిచూపటం, మంచిని ప్రశంసించడం, అవసర సమయాల్లో సహాయం చెయ్యడం, ఆపదల్లో తోడుండటం, రహస్యాలు మనసులో దాచుకోవటం, జయాపజయాల్లో నీడలా తోడుండటం.. ఇవి మిత్ర లక్షణాలు.

ఇద్దరు 'ఒకటి' కాగల్గినప్పుడే స్నేహితులౌతారు. ఆలోచనలు, అభిరుచులు, మనసులు ఏకం కావాలి. స్నేహం అంటే రెండు దేహాలలో ఉండే ఒకే ఆత్మ.

*"నీ స్నేహితుడు ఎవరన్నదానిని బట్టి - నువ్వెలాంటి వాడివో చెప్పవచ్చు. తెలివైన, సమర్థుడైన స్నేహితుడు నీ పక్కన ఉండటం జీవితంలో గొప్పవరం"*

*-స్టాన్ డేల్*

అడవిలో ప్రయాణిస్తున్న ఇద్దరు స్నేహితులకు ఎలుగుబంటి ఎదురైంది. వాళ్ళలో ఒకడు చెట్టెక్కేశాడు. రెండోవాడు ఎక్కలేకపోయాడు. వెంటనే అతను నేలమీద పడుకుని, చనిపోయిన వాడిలాగ నటించసాగాడు. ఎలుగుబంటి అతడిని వాసన చూసి వెళ్ళిపోయింది. స్నేహితుడు చెట్టు దిగొచ్చి "ఎలుగుబంటి నీ చెవిదగ్గర ఏదో చెప్పినట్టుంది, పైగా నిన్నేమీ చెయ్యకుండా వెళ్ళిపోయిందే?" అనడిగాడు.

"నిన్ను ఆపదలో వదిలేసే స్వార్థపరుడితో స్నేహం చెయ్యొద్దంది" అని వేగంగా లేచెళ్ళిపోయాడా స్నేహితుడు.

స్నేహానికి నమ్మకం, విశ్వాసం పునాది అని చెబుతుందీ కథ.

యుగయుగాల నాటిది స్నేహం. అది ఎప్పటికప్పుడు నిత్యనూతనమే.

### నిజమైన స్నేహం

పరస్పర గౌరవంతో ఏర్పడేదే నిజమైన స్నేహం. ఇటువంటి వారు ఒకరి గురించి మరొకరు ఆలోచిస్తారు. తమ ప్రవర్తనలో దాన్ని కనబరుస్తారు. ఇద్దరి వ్యక్తుల వ్యక్తిత్వం, నిబద్ధత, నిజాయితీ, నిస్వార్థం వంటి అంశాల మీద ఇదంతా ఆధారపడి ఉంటుంది. ఒకరి విజయాన్ని మరొకరు కాంక్షించేదే నిజమైన స్నేహం.

"ఇటీవల స్టార్ విజయ్ తమిళ్ టి.వి. ఛానెల్లో సూపర్ సింగర్ పాటల పోటీ కార్యక్రమం జరిగింది. ఆ పోటీల్లో పాల్గొన్నవాళ్ళ పేరెంట్స్ గ్యాలరీలో కూచున్నారు. కానీ 'సియాద్' అనే సింగర్ కోసం అమెరికా నుండి అతని బాల్య స్నేహితుడు వచ్చాడు. స్నేహితుడు సియాద్‌ని ఎంకరేజ్ చేసి, ధైర్యం చెబుతూ, సెమీఫైనల్స్ నుండి గ్రాండ్ ఫినాలేకి సెలక్టయ్యే వరకూ అతనితోనే ఉన్నాడు. ఫైనల్ కంటెస్టెంట్‌గా సియాద్‌ను అనౌన్సు చెయ్యగానే... ఆ అమెరికా స్నేహితుడి మొహంలో కన్పించిన అనుభూతి అనిర్వచనీయం. స్టేజీ మీదకి వచ్చి మిత్రుణ్ణి ఆలింగనం చేసుకుని ఆనందబాష్పాలతో అభినందిస్తుంటే.. సియాద్.. 'ఈ క్షణమే నేను గ్రాండ్ ఫినాలే విజేతనైనంత ఆనందంగా ఉంది. ఇంత మంచి ఫ్రెండ్‌ని ఇచ్చిన దేవుడికి కృతజ్ఞతలు' అని అంటున్నప్పుడు అతని గొంతులో ఆర్ద్రత అందర్నీ కదిలించింది. స్నేహం అంటే ఇదేరా! అన్పించింది.

*"నా స్నేహితుడికి నేను చెయ్యగల అత్యున్నత ఉపకారం, అతణ్ణి ఎప్పుడూ సంతోషంగా ఉంచటమే"*

*-రాబర్ట్ ఫ్రాస్ట్*

తాము సంతోషంగా ఉండటం కోసమే ఇతరులతో స్నేహం చేస్తుంటారు కొంతమంది. ముఖ్యంగా తమ అవసరాల్ని తీర్చుకోవడానికే ఎదుటివారి బలహీనతల్ని కనిపెట్టి, తమకు అనుకూలంగా మార్చుకుంటూ, అవసరాలు తీర్చుకుంటూ పరాన్నజీవులుగా బ్రతుకుతారు. ఇలాంటి వారితో కాస్త తేడా వచ్చినా లేక ఆ వ్యక్తి కష్టాల్లో ఉన్నా... తామరాకు మీద నీటి బొట్టులా జారిపోతుంటారు. ఇలాంటి వ్యక్తులతో స్నేహం చేసే ముందు చాలా జాగ్రత్తగా ఉండాలి.

### సారూప్యం

ఒకే అభిప్రాయాలు, భావాలు గల వ్యక్తులు మిత్రులవటం సాధారణమే. కానీ దానిని కొనసాగించే వాళ్ళే అరుదు. ఉద్యోగమైనా, వ్యాపారమైనా అన్ని విషయాల్లో ఒకరినొకరు గౌరవించుకుంటూ ఎల్లప్పుడు ఒకరి సాహచర్యాన్ని మరొకరు కోరుకుంటూ,

## విజయ విలాసం

స్టెప్స్ టు సక్సెస్ 23

- ఎం. వెంకటేశ్వరరావు, సెల్: 90307 07037

పాలు నీళ్ళలా కలిసిపోయే స్నేహం అంకురిస్తే.. అది వటవృక్షమై ఎంతో మందికి ఆశ్రయమిస్తుంది.

సంగీత ప్రపంచంలో రారాజులుగా వెలిగిన శంకర్ జైకిషన్, కళ్యాణ్‌జీ ఆనంద్‌జీ, విశ్వనాథన్ రామ్మూర్తి, లక్ష్మీకాంత్ ప్యారేలాల్, కథా రచనలో సలీం జావేద్... ఫ్లిప్‌కార్ట్ కనుగొన్న సచిన్‌భన్సాల్ బిన్నీ భన్సాల్... స్నేహాన్నే ఊపిరిగా శ్వాసించిన బాపు రమణ వంటివారి స్నేహం గురించి చెప్పుకోవచ్చు.

### వైరూప్యం

జీవితంలో కొన్నిసార్లు మన భావాలకు, అభిప్రాయాలకు పొంతనలేని వ్యక్తులు తారసపడుతుంటారు. వాళ్ళతో తప్పనిసరి స్నేహాలు, బాంధవ్యాలు కొనసాగించాల్సిన పరిస్థితులు ఎదురవుతుంటాయి.

రాజకీయ, సినీరంగాల్లోని వ్యక్తులు భుజాల మీద చేతులేసుకుని నవ్వుకుంటూ లోపల శత్రువులుగా మారిపోతారు. ఈ రంగాల్లో శాశ్వత మిత్రత్వం, శత్రుత్వాలుండవు.

"ధనం స్నేహితులని మీ చుట్టూ చేరిస్తే, దరిద్రం నిజమైన స్నేహితుల్ని మిగులుస్తుంది".

"మీరు ఆనందంగా ఉండండి... మనుషులు మిమ్మల్ని వెతుక్కుంటూ వస్తారు. దుఃఖంలో ఉంటే వెనుదిరిగి పోతారు.

సంతోషంగా ఉండండి... మీకెందరో స్నేహితులు దొరుకుతారు.

మీరు అందించే అమృతాన్ని ఎవరూ వద్దనరు.

కానీ విషాన్ని మాత్రం మీరొక్కరే తాగాలి".

పై కవిత పేరు 'రియాలిటీ'... దీనిని 'విల్‌కాక్స్' రాశాడు.

## హేట్సాఫ్

'స్నేహం' అనే పదానికే నిర్వచనం చెప్పారు చిరస్మరణీయులైన పగోజీ, తూగోజీ మిత్రులు కీ.శే. బాపు - రమణలు.

బాపుగారి అసలు పేరు సత్తిరాజు లక్ష్మీ నారాయణ. పశ్చిమగోదావరి జిల్లా నరసాపురంలో 1933 డిసెంబరు 15న జన్మించారు.

రమణగారి అసలు పేరు ముళ్ళపూడి వెంకటరమణ. తూర్పుగోదావరి జిల్లా ధవళేశ్వరంలో 1931 జూన్ 28న జన్మించారు.

1942లో ఇద్దరు మద్రాస్ పి.ఎస్. హైస్కూల్లో మొదట కలిసి 5, 6 తరగతులు చదివారు. తర్వాత కేసరి హైస్కూల్లో చదువు కొనసాగించారు. వారు ఎంచుకున్న మార్గాలు, మాధ్యమాలు వేరయినా స్నేహం విడువలేదు.

కథ, మాటల రచయితగా రమణగారు, చిత్రకారుడిగా, కార్టూనిస్టుగా, ఇల్లస్ట్రేటర్‌గా బాపుగారు తమ జీవితాలు ప్రారంభించారు.

ఇద్దరి మధ్య నిబద్ధత గల, నిబంధనలు లేని స్నేహం, వారి భవిష్యత్తుకి పరస్పర సహకార మార్గం చూపింది. రమణగారు ఎవరూ అనుకరించలేని శైలితో అద్భుతాలు రచిస్తే... బాపుగారిలోని దర్శకుడు రమణగారి అద్భుత సృజనలకు చిత్రరూపాన్ని కాగితాల మీద, ఊహకందని శైలితో చిత్ర కళాఖండాల్ని వెండి తెర మీద ఆవిష్క



రించారు. రమణగారి రాతలకి, బాపుగారి గీతలు.. నిర్దేశన ప్రాణప్రతిష్ఠ చేశాయి. సాక్షి చిత్రంతో మొదలైన ఆ ప్రస్థానం శ్రీరామరాజ్యం వరకూ కొనసాగి తమ తమ ప్రతిభలకు పరస్పర పట్టం గట్టుకుని ఆణిముత్యాల్ని అందించిన మహనీయులు.

జీవనంలో, జీవితంలో ఒకటే మాట, ఒకటే బాటగా ఒకే ఇంట, ఈ జంట 60 వసంతాలు పంచుకున్న మాధుర్యాలు ఈ జన్మకి చాలవంటూ, ముందుగా 2011లో రమణగారు వెళ్ళిపోయారు. ఆత్మలేని దేహంలో జీవించలేక మౌనిలా మారారు బాపు. 2013లో పద్మశ్రీ పురస్కారం అందినా తన పేరు పక్కన 'రమణ' లేనిగౌరవాన్ని ఆస్వాదించలేనంటూ... 2014లో రమణగారితో స్వర్గస్నేహం కోసం వెళ్ళిపోయారు.

హేట్సాఫ్

## వాళ్లే వెండి, బంగారం

- స్నేహితుడికి చెయ్యగల్గిన అత్యున్నత ఉపకారం జీవితాంతం స్నేహం చేయడమే.
- స్నేహితుణ్ణి అనుమానించడం, అతనిచేత మోసగించబడటం కంటే అసహ్యమైనది.
- స్నేహితుడు ఆపదలో ఉన్నప్పుడు పిలవకపోయినా వెళ్ళాలి.
- స్నేహానికి ఎల్లలు లేవు. పరిమితులు లేవు. లోతుకు వెళ్ళే కొద్దీ మధురానుభూతుల్ని అందిస్తుంది.
- మిత్రమా! ఎప్పుడూ నా పక్కనే నడువు. కల్సి ముందుకెళ్దాం.
- మీ మాట, ప్రవర్తనలో మీతో మీరే స్నేహంగా ఉండండి. స్నేహితులు వెతుక్కుంటూ వస్తారు.
- కొత్త స్నేహితులు వెండి అయితే పాత స్నేహితులు బంగారం.

స్వచ్ఛమైన స్నేహంలో పరస్పర సహకారం ఉంటుంది. అది ప్రయోజనం కోసం చేసేది కాదు. ప్రయోజనం ఆశించి చేసే స్నేహాలు.. ఆశించింది అందగానే అదృశ్యమవుతాయి. ఇలాంటి వాటిల్లో ముఖ్యంగా విభేదాలు, వైషమ్యాలు, అసూయ ఎన్నో రకాల అరిషడ్వర్గాలు అపశృతులు సృష్టిస్తాయి.

లలిత్‌జతిన్, నదీమ్‌శ్రవణ్, సలీం జావేద్.. విశ్వనాథన్ రామ్మూర్తి, ఎంతోమంది కల్సినంత త్వరగా విడిపోయారు. ఎటువంటి త్యాగాలకైనా సిద్ధపడే అరుదైన స్నేహితులుగా దుర్యోధనుడు, కర్ణుడు ఇతిహాసాల్లో నిలిచిపోతే, మిత్రుడి కోసం ఏదైనా చెయ్యాలన్న తపన... కృష్ణుడి కోసం అటుకులు తెచ్చిన సుధాముడి స్నేహంలో కన్పిస్తుంది.

**"స్నేహితుల భాష మానసికమైనది"**

**-విలియం షేక్స్‌పియర్**

### స్నేహబాంధవ్యాలు

స్నేహబంధాలు దినదిన ప్రవర్ధమానమవుతాయి. దానికి సమయం పడుతుంది. ఇరువైపులా సహకారం, అర్థం చేసుకునే స్వభావం, ఇచ్చి పుచ్చుకోవడం, పట్టువిడుపు, పారదర్శకతల ఆధారంగా ఈ బాంధవ్యాలు బలపడతాయి.

### పోషించుకోవాలి

స్నేహితుల్ని సంపాదిస్తే సరిపోదు. తరచూ కలుసుకోవాలి. మనసువిప్పి మాట్లాడుకోవాలి. నీకు నేనున్నాను, ఏదైనా చేస్తాను వంటి భరోసా భాషే స్నేహ పోషణకు సేంద్రియ ఎరువు.

**"స్నేహితుడి కోసం ప్రాణం ఇవ్వటం గొప్ప విషయం ఏమీ కాదు. ప్రాణం ఇచ్చేటంత స్నేహితుణ్ణి పొందటం అదృష్టం"**

**-జాన్‌రస్కిన్**

### అరమరికలు, దాపరికాలు

అరమరికలు, స్థాయీ భేదాలు, వివక్షలు, దాపరికాలు లేని వాళ్ళే నిజమైన స్నేహితులు. ఎటువంటి సమస్యనైనా, సంతోషాన్నైనా స్నేహితులతో కనీసం ఒక్కడితోనైనా పంచుకోగల్గాలి. నేటి యువతీ యువకులు చదువు, ఉద్యోగం, సమాజ జీవితంలోనూ ఒత్తిళ్ళకు గురవుతూ చెడు అలవాట్లను, ఆత్మహత్యల్ని ఆశ్రయిస్తున్నారు. మంచి, చెడుల విచక్షణ తెలిపే మంచి స్నేహితుణ్ణి ఎంచుకోండి.. పంచుకోండి.. మలినాలు వాటంతట అవే పరిశుభ్రపడతాయి.

### విజయంలో స్నేహం

స్నేహపూర్వకంగా పలకరించే వాళ్ళు లేకపోతే ఇంట్లో ఆఫీసులో ఉండలేం. జీవితంలో ఏ విజయం సాధించాలన్నా ప్రోత్సహించే 'స్నేహహస్తం' ఉండాల్సిందే. నిస్వార్థ స్నేహం ఎదుటివారి విజయాన్ని అభిలషిస్తుంది. అలాంటి వ్యక్తులు విలువలకి ప్రాధాన్యమిస్తారు. విలువలున్న స్నేహ వాతావరణంలో అపజయానికి ఆసరా ఉండదు.

**(ఇంకా వుంది)**



# దేర్ డెవిల్

**-మధుబాబు** 32



**'కాసేపు ఆగుదాం నఫీజు... ఉక్కిరిబిక్కిరి అయిపోతున్న సెన్సేషన్ కలుగుతోంది. ఈ సొరంగంలో గాలి క్రమక్రమంగా హరించుకు పోతున్నట్లు అనిపిస్తోంది' ఉన్నట్లుండి ఎనౌన్స్ చేసింది జాబిల్లి. అంతటితో ఆగలేదు. చటుక్కున ఆగి కింద చతికిలబడ బోయింది.**

**తను కూడా ఆగిపోయాడు నఫీజు. అంతటితో ఊరుకోలేదు అతను కూడా. అమాంతంగా చేతుల్నిజాచి ఆమెను గట్టిగా కౌగ లించుకుని పట్టుకున్నాడు.**

'ఏమిటిది? నీకేమైనా పిచ్చిఎక్కిందా?' అడిగింది జాబిల్లి. కోపం లేదు ఆ కంఠంలో. ఆశ్చర్యం మాత్రమే ధ్వనించింది.

'గుహలోకి ఎంటర్ అయినప్పుడు నీ చేత కథక్ డాన్సు చేయించిన తేళ్ళు వంటివి ఏవైనా కింద ఉంటే ఎగురు కుంటూ వచ్చి ఒళ్ళో కూర్చుంటాయి. లేనిపోని ప్రాబ్లెమ్స్ వస్తాయి. కోరికోరి ఆ బాధల్ని ఆహ్వానించడం దేనికీ?' చేతుల్ని వెనక్కితీసుకోకుండా అలాగే నిలబెట్టి పట్టుకుంటూ అడిగాడు అతను.

అంతచీకటిలోను తళుక్కున మెరిసింది జాబిల్లి తెల్లటి పల్వరుస.

'నీతో కాపురం చేయటం చాలాకష్టం. నిల్చుంటే వచ్చే కష్టాలు, కూర్చుంటే ఎదురయ్యే బాధలు. ఎన్నెన్ని టినో చెప్పి మెదడు తినేస్తావు' అంటూ అతని చేతుల్ని మృదువుగా వదిలించుకుని, సొరంగం గోడకు ఆనుకుంది.

'కావాలని చెప్పటంలేదు. మనమున్న పరిస్థితి అటువంటిది' అంటూ వెనక్కి చూశాడు నఫీజు. తరుము కుంటూ రావల్సిన ఘనీసుల్తాన్ జనంలో ఒక్కడు కూడా వస్తున్న చిన్నెలు అతనికి కనిపించలేదు. కనీసం' అడుగుల శబ్దం కూడా వినిపించటం లేదు.

'సమ్‌థింగ్ ఏదో జరిగింది. ప్రస్తుతానికి ఆ ప్రమాదం తప్పిపోయిందనే అనిపిస్తోంది' అంటూ ఈసారి ముందున్న మార్గం మీద దృష్టిని సారించాడు.

ఊపిరి ఆడటం లేదని జాబిల్లి కంప్లయింట్ చేయటంలో అసంబద్ధం ఏమీలేదు. సొరంగంలో ఉన్న గాలినంతా ఏదో రాక్షసి ఒక్కతే పీల్చేసుకుంటు న్నట్టు అనిపిస్తోంది.

'ఎందుకని అనిపిస్తోంది ఇలా?' తనలో తను అనుకుంటున్నట్లు పైకే అంటూ పది అడుగులు వేశాడు. పదకొండో అడుగు వేయబోతుండగా కని పించింది అతనికి సన్నటి వెలుగు.

సొరంగం చివరి భాగంలోకి వచ్చేస్తున్నట్టు తెలిసిపోయింది అతనికి. సంతోషం అధికం అయి పోయింది.

'కమాన్ జాబిల్లీ. ఖతమైపోయింది మన ప్రయాణం' ఆనందంగా అంటూ వేగంగా వేశాడు మరో పది అడుగులు.

మరింత అధికం అయింది వెలుగు. ఎదుట ఉన్న సొరంగం వెడల్పు అయింది. ఒక అడుగు రెండు అడుగులు కాదు ఏకంగా మూడు వందల అడుగులకు మించిన విశాలమైన ఖాళీ ప్రదేశం వారి ముందు ప్రత్యక్షం అయింది.

కింది నుంచి పది అడుగుల ఎత్తుంది దాని సీలింగ్. సన్న సన్నటి బొరియలు కావాలని ఏర్పాటు చేసినట్టు కనిపిస్తున్నాయి. ఆ బొరియల్లో నుంచే వస్తోంది వెలుగు.

'ఇన్ని రంధ్రాలున్నప్పుడు గాలి ధారాళంగా లోపలికి రావాలి. ఎందుకు రావటం లేదు' అత నితో పాటు వస్తూ తల ఎత్తి చూసిన జాబిల్లి అడిగింది.

'కారణం కావాలా?' ఆమెను మరోసారి బలంగా పట్టుకుని, ముందుకు పోనీయకుండా ఆపుతూ అడిగాడు నఫీజు.

'నీకు అవసరం లేదా?' చటుక్కున అఫెండ్ అయినట్లు ఎదురు ప్రశ్నవేసింది ఆమె.

'అయితే చూడు..' అంటూ ముందుకు చూపించాడు.

ఝల్లుమన్నది జాబిల్లి శరీరం. నిలువెత్తున కనిపిస్తున్నాయి ఖాళీస్థలంలో పెద్దపెద్ద పుట్టలు... పాములు నివశించేవి కావు అవి. లుకలుకలాడుతున్నాయి చీమలు. ఒకటి కాదు రెండు కాదు... లక్షలు.. కోట్లు... వందల కోట్లు.

సీలింగ్ మీద ఉన్న రంధ్రాల గుండా గున గునలాడుతూ పైకిపోతున్నాయి అవి. తిరిగి అదే వేగంతో ఏవో పదార్థాలను డెక్కలతో కరిచి పట్టుకుని కిందికి వస్తున్నాయి. ఆ పదా ర్థాలను పుట్టల్లో దాచి మళ్ళీ పైకిపోతున్నాయి.

'వాటి కదలిక మూలానే సొరంగంలోని గాలికి కరువు వస్తోంది. చూడటానికి చిన్నగానే ఉన్నా వాటికి కూడా గాలి అవసరమే' అన్నాడు నఫీజు.

'ఇన్ని చీమలు ఒకేచోట ఉండటాన్ని నేను ఎప్పుడూ చూడలేదు. ఇవి మనకు ప్రమాదం కలిగిస్తాయా?' అడిగింది. జాబిల్లి.

'ఒకటి రెండు కుడితే ఏమీ కాకపోవచ్చు. ఇవన్నీకలిసి మీదపడితే తట్టుకోవటం మాత్రం ఇంపాజిబుల్' అంటూ ఇంకో అడుగు ముందుకు వేసి - పాదాలలో శక్తి నశించి పోయినట్లు నేల మీద చతికిలబడిపోయాడు నఫీజు.

'అయ్యయ్యో... ఏమైంది నీకు? ఆర్ యూ ఆల్ రైట్?' ఆందోళన నిండిన కంఠంతో అడుగుతూ



అతన్ని పైకి లేపటానికి ప్రయత్నించింది జాబిల్లి.

లేవలేదు నఫీజు. ఆమెను కూడా కిందికి లాగి తన పక్కన కూర్చోబెట్టాడు.

'ఏమిటి? ఏమయింది నీకు? ఆశ్చర్యంగా అడిగింది జాబిల్లి.

'మహాసుల్తాన్ నిధికి సంబంధించి నీకు కనిపించిన ఆఖరిగుర్తు చీమే కదా?' అడిగాడు.

తల ఊపింది జాబిల్లి అయోమయంగా చూస్తూ.

'అయితే లేచి నిలబడి అతి జాగ్రత్తగా ఆ పుట్టల మధ్యకి చూడు. అలికిడిచేయకు. ఎగ్జయిట్ కాకు' అన్నాడు అతను.

అయోమయంగానే లేచి నిలబడి అతను చెప్పినట్లే అతి జాగ్రత్తగా ఆ పుట్టలకు మధ్య భాగంలో ఉన్న ఒక వేదిక వంటి రాతి కట్టడం వైపు చూసింది జాబిల్లి. రెండే రెండు క్షణాలు. తాను కూడా అతని మాదిరిగానే నేల మీద చతికిలబడింది.

బంగారు కణికలు... పెద్దపెద్ద పెట్టెల్లో కనిపిస్తున్నాయి ఆ వేదిక మీద. రకరకాల ఆభరణాలు, పైనుంచి ప్రసరిస్తున్న వెలుగుపడి తళతళలాడిపోతున్న వజ్ర వైఢూర్యాలు లెక్కపెట్టడం అసంభవం అనిపించేంత సంపద.

పిచ్చిగా అరవాలన్న కోరిక కలిగింది జాబిల్లికి. ఛెంగుఛెంగున ఎగిరి డాన్స్ చేయాలని కూడా అనిపించింది.

'మహాసుల్తాన్ అభీష్టం నెరవేరింది. ఆయన కోరుకున్న నిధిని నేను బట్టబయలు చేయగలిగాను. ఇది చాలా పెద్ద ఎచీవ్‌మెంట్. నాకు పెద్ద పేరు తెచ్చిపెట్టే పరిశోధన' ఎగ్జయిట్‌మెంట్‌తో స్వల్పంగా కంపించింది ఆమె కంఠం. 'థాంక్యూ నఫీజు. థాంక్యూ వెరీమచ్.. నువ్వు పక్కన ఉండి ఉండకపోతే ఇది సాధ్యపడేది కాదు' అంటూ బలంగా కౌగలించుకుని అతన్ని గట్టిగా ముద్దుపెట్టుకుంది.

సిగ్గుపడటమో, ముడుచుకుపోవటమో, ఇంకేదైనా అయిపోవటమో చేయలేదు నఫీజు. 'ఈ చీమలు ఇక్కడ ఉండగా ఎవరూ ఆ వేదిక దగ్గరికి పోలేరు. వాటన్నిటినీ చంపకుండా ఆ నిధిని స్వాధీనం చేసుకోవడం చాలా కష్టం' సాలోచనగా అన్నాడు. 'ఐ డోన్ట్‌కేర్ నఫీజు. ఆ బాధలు ఏవో సుల్తానే పడతాడు. నిధిని వెతకటం వరకే మన బాధ్యత. పద వెళ్ళిపోదాం' అంటూ అతన్ని బలవంతంగా పైకిలేపి, వచ్చిన దారినే వెనక్కి బయలుదేరటానికి సిద్ధమైంది జాబిల్లి.

'జస్ట్ ఏ మినిట్. ఒక్కక్షణం ఆగు. మనం బయటి ప్రపంచంలోకి పోవాలంటే ఆ తేళ్ళు కనిపించిన గుహలో నుంచే బయటికిపోవాలి. ఘనీ

## జరిగిన కథ

జుబ్బా కొండల్లో నిక్షిప్తమైన నిధికోసం జుబ్బా రాజ్య మహాసుల్తాన్ అన్వేషిస్తూ ఉంటాడు. ఫిలోలజిస్టు జాబిల్లికి పురాతన లిపిలో ఉన్న పత్రాలిచ్చి అధ్యయనం చేయమంటాడు మహాసుల్తాన్. అతడి సోదరుడు రహంతుల్లా ఆ నిధిని కాజేసేందుకు జాబిల్లిని కిడ్నాప్ చేసి జుబ్బా రాజ్యాన్ని స్వాధీనం చేసుకుంటాడు. జాబిల్లిని వెతుక్కుంటూ వచ్చిన ప్రైవేటు గూఢచారి శ్యామ్‌సుందర్ ఎడారిలో రహస్యంగా సంచరిస్తున్న మహాసుల్తాన్‌ను రక్షించి, దాసోబూ తండా కూడా అతడిపక్షం వహించేట్టు చేస్తాడు. ఈలోపు జాబిల్లి రహంతుల్లా చెరనుంచి తప్పించుకుని నిధినిక్షేపాలున్న సమీప ప్రాంతానికి చేరుకుంటుంది. మరోవైపు మహాసుల్తాన్‌ను అంతం చేసేందుకు రహంతుల్లా సైన్యంతో వస్తాడు. వాళ్ళను చూసి మహాసుల్తాను, దాసోబు తదితరులు కొండల్లో దాక్కుంటారు.

ఆ తర్వాత....

సుల్తాన్ గనుక అక్కడే మకాంపెట్టి ఉంటే మనం పట్టుబడి పోతాం. మహాసుల్తాన్‌కి చెందవలసిన సంపద కాస్తా ఆ రహంతుల్లా పాలబడుతుంది' అన్నాడు నఫీజు.

ఆ మాటలో యధార్థాన్ని వెంటనే గుర్తించిన జాబిల్లి ఎక్కడ ఉన్న మనిషి అక్కడే నిలబడిపోయింది. అటుపోకుండా ఇటూ పోకుండా అక్కడే ఆగిపోతే తిండీతిప్పలు లేక పీల్చుకోవటానికి అవసరమైన గాలి కూడా సరిగ్గా లభించక స్వర్గానికి ప్రయాణం కట్టేయవలసిన పరిస్థితి దాపురిస్తుంది.

నిధి చూడటం జరిగిందన్న సంతోషం నిమిషాలు గడిచిన కొద్దీ ఆవిరైపోతుండగా, తల విదిలించి నఫీజు వైపు చూసింది ఆమె.

'నఫీజూ... మొక్కుకో... నీ ముఫ్తీ బాబాని తలుచుకుని గట్టిగా ప్రార్థించు. ఇక్కడి నుంచి బయటికి క్షేమంగా పోయే మార్గం కనిపిస్తే-' అంటూ ఉండగా చేతిని ఎత్తి ఆమెను ఆపేశాడు అతను.

సన్న సన్నగా వినరావటం మొదలు పెట్టాయి ఏవో ధ్వనులు... 'అరుస్తున్నారు జాబిల్లీ.. ఎవరో భయంతో బెంబేలెత్తిపోతూ గొంతుచించుకుంటున్నారు' అంటూ తల మరికొంచెం పైకెత్తి చెవులు రిక్కించాడు.

అతని మాదిరిగానే సీలింగ్ మీద ఉన్న రంధ్రాల వైపు చూస్తున్న జాబిల్లికి వెంటనే కనిపించింది ఒక దృశ్యం. అంతకు ముందు వరకూ హడావిడిగా రాకపోకలు సాగిస్తున్న చీమల సందడి వన్‌వే ట్రాఫిక్‌గా మారిపోయింది. లోపలికి రావటం మానేశాయి అవి. గబగబా బయటికే పోతున్నాయి.

రెండే రెండు నిమిషాలు. చూస్తూ చూస్తూ ఉండగానే ఒక్కచీమ కూడా పుట్టల మీద కనిపించలేదు. అన్నీ రంధ్రాలలో నుంచి బయటికి వెళ్ళిపోయాయి.

'నఫీజూ... ఎటెళ్ళాయవి? ఏం జరిగింది??' అని అడుగుతున్న ఆమె మాటల్ని వినిపించుకోకుండా చేయి పట్టుకుని



ముందుకు లాగాడు నఫీజు.

వేదికదాకా మామూలుగానే అనుసరించి, అక్కడ ఆగి పోవటానికి ప్రయత్నం చేసింది ఆమె. 'నథింగ్ డూయింగ్. బయటికి పోయినవి తిరిగి వస్తే మన కొంప మునిగిపోతుంది' అంటూ అతి బలవంతంగా మరింత ముందుకు లాక్కుపోయాడు నఫీజు. నలభై తొమ్మిది గజాల దూరం పోయిన తర్వాత యధార్థం అయింది అతని ఊహ.

ఎర్రగా ఉన్న ఒక పెద్ద కొండరాయి బలవంతంగా భూమి లోకి దింపబడినట్లు కనిపించింది ఆ ఖాళీ ప్రదేశం చివరి భాగంలో. ఆ కొండరాయి మధ్యలో ఉన్నది ఒక సన్నపాటి సందు.

'ఈ నిధిని ఇక్కడ దాచిపెట్టింది ఎవరోగాని, తాము బయటికి పోయేందుకే ఈ రాయిని ఇలా ఏర్పాటు చేసి ఉంటారు' అంటూ ఆ సందులోకి ఎంటర్ అయ్యాడు అతను. స్పిరల్‌స్టైయిల్ వే మీద అడుగులు వేస్తున్నట్టు వలయా కారంలో తిరుగుతూ రెండు నిమిషాల తరువాత తల బయటికి పెట్టాడు. కొండరాయి మొదట్లో ఉన్న ఒక గోతిలో నుంచి.

చుట్టూ పెద్దపెద్ద గడ్డి బుట్టలు. వాటి నిండా నోరు ఊరించే తీపి పదార్థాలు. పక్కనే పెద్ద నీటి గుంట.

ఆనందమైపోయింది నఫీజుకి. 'వచ్చేయ్ జాబిల్లీ. బయటికి వచ్చేయ్' అని తన వెనుకే వస్తున్న జాబిల్లిని హెచ్చరించబోయి అదిరి పడ్డాడు.

లెక్కపెట్టటానికి వీలు లేనన్ని గుడారాలు నీటి గుంటకు ఆవలి పక్కన నిర్మించబడి ఉన్నాయి. భగభగమని మండి పోతున్నాయి అవన్నీ.

అధునాతనమైన ఆయుధాలు ధరించిన చాలా మంది సైనికులు తమ వాహనాలను అదిలించి ఆ మంటలకు దూరంగా పరుగులు తీయించే ప్రయత్నాలు చేస్తున్నారు.

నల్లటి తివాచీ కదిలినట్టు కలిసికట్టుగా కదులుతున్నాయి సొరంగంలో నఫీజుకు కనిపించిన చీమలు.. వాహనాలను, వాటిమీది సైనికులను పట్టుకుని వీరకుట్టుడు కుట్టి పారేస్తున్నాయి.

హృదయ విదారకంగా శబ్దాలు చేస్తూ కిందపడిపోతున్నాయి వాహనాలు. వాటి మీది సైనికులు కూడా వాటితో పాటు నేలను కౌగలించుకుంటున్నారు.

కొండరాయి వెనుక ఉన్న గోతిలో నుంచి బయటికివచ్చి, నోరు తెరచుకుని నిలబడిపోయాడు నఫీజు. అతను చూస్తూ ఉండగానే ఆగిపోయాయి క్రిందపడిన వారి కదలికలు. గిలగిలలాడటం మాని తలలు వేలాడవేశాయి వాహనాలు.

చీమలు చేస్తున్న చిన్నచిన్న శబ్దాలు తప్ప మరెటువంటి చప్పుడు వినపడకుండా పోయింది నాలుగే నాలుగు నిమిషాల తరువాత.

'నఫీజు.. అవి వెనక్కి వస్తున్నాయి. మనల్ని చూస్తే చంపి పారేస్తాయి' తన వెనుకే గోతిలో నుంచి పైకి వచ్చిన జాబిల్లి వణుకుతున్న కంఠంతో హెచ్చరించేసరికి ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చాడు నఫీజు.

'వచ్చేసినయ్... దగ్గరికి వచ్చేసినయ్' మరింత భయంగా అరిచింది జాబిల్లి. వెనకాముందు చూసుకోకుండా, ఆమె చేయి పట్టుకుని, నీటి గుంటలోకి ఎగిరి దూకాడు అతను.

కచ్చితంగా ఒక గంటపాటు ఆ గుంట చుట్టూ రౌండ్స్ కొట్టింది చీమల తివాచీ. ఏదో ఒక విధంగా అతన్ని, అతని సహచరురాలిని సమీపించి వారిద్దరినీ కూడా పరలోకానికి ప్రయాణం కట్టించటానికి ప్రయత్నించింది.

చేతులు బార్లజాచి బలంగా నీటిని తట్టి పెద్ద పెద్ద అలలు సృష్టించాడు నఫీజు.. నీటికి దగ్గరిగా వచ్చిన వాటన్నిటినీ బెదిరించి వెనక్కి పోయేటట్టు చేశాడు. గంట తరువాత ఆగ్రహం శాంతించిందో, లేక అటెన్షన్ డైవర్ట్ అయిందో తెలియదుగాని, నెమ్మదిగా కొండరాయి దగ్గరికి పోయి, గడ్డి బుట్టల్లోని తీపి పదార్థాలను తమ పుట్టల దగ్గరికి చేర్చుకునే కార్యక్రమాన్ని పునఃప్రారంభించుకున్నాయి చీమలు.

'ఎందుకు ఇలా? మనిషిని చూస్తే పిచ్చిపట్టినట్టు మీదికి ఎగబడే ఈ దుష్టచీమలకు ఈ నైవేద్యాలు ఎవరు పెడుతున్నారు? అసలు ఏం జరుగుతోంది ఇక్కడ?' తమకు ప్రమాదం తప్పిపోయిందని తెలిసిన వెంటనే నఫీజుని అడిగింది జాబిల్లి.

"మేము చెబుతాం. ఇది మా ఇలాకా... ఆ బుట్టలు పెట్టింది మేమే' అంటూ వినవచ్చింది ఒక గంభీరమైన కంఠం.

అదిరిపడి తల తిప్పిన నఫీజుకి కనిపించాడు దాసోబు. అతను ఒక్కడేకాదు. నవ్వుతూ అతని వెనుక నిలబడిన శ్యామ్‌సుందర్, అతన్ని అనుసరించే వస్తున్న మహాసుల్తాన్, ఇంకా ఎంతోమంది ఎడారి వాసులు అందరూ కనిపించారు.

•••

'మహాసుల్తాన్‌ని వెదుకుతూ వచ్చిన రహంతుల్లా చంచాలు - ఖాళీగా ఉన్న గుడారాలను చూసి కామ్‌గా వెనక్కి పోవటమో, లేక మా కోసం బండలచాటుకు రావటమో చేసి ఉంటే చాలా బాగుండేది. తెలివితేటలు లేని మూర్ఖులు కావటం వల్ల, అలా చేయకుండా చీమల జోలికి పోయారు. ఆ బుట్టల్ని అవతలికి విసిరి వేయటానికి ప్రయత్నించారు. అంతే సర్వనాశనం అయిపోయారు' తన అనుచరుల సాయంతో ప్రాణాలు వదిలిన సైనికుల్ని, వారి వాహనాల్ని లోయ వెలుపల ఇసుకలో పాతిపెట్టిస్తూ చెప్పాడు దాసోబు.

**లక్షలు కోట్ల సంఖ్యలో ఉన్న చీమల పుట్టల మధ్య రాతి కట్టడం వేదికమీద బంగారు కణికలు, వజ్ర వైడూర్యాలూ, లెక్కపెట్టడం అసంభవం అనిపించేంత సంపద కనిపించింది జాబిల్లికి. ఒక్కసారిగా అంత సంపద చూడగానే తీవ్ర ఉద్వేగానికి గురైంది. నఫీజును బలంగా కౌగలించుకుని గట్టిగా ముద్దుపెట్టుకుంది. ఇంతకూ ఆ చీమల్ని వారు తరిమికొట్టారా? ఆ నిధిని అక్కడి నుంచి తరలించగలిగారా?**

'అసలు ఈ చీమల భాగోతం ఏమిటి?' అవి ప్రమాదకరమైనవని తెలిసి కూడా వాటిని ఇంటి అల్లుళ్లని మేపినట్లు తీపి పదార్థాలతో మేపటం దేనికి?' అడిగాడు నఫీజు.

'అబ్బో... ఇప్పటిది కాదు ఈ విషయం. వందలకు వందల సంవత్సరాల కిందటిది. నువ్వు గమనించటానికి అవకాశాలు లేవు. ఈ చుట్టుపట్ల ఈ ఎడారిలో, ఉన్న అతి కొద్ది నీటి గుంటల్లో కెల్లా ఈ లోయలోని నీటి గుంటే చాలాపెద్దది. మంటలు మండే ఎండలు కాస్తున్నప్పుడు కూడా ఇందులోని నీరు ఎండిపోదు. ఎంతమంది ఉపయోగించుకున్నాగానీ, నీటి పరిమాణం తగ్గిపోవడం జరగదు' చెప్పటం మొదలు పెట్టాడు దాసోబు.

'ఈ లోయలో స్థిరనివాసం ఏర్పరచుకుని, ఈ నీటితో మంచిమంచి పంటలు పండించుకోగలిగితే, ఒకరి దయాధర్మ భిక్షల మీద బ్రతుకవలసిన అవసరం ఉండదని మా జాతి పెద్దలు భావించి ఉంటారు. అయితే ఇక్కడ ఉన్న చీమల మూలకంగా ఆ పని చేయటం అసాధ్యమని గ్రహించి, వాటిని మచ్చిక చేసుకుని వాటితో సహజీవనం చేయటానికి వీలుగా ఈ తీపి పదార్థాలను నైవేద్యం పెట్టే ఆచారం ప్రవేశ పెట్టారు.

'ప్రతి సంవత్సరం ఇక్కడికి రావటం, టన్నులకు టన్నులు పదార్థాలని వండి వాటికి అందించడం, అవి సుష్టుగా ఆరగించి, ఎటోపోయి హాయిగా నిద్రపోవడం జరుగుతోంది. మచ్చిక అవటం మాత్రం హుళక్కి అయిపోతోంది. సైనికుల మీద ఆ చీమలు ఎలా విరుచుకు పడ్డాయో చూశావుగా' అంటూ మాటల్ని ముగించాడు దాసోబు.

లోయ ముఖద్వారం దగ్గర ఏర్పాటుచేసిన గుడారం ముందు కూర్చుని ఉన్నాడు మహాసుల్తాన్. 'తల్లీ... నన్ను క్షమించు. తరతరాలనుంచీ ఎవరికీ సాధ్యపడని కార్యాన్ని నీకు అప్పగించి నేను నీ పట్ల అపరాధం చేశాను. నిన్ను కష్టాల పాలు చేశావు..' తన దగ్గరే కూర్చున్న జాబిల్లితో అంటున్నాడు.

తెల్లటి పల్వరుస, కనిపించేలా తియ్యగా నవ్వింది జాబిల్లి. 'మీరు నాకు అప్పగించిన పని, ఆ



రహస్యాన్ని విడదీసి మీకు ఎక్స్‌ప్లెయిన్ చేయటం వరకే. మా నఫీజు సాయంతో నేను మరింతగా ముందుకు పోయాను' అంటూ తన దుస్తుల్లో నుంచి ఒక బంగారు కణికె, రెండు పెద్ద పెద్ద వజ్రాలను తీసి ఆయన ముందు పెట్టింది.

తెరిచిన నోరు తెరిచినట్టే ఉండిపోయింది మహాసుల్తాన్‌కి. దగ్గరే ఉన్న శ్యామ్‌సుందర్ గనుక చెంగునదూకి పట్టుకుని ఉండక పోయినట్లయితే వెనక్కి పడిపోయి ఉండేవాడు ఆయన.

'ఈ లోయలో ఆ చీమలు నివసించటం యాదృచ్ఛికం కాదు. ఆ నిధికి అవి రక్షణగా ఉపయోగ పడుతున్నాయి. మీరు ఇచ్చిన పుస్తకంలో ఆఖరి క్లూ ఆ చీమలే', తాను అబ్జర్వ్‌చేసిన విషయాలన్నిటినీ వివరించి చెపుతూ అన్నది జాబిల్లి.

'దాసోబూ..' ఖంగుమంటున్న కంఠంతో పిలిచాడు సుల్తాన్.

పరుగుపరుగున వచ్చాడు దాసోబూ. చేతులు కట్టుకుని నిలుచున్నాడు.

'ఏ నిధి లభిస్తే నా దేశం సుభిక్షం అవుతుందని నా ప్రజలు సుఖంగా జీవించటానికి వీలుపడుతుందని నేను భావించానో, ఆ నిధి మనకు లభించింది. వెంటనే మనం జుబ్బాకి వెళ్ళిపోవాలి..' ఆజ్ఞ ఇచ్చాడు మహాసుల్తాన్.

'సిద్ధం హుజూర్. మీరు ఎలాచెపితే అలాగే?' అంటూ తన అనుచరులందరినీ పిలవటం మొదలు పెట్టాడు దాసోబు.

అదే సమయంలో తమ వాహనాలను వేగంగా పరుగులు తీయిస్తూ వచ్చారు అతని అనుచరులు పది మంది. 'సైన్యం, జుబ్బా వైపు నుంచి పెద్ద సైన్యం వస్తోంది. రెండు మోటార్ వెహికల్స్ ఉన్నాయి. వాటి మీద పెద్ద పెద్ద ఫిరంగులున్నాయి..' అలుపు తీరేదాకా ఆగకుండా రిపోర్ట్ చేశారు.

రక్తం లేనట్లు పాలిపోయింది దాసోబు వదనం. 'చీమలు రెచ్చిపోవడం వల్ల ఇంతకు ముందు మనం ప్రాణాలు కాపాడుకోగలిగాం. బహిరంగ ప్రదేశంలో చెవులు చిల్లులు పడేటట్లు శబ్దాలు చేసి నిప్పుల వర్షం కురిపించే ఫిరంగుల నుంచి రక్షణ పొందటం ఎలా?' వెనక్కి తిరిగి శ్యామ్‌సుందర్‌ని అడిగాడు.

'హుజూర్. పిల్లల్ని పెద్దోళ్ళని దూరంగా పంపించి వేద్దాం. వస్తున్న బద్మాష్‌లకు కనిపించినట్లే కనిపించి లోయలోకి తీసుకుపోదాం. వాళ్ళసంగతి మళ్ళీ మన చీమలే చూసుకుంటాయి' ఉత్సాహంగా చెప్పాడు తనను అడుగక పోయినా ఒక అనుచరుడు.

'ఇంతకుముందు వచ్చిన వాళ్ళ దగ్గర ఫిరంగులు లేవు. వాళ్ళు లోయలోకి రారు. ఇక్కడే నిలబడి ఫిరంగులతో లోయను నేలమట్టం చేస్తారు' అన్నాడు దాసోబు.

చిన్నమొఖం అయిపోయింది ఆ అనుచరుడిది.

'మీరెవరూ అనవసరంగా కంగారుపడి కాళ్ళు తొక్కుకోకండి. మా నఫీజును పిలిచి ఏం చెయ్యాలో సలహా అడగండి. అతనికి తెలుసు' ఉన్నట్లుండి చెప్పింది జాబిల్లి. చాలా నమ్మకంగా.

ఆశ్చర్యం నిండిన కళ్ళతో అలా చూస్తూనే ఉండిపోయాడు శ్యామ్‌సుందర్. ఎటువంటి సిచ్యుయేషన్‌లోనైనా నిర్ణయాలు చాలా త్వరగా తీసేసుకుంటుంది జాబిల్లి. ఇప్పుడు నఫీజు విషయంలో కూడా అదే జరుగబోతున్నదా?

# బుల్లితెర ప్రేక్షకులనూ పడగొడుతుందట!

గ్లామర్‌తోనూ, స్టేట్‌మెంట్లతోనూ ఎప్పుడూ సినీ జనాల నోళ్ళల్లో నానుతూ ఉండే రాధికా ఆప్టే ఇక బుల్లి తెర మీద కూడా తన ప్రభావాన్ని చూపబోతోంది. సోనీ టీవీలో క్రైం కథలు చెప్పడానికి రాధిక రెడీ అయిపోతోంది. అయితే అందరిలా భయపెట్టకుండా తన మాటలతో వారిని ఆకట్టుకుంటాను అంటూ కబుర్లు చెబుతోంది. క్రైం స్టోరీలంటేనే భయానకంగా ఉంటాయి దానికి ఎంత గ్లామర్ సొగసులు అద్దినా అవి భయపెట్టకుండా ఉంటాయా? అన్న అనుమానాన్ని కొందరు వ్యక్తం చేస్తున్నారు.



శ్యామ్‌సుందర్ ఆలోచనలు పూర్తికాకముందే, ఆ గుడారం దగ్గరకు పిలిపించబడ్డాడు నఫీజు. చీమల దాడిలో హతమారి పోయిన వారిలో సైనికుల్ని అటుగా లీడ్‌చేసిన ఘనీసుల్తాన్ కూడా ఉన్నాడు.

'వాడు మహాసుల్తాన్‌కి చెందవలసిన నిధిని తను స్వంతం చేసుకోగలననే నమ్మకంతో పెద్దవ్యాన్‌ని కూడా వెంట బెట్టుకువచ్చాడు. దానినిండా ఆయుధాలు, ఆహార పదార్థాలు ఉండి ఉంటాయి. వెంటనే దాన్ని వశపరుచుకుంటే మీకు బాగా ఉపయోగపడుతుంది' అన్నాడు దాసోబూ అనుచరులతో.

ఇప్పుడు అందరూ ఎదుర్కోవలసిన సమస్య ఏమిటో దాసోబు నోటివెంట ఆలకించేసరికి, చిన్నగా ప్రత్యక్షం అయింది అతని పెదవుల మీద చిరునవ్వు.

'ఘనీసుల్తాన్ తీసుకువచ్చిన వెహికల్‌ని వెంటనే తెప్పించండి' అంతకుముందు చెప్పిన మాటల్ని మళ్ళీ చెప్పాడు.

ఎంతో సమయం అవసరం లేకపోయింది దాసోబు అనుచరులకు. సరిగ్గా ఒక గంట తర్వాత దుమ్ము తెరలు రేపుతూ లోయ దగ్గరికి వచ్చింది ఆ వెహికల్.

అందులోని ఆహార పదార్థాలన్నింటినీ అవతల పెట్టించాడు నఫీజు. పది మందికి సరిపడా ఉన్న ఆయుధాల్ని దాసోబుకి ఇచ్చాడు.

'ఇసుకగుట్టల మీద ఎవరికీ కనిపించకుండా కూర్చోవాలి. ఇసుక తుఫాను సమయంలో కూడా గురి తప్పకుండా కాల్చగల మొనగాళ్ళు అయి ఉండాలి వాళ్ళు' అంటూ వెహికల్ స్టీరింగ్ దగ్గర కూర్చున్నాడు నఫీజు.

'చెప్పుభాయీ. నీ ఉపాయం ఏమిటోచెప్పు' అంటూ అతన్ని బ్రతిమిలాడాడు దాసోబు.

'చేసి చూపించే ఉపాయం ఇది. మాటలతో చెప్పేది కాదు. అందరూ రెడీగా ఉండండి' అంటూ వెహికల్‌ని ఇసుక గుట్టల చాటుకు పోనిచ్చాడు నఫీజు.

గుబగుబలాడుతున్న గుండెల్ని చిక్కబట్టుకుని, తన అనుచరులందరినీ దూరదూరంగా మోహరించాడు దాసోబు. తండాలోని స్త్రీలు, వృద్ధులందరినీ దూరంగా పారిపొమ్మని ఆజ్ఞ ఇచ్చాడు.

సూర్యుడు పడమటి దిశలోకి పడిపోతున్న సమయంలో దూరంగా ప్రత్యక్షం అయింది రహంతుల్లా సైన్యం.

'చీమలతో నిండి ఉండే లోయ ఒకటి ఉంది ఇక్కడ. ఎడారి దొంగ దాసోబు తమ తండాలతో కలిసి అప్పుడప్పుడు ఇక్కడికి వస్తూ ఉంటాడు. ఎడారిలో ఏం జరిగినా వాడికి తెలిసి తీరుతుంది. వాడిని పట్టుకుని రెండు తగిలిస్తే సుల్తాన్ సంగతి బయటికి వచ్చేస్తుంది' అంటున్నాడు రహంతుల్లా ప్రధాన సలహాదారుడు.

'హుజూర్.. హుజూర్ అటు చూడండి. అటు చూడండి' కీచుగా ఒక సైనికుడు అరిచేసరికి అదిరి పడి ముందుకు చూశాడు అతను.

దగ్గరలోనే ఉన్నది అతను చెబుతున్న లోయ. ఇంకా కొంచెం దగ్గరగానే ఉన్నాం దాని ముందుండే ఇసుక గుట్టలు. ఆ గుట్టల చాటునుంచి గాలిలోకి వీస్తున్నది దారుణమైన దుమ్ము.

'అయ్యబాబోయ్... ఇసుక తుఫాను' అరిచాడు ఒక సైనికుడు.

'నోరు మూసుకో. ఆకాశం క్లియర్‌గా ఉంది. గాలి కూడా గట్టిగా వీచటం లేదు. అది తుఫాను కాదు' అన్నాడు ఇంకో సైనికుడు.

'అయితే పెద్దసైన్యం ఏదో ఆఘమేఘాల మీద వచ్చేస్తున్నట్టుంది. ఆ దుమ్ము వాళ్ళ వాహనాల వల్ల ఏర్పడిందే అయి ఉంటుంది' అన్నాడు మరో సైనికుడు.

అవుననీ కాదనీ ఏదీ చెప్పలేని స్థితికి గుర

య్యాడు ప్రధాన సలహాదారుడు.

●●●

'అరవండి... గొంతులు చినిగి పోయేటట్లు కేకలు పెట్టండి. చెవులు చిల్లులు పడిపోవాలి..' స్టీరింగ్ దగ్గర విండోలో నుంచి తల బయటికిపెట్టి పెద్ద కంఠంతో దాసోబుని హెచ్చరించాడు నఫీజు.

గొల్లుమన్నారు అందరూ. ఆకాశంలో గిరికీలు కొడు తున్న అరడజను డేగలు అదిరిపడి దూరంగా దూసుకు పోయాయి.

'రెడీగా ఉండండి. నేను ముందుకు పోతున్నాను' అంటూ వెహికల్‌ని గుట్టల చాటునుంచి ముందుకు తీసుకుపోయాడు నఫీజు.

సూటిగా స్ట్రెయిట్‌గా కాదు. తన నేర్పునంతా వినియోగించి, పంట పొలాల్లో ట్రాక్టర్లు టైట్‌గా రౌండ్స్ కొడుతున్నట్లు, ఇసుకను రాపాడిస్తూ అంగుళం అంగుళం చొప్పున ముందుకు పోయాడు.

ఇసుక తుఫాను వస్తున్న సమయంలో ఎగిసి పడినట్లు దట్టంగా విసురుగా గాలిలోకి లేవటం మొదలయింది దుమ్ము.

దూరంలో ఆగిపోయింది రహంతుల్లా సైన్యం. తమకేసి వస్తున్న దుమ్ము, వెనుక ఎన్ని వెహికల్స్ ఉన్నాయో, ఎంతమంది శత్రువులు దాగి ఉన్నారో అంచనా వేయటం అసాధ్యం అయిపోయింది వారికి.

'ఫిరంగులు మోహరించండి. ఎవరున్నా సరే ముక్కలు ముక్కలు అయిపోవాల్సిందే' ఖంగుమంటున్న కంఠంతో ఆజ్ఞ ఇచ్చాడు ప్రధాన సలహాదారుడు.

'కొట్టేయాలి దాసోబూ. గురితప్పితే నఫీజుని తిరిగి ప్రాణాలతో చూడలేం' ఆత్రుత అణుచుకోవ టానికి ప్రయత్నిస్తూ దాసోబుని హెచ్చరించాడు శ్యామ్‌సుందర్.

దట్టమైన దుమ్ములోనుంచి కూడా గురిచూసి కొట్టగల మొనగాళ్ళు గుట్టలమీద కూర్చోవాలని నఫీజు ఎందుకు చెప్పాడో దాసోబుకి తెలిసి వచ్చింది.

'ఎవరో దేనికి? నేనే ఆ పని చేస్తాను' అంటూ ఘనీసుల్తాన్ వెహికల్‌లో తమకు లభించిన సూపర్ షాట్ రైఫిల్‌ని గురిపెట్టాడు.

తమ వెంట తీసుకువచ్చిన రెండు ఫిరంగుల్ని సిద్ధం చేస్తున్న సైనికులకు అసలు విషయం అర్థం అయ్యే లోపల ఎగిరి అవతలపడి ప్రాణాలు వదిలేశారు వాళ్ళు.

దగ్గరికి దగ్గరికి వెళ్ళిపోతోంది నఫీజు సృష్టి స్తున్న దుమ్ముతెర. 'కొట్టండి.... అందర్నీ పడగొట్టండి' అని అరిచాడు అతను మరోసారి విండోలో నుంచి తలను బయటపెట్టి.




వెహికల్ వెనుకే నడుస్తున్నారు దాసోబూ అను చరులు. చెవులు చిల్లులుపడే విధంగా మోతలు చేశాయి వారి తుపాకులు. రివ్వురివ్వున దూసుకు పోయాయి బరిశెలు.

ఏం జరుగుతున్నదో అర్థం కాకముందే వచ్చిన వారిలో ఒకవంతు మంది ప్రాణాలు వదిలి కింద పడిపోయారు రహంతుల్లా సైనికులు.

'మహాసుల్తాన్ వర్ధిల్లాలి. జుబ్బా రాజ్యం వర్ధి ల్లాలి. దాసోబూ వర్ధిల్లాలి' అని రంకెలు పెడుతూ దుమ్ము తెరల చాటునుంచి సూటిగాపోయి మిగిలిన వారి మీద కల బడ్డారు దాసోబు అనుచరులు.

ఆలోచించుకుని, అవతలి వారి సెటప్ ఏమిటో అర్థం చేసుకుని ముందుకు వచ్చి ఉంటే గెలుపు రహం తుల్లా సైనికులదే అయి ఉండేది. అనుకోని విధంగా ఎదురైన ఆ రెసిస్టెన్స్‌ని కంట్రోల్ చేయటం చేత కాలేదు వారికి. రెండు నిమిషాలు గడవకముందే ప్రాణాలు వదిలేశాడు ప్రధాన సలహాదారుడు. ఆయు ధాల్ని వదిలి, తమ వాహనాల్ని వెనక్కి తిప్పి వచ్చిన దారినే జుబ్బా వైపు పరుగు తీశారు అనేకమంది.

అతి సునాయాసంగా లభించిన ఆ విజయాన్ని చూసి ఆనందంతో చిందులు తొక్కబోయిన దాసోబుని, అతని అనుచరుల్ని నిర్మొహమాటంగా కర్కశంగా హెచ్చ రించాడు నఫీజు.

'పారిపోయిన బద్మాష్‌లు రహంతుల్లాని హెచ్చ రిస్తారు. వాడు కోట తలుపులు బిగించుకు కూర్చుం టాడు. బయటికి లాగటం బహుకష్టం. ఇనుము వేడిగా ఉన్నప్పుడే దెబ్బపడాలి".

ఆ మాటల్లో యధార్థాన్ని గమనించి తన వారిందరినీ జుబ్బావైపు కదలమని హెచ్చరించాడు దాసోబు.

శ్యామ్‌సుందర్‌కి సైగచేశాడు నఫీజు. జాబిల్లిని మహాసుల్తాన్ వెహికల్‌లోకి రప్పించి వేగంగా జుబ్బా వైపు పోనిచ్చాడు.

●●●

'దాసోబూ జనం మనమీద తిరగబడ్డారంటే సుల్తాన్ అతని దగ్గర ఉన్నట్లే.. ఆయన్ని దెబ్బకొట్టాలంటే ఒక్కటే మార్గం' పళ్ళు కొరుకుతూ అంతఃపుర రక్ష కుడిని పిలిచాడు రహంతుల్లా.

రాత్రంతా ఎక్కడా ఆగకుండా ప్రయాణం చేసి వచ్చారు ఎడారిలోకి పోయిన అతని అనుచరుల్లో కొంతమంది చీమల లోయ దగ్గర జరిగింది వివ రంగా చెప్పారు.

'నదియా బేటీ సంగతి ఏమయింది?' అంతః పురం రక్షకుడిని అడిగాడు రహంతుల్లా.

'నేను ఇచ్చిన పాలు తాగలేదు. ఆ జమీలా పెద్ద భూతక్కి. నా ప్రయత్నం వృథా అయింది.' తల వంచుకుంటూ చెప్పాడు ఆ వ్యక్తి.

'తన ఆశలన్నిటినీ నదియా మీదే పెట్టుకుని బతుకు తున్నాడు నా సోదరుడు. ఆ పిల్ల గుటుక్కుమంటే ఈయన గుండె ఆగిపోతుంది' అన్నాడు రహంతుల్లా.

'జమీలా దగ్గర ఉండగా నేను ఏమీ చేయలేను. జమీలాకి తెలివి అధికం' అన్నాడు అంతఃపుర రక్షకుడు.

అదే సమయంలో పరుగుపరుగున లోపలికి వచ్చారు కొందరు సేవకులు.

'మహాసుల్తాన్ నగరంలోకి వచ్చారు. ప్రజ లందరూ గుంపులు గుంపులుగా కోట దగ్గరికి వస్తు న్నారు' రిపోర్టు చేశారు వాళ్ళు.

నెత్తురుతో తడిసిన ముఖాన్ని తుడుచుకుంటూ వారి వెనుకే లోనికి వచ్చాడు అతను రక్షణగా ఉంచు కున్న పది మంది సైనికుల్లో ఒకతను.

'తోటలో కాపలాకి పోయాం. మీరు సైన్యం నుంచి తప్పించిన వారందరూ అక్కడ ఉన్నారు. నాతో పాటు వచ్చిన నలుగురూ హతమారి పోయారు. నేను ఒక్కడినే తప్పించుకువచ్చాను' అన్నాడు నేలమీద చతికిలపడుతూ.

భయంకరంగా మారిపోయింది రహంతుల్లా వదనం. 'ఎవర్రా... ఎవర్రా అక్కడ?' బిగ్గరగా అరిచాడు.

ఆ మందిరం వెలుపల నిలబడి ఉన్న ఆఖరి ఐదుగురు సైనికులు వెంటనే లోపలికి వచ్చారు. 'ప్రభూ మహాసుల్తాన్ ముఖద్వారం దగ్గరికి వచ్చినట్టు అరు పులు వినబడు తున్నాయి' చెప్పాడు వారిలో ఒకతను.

'చంపండి. కాల్చిపారేయండి' ఆర్డర్ ఇచ్చాడు రహంతుల్లా.

'కష్టం ప్రభూ. మీరు తొలగించిన సైనికులు అందరూ ఆయన చుట్టు వలయంగా నిలబడి ఉన్నారు. గురి తప్పితే వాళ్ళు వట్టి చేతులతోనే మన ప్రాణాలు తీసేయగలరు' అన్నాడు ఆ సైనికుడు.

దగ్గర్లో ఉన్న ఒక కుర్చీని లాగిపెట్టి తన్నాడు రహంతుల్లా. 'సింహాసనాన్ని చేజిక్కించుకునేందుకు తాను చేసిన ప్రయత్నాలన్నీ ఒకదాని వెనుక ఒకటిగా మట్టికొట్టుకు పోవటం మింగుడు పడలేదు అతనికి.

జుబ్బా నిధిని సంపాదించటం కోసం అష్ట కష్టాలు పడి పరాయి దేశం నుంచి పట్టుకువచ్చిన పిల్ల మటుమాయం అయింది. ఒంటిమీది గాయా లతో ఎడారిలో ఉండగానే గుటుక్కుమన వలసిన సోదరుడు నిక్షేపంగా నగరంలోకి వచ్చాడు.

సింహాసనం మీద కూర్చున్న మరుక్షణం తన కోసం సైనికుల్ని పంపిస్తాడు. అందరూ చూస్తుండగా తలను తెగనరికిస్తాడు.

ఆగ్రహం కాస్తా అమితమైన భయం కింద మారి పోయేసరికి చెమటలు పట్టాయి రహంతుల్లాకి. చటుక్కున చేతినిజాచి ఒక సైనికుడి దగ్గర ఉన్న రైఫిల్ తీసుకున్నాడు. పెద్దపెద్ద అడుగులు వేస్తూ అంతఃపురంలోకి పోయాడు.

●●●

'నాకు తెలుసు. నా మడ్డిభూతం నాకు ఇచ్చిన మాట నిలబెట్టుకుంది. మా తండ్రి గారిని రక్షించి తీసుకు వచ్చింది' ఆనందంగా అంటూ తన కుర్చీలో నుంచి

లేచింది నదియా. 'మనం వెళ్ళి నాన్నగారిని చూడాలి. బయలుదేరు' అంటూ జమీలాను తొందర పెట్టింది.

ఆమె చేయి పట్టుకుని మందిరంలో నుంచి బయటికి తీసుకువచ్చింది జమీలా. రెండు అడుగులు కూడా వేయక ముందే ఎదుట ప్రత్యక్షం అయ్యాడు రహంతుల్లా.

అతని ఉద్దేశం ఏమిటో అర్థమై ఎగిరి నదియాకు అడ్డుగా నిలబడింది జమీలా. 'రండి.. రండి.. వచ్చి రక్షించండి' అంటూ అరవబోయింది.

తీసుకువచ్చిన రైఫిల్‌ని పైకి ఎత్తి పళ్ళు బిగపట్టి ట్రిగ్గర్‌ని ప్రెస్ చేయబోయాడు రహంతుల్లా.

గింగిరాలు తిరుగుతూ వచ్చి అతని చేతులకు తగిలింది ఒక పూలకుండీ. ఎగిరి అవలపడి పోయింది రైఫిల్.

నదియా చేతులు పట్టుకుని, మందిరంలోకి పరుగు తీయబోయింది జమీలా. ఆమె కంటే వేగంగా కదిలి, బలంగా జమీలా మెడమీద కొట్టి అవతలకు నెట్టేశాడు రహంతుల్లా. నదియాను పట్టుకున్నాడు.

'వదిలెయ్ రహంతుల్లా. నువ్వు తప్పించుకోలేవు' ఖంగుమంటున్న కంఠంతో హెచ్చరించాడు తోటలో నుంచి రహస్య మార్గం గుండా మందిరంలోకి వచ్చి, పూలకుండీని విసిరిన శ్యామ్‌సుందర్.

'దగ్గరకి రావద్దు. వస్తే ఈ బిడ్డ హతమారిపోతుంది' తన ఖైజారును తీసి నదియా గొంతుకు ఆనిస్తూ హెచ్చరించాడు రహంతుల్లా.

దాసోబు దగ్గరగాని, అతని అనుచరుల దగ్గరినిగానీ ఏదైనా ఆయుధం తెచ్చుకుని ఉన్నట్లయితే బాగుండి ఉండేదని అనిపించింది శ్యామ్‌సుందర్‌కి. నిస్సహాయంగా నిలబడిపోయాడు మందిర ద్వారంలో.

•••

'నాకు ఒక వెహికల్ కావాలి. లక్ష దీనారాలు కావాలి. జుబ్బా సరిహద్దులు దాటి అవతలికి పోయే వరకు నన్ను ఎవరూ అనుసరించకూడదు' సింహాసనం మీద ఉన్న మహాసుల్తాన్‌కి తన కండీషన్స్ వినిపించాడు రహంతుల్లా.

'బాబాయ్... నువ్వు తప్పించుకోలేవు. నా మడ్డిభూతం నిన్ను బతకనీయదు. మంత్రాలు రాకపోయినా సరే, వట్టి చేతులతోనే నీ ప్రాణాలు తీసేస్తుంది' అతని చేతుల్లో చిక్కుకున్న నదియా స్థిరమైన కంఠంతో చెప్పింది అతనికి.

అర్థం కాలేదు ఆ మాటలు రహంతుల్లాకి. ఆమె భయపడకుండా అంత నిర్భయంగా మాట్లాడటం పెద్ద అవమానంగా భావించాడు.

మెడను ఆనించి ఉంచిన కత్తిని కొంచెం దూరంగా జరిపి, చెంపమీద బలంగా కొట్టాడు. బాధ భరించటం అసాధ్యమై, 'వచ్చేయ్ నఫీజూ. వచ్చి బాబాయ్‌ని చంపేయ్' అని ఆక్రోశించింది నదియా. అతని చేతుల్లో నుంచి కిందికి జారింది.

శ్యామ్‌సుందర్‌ని కోటలోకి పంపి, తోటలో ఉన్న మాజీ సైనికుల్ని సుల్తాన్ దగ్గరకు తీసుకుపోయిన నఫీజు ఒక స్తంభం చాటున నిలబడి ఉన్నాడు.

నదియా కిందికి జారిన మరుక్షణం తన దుస్తుల్లో ఉన్న కత్తితీసి బలంగా విసిరాడు. నదియా జుట్టు పట్టుకుని పైకి గుంజబోతున్న రహంతుల్లా మెడ మీద దిగబడింది అది.

చిన్నపాటి శబ్దం కూడా పెదవుల నుంచి వెలువడక ముందే ముందుకుపడిపోయాడు రహంతుల్లా. జుబ్బా సింహాసనం ఆక్రమించుకోవాలన్న కోరిక తీరక ముందే అనంత వాయువుల్లో కలిసిపోయాయి అతని ప్రాణవాయువులు.

•••

'చెప్పు వాత్సవా. నువ్వయినా చెప్పు. మౌనంగా నిలబడకు' అప్పటికి ఆరోసారి వాత్సవను రిక్వెస్ట్ చేశాడు ఇన్‌స్పెక్టర్ రమేష్.

మెత్తటి సోఫాలో చేరగలబడి కూర్చున్న శ్యామ్ సుందర్ వైపు చూశాడు వాత్సవ. కనబడీ కనబడనట్లు తల అడ్డం తిప్పాడు అతను.

నాలుగు రోజులు మాత్రమే అయింది నఫీజుని, జాబిల్లిని వెంట బెట్టుకుని అతను నగరానికి తిరిగి వచ్చి.

వచ్చిన రెండవరోజునే అందరూ ఉండగా నిర్భయంగా ఎనౌన్స్ చేసింది జాబిల్లి. 'నేను నఫీజుని పెళ్ళి చేసుకుంటాను' అని.

బ్రతిమలాడాడు రమేష్. భయపెట్టాడు. 'వాడు ఒక జేబుదొంగ. అణాకానీ పర్సనాలిటీ. జేబులు కొడితే తప్పు పూట గడవని దొంగ రాస్కెల్' అంటూ.

తన దగ్గరే ఉన్న ఒక కాయితాన్ని అతనికి చూపించింది జాబిల్లి.

లండన్‌లో ఒక పెద్దస్టార్ హోటల్ ఉంది మహాసుల్తాన్‌కి. రెండు పెద్దపెద్ద బిల్డింగ్‌లు ఉన్నాయి. వాటిని నఫీజు పేరున ట్రాన్స్‌ఫర్ చేసిన పేపర్ అది.

'జుబ్బా నిధిని ఇంకా బయటికి తీయలేదు. అందులో నాకు నఫీజుకి కలిపి టెన్ పర్సంట్ నజరానాగా ఇస్తానని సుల్తాన్ చెప్పాడు. అంటే ఎంతో తెలుసా?' కోపంగా అడిగింది.

తెలుసు రమేష్‌కి. నగరంలో మూడువంతుల భాగాన్ని నిలబెట్టి ఖరీదు చేయవచ్చు. పది పదిహేను తరాల పాటు ఏ పనీ చేయకుండా కూర్చుని తింటూ ఉండవచ్చు.

పది పదిహేను తరాలపాటు కాదు. పది పదిహేను రోజుల వరకయినా ఉంటుందా ఆ సంపద నఫీజు దగ్గర?

'అది కాదు జాబిల్లీ? నా మాట విను. నేను చెప్పేది ఏమిటంటే?' అంటూ ఆమెను అనునయించబోయాడు.

'ఎల్లుండి ముఫ్తీబాబా దర్గా దగ్గర మా పెళ్ళి. జుబ్బా నుంచి దాసోబుని వెంట బెట్టుకుని వస్తున్నాడు మహాసుల్తాన్. వస్తే మీరు మా డాడీ మమ్మీ తాతయ్య, నానమ్మ మన ఊరి వాళ్ళందరితో కలిసిరండి. లేదంటే అటు నుంచి అటే మేము లండన్ వెళ్ళిపోతాం' అంటూ శ్యామ్‌సుందర్ వైపు తిరిగింది జాబిల్లి' అంతేనా? నేను కరెక్టుగానే చెప్పానా?' అడిగింది.

'తన మడ్డిభూతం నిన్ను పెళ్ళి చేసుకోబోతున్నాడని తెలిసి జుబ్బా యువరాణి నదియా సుల్తాన్ ఎంతో సంతోషించింది. మీ ఇద్దరినీ పర్మినెంట్‌గా తన దగ్గరే ఉంచుకుంటానని మహాసుల్తాన్ దగ్గర మంకు పట్టు పడుతోందట. కాబట్టి పెళ్ళి జరగగానే ముందుగా మీరు జుబ్బా నగరానికే వెళ్ళాలి. బహుశా చీమల లోయలోనే మీ హనీమూన్ ఏర్పాటు చేయవచ్చు' నవ్వుతూ చెప్పాడు శ్యామ్‌సుందర్.

'నువ్వు నాకు స్నేహితుడివి కాదు. శత్రువువి' కోపంగా అరిచాడు రమేష్.

నవ్వాడు శ్యామ్‌సుందర్. 'నువ్వు ఈ ప్రపంచమంతా వెతికినా నఫీజు వంటి పెళ్ళికొడుకును తీసుకు రాలేవు. సో రాజీపడిపో. ఇన్విటబుల్‌ని యాక్సెప్ట్ చెయ్. ప్రాణాలు పోతాయని అనిపించే సిచ్యుయేషన్స్‌లో కూడా అతను ఎంత కూల్‌గా ఉంటాడో నేను ప్రత్యక్షంగానే చూశాను. మనిషికి కావల్సింది అదే. మంచి మనసు... గుండెల నిండా ధైర్యం.' అంటూ సోఫాలో నుంచి లేచాడు శ్యామ్‌సుందర్.

'ముఫ్తీబాబా దర్గా దగ్గర కలుసుకుందాం' అంటూ బయటికి వెళ్ళిపోయాడు.

పళ్ళు బిగపట్టి చురచుర చూస్తూ నిలబడిపోయిన రమేష్ దగ్గరకు వచ్చి, 'ప్లీజ్ బాబాయ్. నాకు నఫీజు అంటే చాలా ఇష్టం' అన్నది జాబిల్లి గోముగా.

మంచుమాదిరి కరిగిపోయింది రమేష్ కోపం. 'ఆల్‌రైట్. పెళ్ళి మన ఊళ్ళో. తర్వాత దర్గా దర్శనం. ఓకే?' అని అడిగాడు.

కిలకిలా నవ్వింది జాబిల్లి. ఆ గదిలో ఉన్న లైట్లన్నీ రెట్టించిన ఓజ్జేజితో ధగధగలాడినట్లు అనిపించింది అందరికీ.

(అయిపోయింది)

## పదే పదే అంటే ఇబ్బందేనట!



*లిప్‌లాక్‌లు సినిమాలో సర్వసాధారణమైపోయాయి. ఒకసారి అంటే పర్వాలేదు కానీ పదే పదే అవే సీన్లు చేయాలంటే మాత్రం చాలా ఇబ్బంది అంటోంది నర్గీస్ ఫక్రీ. 'అజహర్‌'లో ఇమ్రాన్ హష్మీకి జంటగా నటిస్తున్న నర్గీస్ లిప్ లాక్‌ల సీన్లలో చాలా ఇబ్బందిగా ఫీలయ్యాను అంటోంది. ఈ సినిమాలో ఇవి చాలాసార్లు వస్తాయి. తెర మీద ప్రేక్షకులు వీటిని చూస్తూ ఎంజాయ్ చేస్తారేమో కానీ, వీటిని చేయడానికి మాత్రం తాను చాలా కష్టపడ్డానని చెప్పుకొచ్చింది. ఈ సినిమా ఒప్పుకునేముందు లిప్‌లాక్ సీన్లు చేయాలన్న విషయం తెలుసు కానీ మరీ ఇంత ఎక్కువగా ఉంటాయన్న సంగతి తనకు తెలియదని అంటోంది. ఈసారి నుంచి ఇటువంటి సీన్లలో నటించకూడదని అనుకుంటోందట! ఇలాంటి నిర్ణయాలు అమలు చేయడం బాలీవుడ్‌లో సాధ్యం కాదన్న సంగతి నర్గీస్‌కి ఇంకా తెలిసినట్టు లేదు అంటున్నారు బాలీవుడ్ జనాలు.*



**ఆ పెళ్ళిపందిరి అత్యంత శోభాయమానం! బదరీనాథ్ గారింట్లో, వాళ్ళమ్మాయి శ్రీనిజ వివాహం. పెళ్ళికొడుకు చెన్నైలో సివిల్ ఇంజనీర్. ఆప్తమిత్రుడు భార్గవ, అతని భార్య దివ్యను పెళ్ళికి వారం ముందే రమ్మని చెబితే వచ్చారు. వాళ్ళు పెళ్లి పనుల్లో సాయం అందించటం బదరీనాథ్ దంపతులకు పెద్ద బరువు దిగినట్లయింది.**

పెళ్లి ముహూర్తానికి వ్యవధి ఉన్నందున పందిరిలో కూర్చొని అమ్మాయిలతో సరదాగా కబుర్లాడుతున్నాడు భార్గవ. అమ్మాయిల కొంటె ప్రశ్నలకు గమ్మత్తుగా జవాబులు ఇవ్వడంలో దిట్ట! కుర్రాళ్ళకు భార్గవను చూస్తుంటే మహా మంటగా ఉంది. తామంతా కన్నెపిల్లలతో కులాసా చేద్దామనుకుంటే ఈ ముసలాడి పాదాల దగ్గరపడి దేవుళ్ళాడతారేమిటి వీళ్ళంతా? అందమైన అమ్మాయిలందరినీ బయటకు రానీయకుండా కట్టడి చేసిన ఆ ముసలాడిని మాత్రం క్షమించలేకపోయారు అక్కడి యువకులు.

'అబ్బ! ఈయనేమిటి బాబూ! ఇలా తగులుకున్నాడు? జీడిలా వదలడా ఏమిటి? ఈయనగారికేమైనా ఈడా! జోడా?" అని ఎకసెక్కమాడాడు ఓ కుర్రాడు.

"అన్నట్లు ఇతగాడెందుకో చొంగలు కార్చటం?" మరో కుర్రాడి వెటకారం.

# ప్రియవల్లభుడు

-కె.కె.రఘునందన



"ఈ ముసలాడికి ఒకనాటి వెధవగుణాలు ఉండిపోయాయేమో! ఈ వయసులో ఏమీ చేయలేక వీళ్ళందరినీ చుట్టూ పెట్టుకుని లొట్ట లేస్తున్నట్లుంది" అని మరొకరి విమర్శ.

వాళ్ళందరి మాటలు పంచలో నిల్చున్న దివ్య చెవినపడ్డాయి. ఈ కుర్రాళ్ళంతా మాటి మాటికీ తన భర్తను 'ముసలాడు' అంటుంటే విని భరించలేకపోతోంది. తన భర్తకు వయో భారం కలగవచ్చుగాక! ఇప్పుడు ముసలాడే! అది నిజం. కాని ఈ కుర్రకారుకేం తెలుసు! ఈ భార్గవ అనే అతని అందం! వాళ్ళకెలా తెలుస్తుంది అతను అందరికీ ప్రియవల్లభుడని...?

ఇప్పటి ముసలాళ్ళంతా ఒకప్పుడు కుర్రాళ్ళు కాదూ!? ఈతముల్లును ఎదుర్కొనే శక్తి ఉన్న ఈ తరం కుర్రకారంతా రేపు వయసు మీద బడితే ముసలి వగ్గులైపోరూ!

పెళ్ళిపందిరిలో కూర్చున్న భార్గవను చూసింది దివ్య. అతని చుట్టూ అందమైన అమ్మాయి లంతా మూగి ఏదేదో అడగటం గ్రహించి సన్నగా నవ్వుకుంది. ఈనాటికీ అతని వాక్చాతుర్య మధు రిమ చెక్కుచెదరకపోవటం విభ్రాంతికి గురి చేస్తోంది ఆమెను.

ఎంతసేపూ సెల్‌ఫోన్‌లోనూ, నెట్ చాటింగ్ లోనూ, మెసేజ్‌లతోనూ కాలం గడిపే ఈతరం అమ్మాయిలను తన చుట్టూ చేరేలా చేయగల ఘనత భార్గవ సొంతం. మరి ఈనాటి ముస లాయన ఆ రోజుల్లో తనలాంటి ఎందరో అమ్మా యిలకు ఆరాధ్య దైవం!

ఔను! ఆ రోజుల్లో... భార్గవ.... ఆరడుగుల అందమైన విగ్రహం... ఉంగరాల జుత్తు.. ఎల్ల వేళలా చిరునవ్వు... నడుస్తోంటే ఆ ఠీవీ.. ఓహ్!

●●●

"కుర్రాళ్ళందరిలోనూ ఏ కుర్రాడు మేలు అంటే మాత్రం.. నేను ఓటేసేది.." అని ఇంకా ఏదో చెబుదామనుకునేసరికి హిమజకు అడ్డు పడుతూ అందుకుంది సంధ్య.

"ఆగాగు! మిగతాది నే చెప్తా! అందంలో పోటీ పెడితే అతగాడికి ఎవరూ సాటిరారు. మాటల్లో మేజిక్కులు చేయగల దిట్ట ఎవరంటే, అతగాడే! ఇక చదువులో ముందుండేది ఎవ రంటే మళ్ళీ అతడే! చెప్పేస్తున్నా!... చెప్పేస్తున్నా.." అని ఉరుకుతుంటే సంధ్యను ఆపి, తను గొంతు సవరించుకుంది నీరజ.

ఇంతలో నీరజను "నువ్వలా అక్కడే ఆగు. నేను చెబుతా! శ్రీశ్రీశ్రీ... భార్గవ! సూపర్‌స్టార్ రజనీ కూడా అతడి ముందు బలాదూర్! అలాంటి భార్గవ పైనేనా మీ ఇద్దరూ కన్నేసింది" అని నిలదీసి అడిగింది సునయన కొంటెతనం జోడించి.

"మరి నువ్వు మాత్రం తక్కువదానివా? అతగాడితో లిప్‌లాక్ చేద్దామని చకోర పక్షిలాగా ఎదురు చూడ్డం లేదూ!? అని ఎదురడిగింది హిమజ.

"ఔను గానీ, నీ ఎద సంపదతో అతగాణ్ణి బిగియారా కౌగిలించుకోవాలని చూస్తున్నావు కదూ!" అని మరింతగా ఉడికించింది నీరజ.

అదే సమయంలో అక్కడికి దివ్య వచ్చింది. "క్లాస్‌కి టైం అవుతుంటే ఇక్కడేంటి మీ ఉప్పర మీటింగ్?" అని త్వరపెట్టింది.

"బోర్ యార్! ఆ జెండా కొయ్యలాంటి ఫిజిక్స్ లెక్చరర్‌ను చూస్తే నాకు డోకొస్తుంది. లెసన్ వినాలంటే పరమబోర్!" కళ్ళజోడు ముక్కు మీదకు లాక్కుంటూ అన్నది సంధ్య.

"నీ కళ్ళకి భార్గవ కనిపిస్తుంటే, లెక్చరర్స్ ఎలా కనిపిస్తారే?" అని ఎద్దేవా చేసింది నీరజ.

"అబ్బ! మీరంతా ఎందుకట్లా వెర్రెత్తిపోతు న్నారు భార్గవ అంటే. మనం ఇక్కడికి వచ్చింది చదువుకోడానికి, తల్లిదండ్రుల ఆశలు నెరవేర్చ డానికి. అంతే తప్ప మగాళ్ళ జపం చేయడానికి కాదు" అని హితబోధ చేసింది దివ్య.

"పాపం! ఈ దివ్యమ్మ చద్దన్నంలో ఆవకాయ ఊట కలుపుకొని తినే రకం. మనలా పిజ్జానో, బర్గరో తినే రకం కాదు" హిమజ అనేసరికి అంతా ఫక్కున నవ్వారు.

తన మానాన తాను క్లాసుకి వెళ్ళిపోయింది దివ్య. వాళ్ళంతా బి.ఎస్.సి ఫైనలియర్! హాయిగా డబ్బు ఖర్చు చేసుకుంటూ ఆనందించే రకాలు. ఒక్క దివ్య మాత్రమే అలాంటి ఆనందాలకు దూరంగా ఉంటుంది.

●●●

ఎప్పట్లాగే ఆరోజు కాలేజీకి వెళ్ళడానికి బస్సు కోసం ఎదురు చూస్తోంది దివ్య. ఒక బండి తన పక్కనే ఆగటం గమనించి ఆశ్చర్యపోయింది. ఎవరో కాదు భార్గవ!

"ఈ రోజు బస్సులేవీ దొరకవు. ఏదో పార్టీవాళ్ళు బంద్ ప్రకటించారట! అందుకే నేను పక్కిం టాయన్ని అడిగి బండి తెచ్చాను. మీకు అభ్యం తరం లేకపోతే ఎక్కండి" అన్నాడు దివ్యవైపు చూస్తూ.

తననెవరైనా బండిమీద చూసి తండ్రికి చెబితే మహా చిక్కు! కొద్దిసేపు తటపటాయిం చింది. కాని క్లాసు ఎగ్గొట్టడం తనకు ఇచ్ఛగిం చదు. భయం తోటే ఎక్కి కూర్చుంది. వెళ్తున్న ప్పుడే ఏవేవో అడిగాడు భార్గవ. రోడ్డు గోతుల మయం కావటాన కుదుపులతో, ఎంత పట్టు కున్నా సరే ఆమె ఎద ఎత్తులు వీపుకి తగలటంతో షాక్ కొడుతోంది భార్గవకు!! స్పీడ్‌బ్రేకర్స్ మరీను. అతను కావాలని చేస్తున్నాడేమో! అన్న సందేహం దివ్య మనసులో. ఇంతలో ఒకచోట మలుపు దగ్గర ఎదురొచ్చిన ట్రాక్టర్‌ను తప్పించబోయే లోగానే మరో బైకు అడ్డంగా వచ్చేసింది. ఇద్దరూ ఇసుకలో పడిపోయారు. దెబ్బలు తగల్లేదు. భయంతో చివురుటాకులా వణికిపోతూ భార్గ

వను ఒక్కసారిగా అల్లుకుపోయిందామె.

అప్పుడామె పయోధరాలు అతని గుండెలపై మెత్తని పూబంతుల్లా తగిలి నరాలు జిల్లుమనిపించాయి. ఆ పారవశ్యంలో అతను దివ్య వీపువెనక్కి చేతులను పోనిచ్చి గట్టిగా హత్తుకుని ఆమె పెదాలపై ముద్దుల వర్షం కురిపించాడు. ఆమెలో ఆవేశం ఉవ్వెత్తున ఎగసి మరింత కరుచుకుపోయేలా చేసింది. అతని చేతులు ఎక్కడెక్కడో తడమ సాగాయి. ఒకరి పాదాలు ఒకరు చుట్టేసుకున్నారు. అది ఇసుక ప్రదేశమన్న మాట మరచి అదొక మెత్తని హంస తూలికా తల్పమల్లే భావించారు. ఏదో హాయి. అక్కడికి కొద్దిదూరంలో ఉన్న టిఫిన్‌కొట్టు ఆసామి గబగబ వచ్చి "కనిపించని కొకుదెబ్బలు తగిలుంటాయి బాబూ! ఒక గంట పాటు యిస్రాంతి తీసుకోండి బాబూ!" అనేసరికి ఇద్దరూ విడివడి పైకి లేచారు. దివ్యను ఎదురుగా ఉన్న పాకలోకి నడిపించుకుని వెళ్ళాడు భార్గవ. మంచంపైన పరుండబెట్టాడు.

"సేతులు, జబ్బలు రాయి బాబూ! నొప్పులు సర్దుకుంటాయి. నానే మర్దనా సేద్దునుగాని, మీలా పెద్ద జాతోల్ల మీద... అదీ ఓ ఆడకూనపైన సేతులేయటం మాలాటోరికి తగదయ్యా! సిన్న సవురుసుక్క ఏత్తాను. దాంతో రాయండి. యిదిగో సెయ్యిపట్టండి" అని నవరత్న తైలం అరచేతిలో వేశాడు తాత. ఆమె ఒంటిమీద తన




చేతులతో సుతిమెత్తగా మర్దిస్తుంటే శిరీష పుష్పం సుకుమారత్వం గోచరించింది. బయట నుండి రివ్వున వీచే గాలి వల్ల శరీరంపైనున్న బట్టలు అస్తవ్యస్తంగా చెదరి రేగిపోతుంటే భార్గవ చూపు సూదంటురాయిలాగా పడేది. ఆ క్షణం మాత్రం అదుపు తప్పేది మనసు. నును పైన నడుము, లేతతివ్వను పోలిన వేళ్ళు, తాటి ముంజ రంగులో లేలేత అధరాలు, పసందైన జామపండంటి పరువాలు, అరటి బోదెల్లాంటి బలమైన పిక్కలు ఒకటొకటే దర్శనమిస్తున్నాయి.

ఒక అరగంట తర్వాత "బాబయ్యా! నాకసలే కల్లు కనబడవ్. అమ్మ నెగిసినాది గాబోలు. యింటికి దిగబెట్టేత్తారా? జాగ్రత్తగా వప్పగించాల!" అని చెప్పాడు తాత. దివ్య సన్నగా కన్నీళ్ళు పెట్టుకుంది.

"ఛీ! శనిలాగ నేను మీ బండి ఎక్కబట్టే మీకిలాగ జరిగింది" అన్నది.

"నాకటువంటి సెంటిమెంట్స్ లేవులెండి. మీరు కోలుకున్నందుకు సంతోషంగా ఉంది" అని బండి స్టార్ట్ చేశాడు భార్గవ.

●●●

"అమ్మ దొంగా! నువ్వు భార్గవతో కలిసి చెట్టపట్టాలేసుకు తిరుగుతావా!" అంది ఆట పట్టిస్తూ హిమజ.

మర్నాడు కాలేజీలో దివ్య అడుగుపెట్టడమే తడవు, మిత్రురాళ్ళ దాడి మొదలైంది.

"అసలు నేచెప్పేది వినండే!" తన ప్రమేయం ఏమీలేదని, అనుకోకుండా జరిగిందని, సంఘటన మొత్తం చెప్పడానికి ఉద్యుక్తురాలయ్యేసరికి అడ్డుపడ్డారు కొందరు.

"కొయ్‌కోయ్! నీ గురించి అంతా తెలిసింది. మాకు తెలిసిన ఒకాయన బండి రిపేరొచ్చి ఒక పాకలో పెట్టడానికి వచ్చినప్పుడు నీకు సేవలు చేస్తూ భార్గవ కనిపించాడట! ఆహా! ఎంత అదృష్టవంతురాలివే! ఇంతకాలంగా లైనేస్తున్నా ఫలితం సున్న! నువ్వే నయం, భార్గవలాంటి వాడిని పట్టేశావు" అంది అసూయగా సునయన.

ఒక్కొక్కరు ఒక్కో మాట అన్నారు. వారి మాటలను ఖండించే ఓపిక లేకపోయింది దివ్యకు. తన మానాన తాను క్లాసుకి వెళ్ళిపోయింది.

●●●

ఆ రాత్రి మంచం మీద వెల్లకిలా పడుకుని ఆలోచనల్లో పడింది దివ్య. పుస్తకాన్ని బోర్లించి గుండెలపై పెట్టుకుంది. భార్గవ తన ఎద సంపదను చేతులతో ఒత్తినప్పుడు ఏదో ఉన్మత్తత! ఒళ్ళంతా పిచ్చిగా పరవశించింది. నడుం మడతల్లో వేళ్ళు దూర్చి నొక్కుతుంటే స్వర్గమే దిగి వచ్చినట్లుంది. ఇంతదాకా తను ఎరుగని పురుష స్పర్శలో ఇంతటి మహత్తుందా అనిపించింది.

"ఈ రోజు కాలేజీకి వెళ్ళేదేమైనా ఉందా... లేదా?" తండ్రి సోమనాథశర్మ కేకతో తుళ్ళి పడింది దివ్య.

గబగబా తయారై వెళ్ళేసరికి కాలేజీ మీటింగ్ హాల్ దగ్గర భార్గవ చుట్టూ ఎందరో అమ్మాయిలు గుమిగూడి ఉన్నారు. ఇదివరలో అతను ఎలాగున్నా దివ్య మనసులో ఎటువంటి కలకలం ఉండేది కాదు. అతనెవరో.. తానెవరో... కాని ఈరోజు వేరే వాళ్ళు ఎవరైనా సరే, భార్గవతో చనువుగా ఉంటే సహించలేకపోతోంది. అంటే తన మనసు అతణ్ణి ఇష్టపడుతోందా?! తన తండ్రి సోమనాథశర్మ కులమతాల పట్టింపు బాగా జీర్ణించుకున్నవాడు. శాఖాంతరానికి కూడా తల వంచడు.

అసలీ సంవత్సరమే పరీక్షలైన మరుక్షణం తన మెడలో తాళి కట్టించే యోచనలో ఉన్నాడు. ఇంట్లో తల్లి మాట చెల్లదు. తను ఒక్కతే కూతురు కావటంతో తనకు నచ్చటమే ప్రధానమంటాడు తండ్రి. ఇంటి వాతావరణం తలచుకునేసరికి దివ్య తీవ్ర దుఃఖితురాలైంది. కనుల్లో



## బెడిసికొట్టిన జిమ్

'బ్రహ్మోత్సవం'లో సమంతను చూసిన అభిమానులు షాక్‌కి గురయ్యారట! కారణం.... సమంత ముఖంలో మునుపటి అందం లేదు. బుగ్గలు అవీ కాస్త ఉబ్బినట్టుండి ముఖం అందం దెబ్బతిందని అంటున్నారు. శరీరాకృతి వరకూ బాగానే ఉన్నా, ముఖమే అందంగా లేదని ఆమె అభిమానులు సైతం అంగీకరిస్తున్నారు. దానికి కారణం సమంత జిమ్‌లో ఏకధాటిగా వర్కవుట్లు చేయడమే అని కూడా అనుమానిస్తున్నారు. ఎక్కువసేపు జిమ్‌లో గడపడం వలన శరీరం స్లిమ్‌గా మారి ఉండవచ్చేమో కానీ ముఖం అందం మాత్రం దెబ్బతిందనేది వారి వాదన. ఈ సినిమాలో సమంతను చూసిన వారందరూ షాకైన మాట వాస్తవమే అంటున్నారు టాలీవుడ్ జనాలు. ఈ విషయాన్ని ఇప్పటికైనా సమంత గమనిస్తే మంచిదని కూడా వారు సలహా ఇస్తున్నారు.

## అవికాగోర్ లుక్స్ అదుర్స్

ఫ్రాన్స్‌లో జరుగుతున్న కేన్స్ ఉత్సవాలకు బాలీవుడ్ హీరోయిన్లే ఎక్కువగా హాజరవుతుంటారు. దక్షిణాది నుంచి సామాన్యంగా వెళ్ళరు. కానీ చిన్నారి పెళ్ళికూతురు అవికా గోర్ ఈసారి కేన్స్ ఉత్సవాలకు వెళ్ళడమే కాదు, దక్షిణాది హీరోయిన్లకూ మోడ్రన్ డ్రస్‌ల పట్ల మంచి టేస్ట్ ఉందని నిరూపించింది. ఉత్సవాలకు అవికా వేసుకొచ్చిన పొడవాటి గౌను చూసి అందరికీ కళ్ళు తిరిగాయట! క్లీవేజ్‌షో చేయడం దక్షిణాది వారికీ బాగా తెలుసు అన్నట్టు ఉన్న ఆ డ్రస్ పలువురిని ఆకర్షించిందట! ఇక సినిమాలు చేయను బుద్ధిగా చదువుకుంటాను అని చెప్పిన అవికా ఒక్కసారి ఇలా గ్లామర్‌గా దర్శనమివ్వడం వెనుక ఆంతర్యం ఏమిటో అర్థం కావడం లేదు అంటున్నారు సినీ జనాలు.



నీరు చిప్పిల్లింది.

ఎంతోమంది భార్గవ చుట్టూ తిరుగుతున్నారంటే కేవలం అతని అందమొక్కటే కాదు, అతని వ్యక్తిత్వం కూడా ఒక కారణం. తెలుగులో సందేహాలున్నాయంటూ కొందరు చిలిపి ప్రశ్నలతో వేధించినా వాటికి చమత్కారంగా జవాబులిచ్చేవాడు.

"రభోరువులంటే ఏమిటి మహాశయా?" అని అడిగితే భార్గవ ఇచ్చిన సమాధానం ఇది.

"పద్దెనిమిదేళ్ళ పడుచుపిల్లవి, నీకింకా తెలీదా! అరటి బోదెల్లాంటి..." అని ఆమె తొడలవైపు చూసేసరికి సిగ్గిల్లి పారిపోయేది.

"బింబాధరాలు... అనగా అర్థం వివరించండి" అనగానే 'దొండపండంటి నీ పెదాలే?' అనేవాడు. ఇంకా అలాగే కోరి అతని నోటంట శృంగార పదాలు పలికించాలనే తపనతో కొందరు అమ్మాయిలు వెళ్ళి ఏవేవో శ్లేషార్థాలు వచ్చేలాగ అడిగి కంగుతిని భంగపడిన సందర్భాలు కోకొల్లలు! అయితే దివ్యమాత్రం ఏనాడూ పొరపాటున కూడా అడిగేది కాదు.

"మేమెంత ట్రైచేసినా సరే మాకు పడ్డంలేదే! ప్చ్! నువ్వొక్క రోజు రాకపోతే మాత్రం ఏమండీ! దివ్య రాలేదా? అని మరీమరీ అడుగుతాడు. నువ్వే గ్రేట్!" ఓవైపు అసూయ కనబరుస్తూనే దివ్యను ప్రశంసించింది నీరజ.

"ఇకనేం! దూసుకుపో! మీ ఇంట్లో చెప్పేసి పీ..పీ..పీ..డుం..డుం...డుం.. మోగించు" సునయన అనగానే అందరూ ఒక్కసారిగా నవ్వేశారు.

వాళ్ళలా అనేసరికి మాత్రం దివ్య హృదయంలో ఒక అందమైన అలజడి చెలరేగింది. ఎలాగైనా భార్గవకి చెప్పేయాలి అతనంటే ఇష్టమని! మళ్ళా వీలవుతుందో లేదో! అసలే పరీక్షల సమయం. చదవకుండా వెర్రి వేషాలేస్తే తల్లిదండ్రులు తాట తీస్తారు. నిజానికి ఆరోజు కలిసి వెళ్ళటమే తప్ప దగ్గరగా తిరిగిన క్షణాలు మరి తారసపడలేదు. భార్గవ కూడా పరీక్షలకు చదవటంలో మునిగిపోయాడు. అతని రాకపోకలు మరి తెలిసేవి కావు. ఎవరి హడావిడి వారిది. భార్గవను కలవకుండానే కాలం గడిచిపోతోంది. ఓహ్! భగవాన్! ఏమిటీ పరీక్ష? ఫైనలియర్ పరీక్షల అనంతరం భార్గవ గదికి వెళ్ళి అతని సెల్ నంబర్ తీసుకోవాలనుకున్న దివ్యకు తీవ్ర నిరాశే ఎదురైంది. గతరాత్రే ఖాళీచేసి వెళ్ళిపోయినట్లు చెప్పారు. పరీక్షలకు ముందే అతన్ని కలిసి కనీసం ఏ ఊరో ఏమిటో వివరంగా అడిగి ఉండాల్సింది... ప్చ్! తన దురదృష్టం! విపరీతంగా బాధపడి ఏడ్చేసింది దివ్య.

•••

తండ్రి సోమనాథశర్మ పెళ్ళి ప్రయత్నాలు మొదలెట్టాడని తెలిసి లోలోపల కుంగిపోయింది దివ్య.

"పిల్లాడు ఇక్కడికి చూడ్డానికి రాలేట్ట! మనల్నే వాళ్ళ ఊరు రమ్మంటున్నాడు. తప్పక వెళ్ళాల్సిందే! బంగారంలాంటి సంబంధం!" అనేసరికి ఇంట్లోవారి ఆదేశాలను ధిక్కరించలేకపోయిందామె. కాని ఈ కుర్రాడు మాత్రం ఫోటోలు ఇచ్చి పుచ్చుకోడాలు వద్దన్నాడట! ఏకంగా పెళ్ళిచూపులేనట! భార్గవ తప్ప ఎవరూ నచ్చరన్నది తన మనసుకి తెలుసు.

ఆ కుర్రాడి స్వగ్రామం పద్మనాభంలో పెళ్ళిచూపులు. హడావిడి మొదలైంది. సోఫాలో ఎవరెవరో కూర్చున్నారు. అమ్మాయిని పదేపదే చూసేవారు కొందరు. ఆ సోఫాలో నల్లగా ఎవరో కుర్రాడు కూర్చుంటే అతను గాని పెళ్ళికొడుకు కాదు కదా అన్న సందేహంతో భళ్ళున వాంతి వచ్చినట్లయింది దివ్యకు.

తర్వాత తెలిసింది. ఎదురెదురుగా జరిపే పెళ్ళిచూపులకి పెళ్ళికొడుకు విరుద్ధమట! వేరే గదిలో ఏకాంతంగా మాట్లాడతాడట! అమ్మో! ఇక్కడంటే తనవాళ్ళున్నారు. అక్కడ తనొక్కతే ఉన్నప్పుడు ఆ కుర్రాడు గభాలున లాగేసి తనని ముద్దెట్టుకుంటే...! ఆ సంగతి తను ధైర్యం చేసి నలుగురిలో చెప్పుకోగలదా! అరచి గోలచేయగలదా?!

పెద్దల ఒత్తిడితో గదిలోనికి అడుగు పెట్టింది దివ్య. బయట కర్టెన్ సర్రున వేసేశారు. మొదట ఆ గదిలో ఎవరూ లేరు. తర్వాత ఎవరో వచ్చి అభిముఖంగా చతికిలపడినట్లు అలికిడి అయింది. చూడ్డానికి ఇష్టం లేక తలెత్తలేదు. ఎదురుగా ఉన్న వ్యక్తి తననేమీ ప్రశ్నించకుండానే తనవైపు రావటం గమనించింది. అతని చేతివేళ్ళు చుబుకం ఎత్తడంతో స్పర్శలో తెలిసింది. అయినా కళ్ళు తెరవకుండా కూర్చుంది. ఉగ్గబట్టు

కుని ఉన్నదా క్షణం! ఏం చేస్తాడోనని భయం... ఉద్విగ్నత! అతనేమైనా చేస్తే ప్రతిఘటించాలను కుని నిశ్చయించుకుంది. అతను తన ముఖం దగ్గరగా రావటం వెచ్చని ఊపిరి ద్వారా గ్రహిం చింది. అసహ్యం మొదలైంది. పెళ్ళిచూపుల పేరు పెట్టుకుని ఇటువంటి వెధవ పనులకి ఒడిగడతారన్న విషయం ఈ కుర్రాడి ప్రవర్తన వల్ల తెలుస్తోంది.

ఒక్కసారి అతని పెదాలు తన బుగ్గలని ముద్దాడడంతో తెలివిలోకి వచ్చి క్రోధంతో ఊగి పోయి, లాగి లెంపకాయ కొట్టబోయిన దివ్య అతన్ని చూసి అపారమైన దిగ్భ్రాంతిలో కూరుకు పోయింది.

"భా....ర్గ...వ్... మీరా!?" ఒకటే ఆనంద సామ్రాజ్యంలో ఓలలాడింది దివ్య. కళ్ళంట ఆనందబాష్పాలు.

"ఔను... నేనే! మనం విడిపోయినా నిన్ను నేను మరచిపోలేదు. నీ వివరాలు సేకరించాను. మీది మాది ఒకే కులమని, మీరు మాకు దూరపు బంధువులని కూడా తెలిసింది. మీ నాన్న గారు అప్పటికే నీ పెళ్ళి ప్రయత్నాలు చేస్తు న్నట్లు గ్రహించాను. నువ్వోసారి నా రూంకి వచ్చి నా వివరాలు అడిగావని కూడా ఇంటా యన చెప్పారు. నువ్వు నిరాశపడి వెళ్ళిపోయా వుట! నాపై నీకిష్టం ఉన్నట్లుగా ఆరోజే అర్థం చేసుకున్నాను. అందుకే నీకు వేరేవాడితో ఎక్కడ పెళ్ళి జరిపించేస్తారో నన్న భయంతో నేనే ముందడుగు వేసి నువ్వు నచ్చినట్లుగా మధ్య వర్తుల చేత కబురుపంపి వెరైటీగా ఉంటుందని నిన్ను సస్పెన్స్‌లో ముంచెత్తాలని ఇలా ఏర్పాటు చేశా! మనకు ముందే పరిచయం ఉన్న సంగతి నీకు నాకు తప్ప మరెవరికీ తెలీదు. అయినా పెళ్ళిచూపుల్లో నిన్ను ముద్దెట్టుకునే ధైర్యం ఏ పెళ్ళికొడుక్కి ఉంటుంది చెప్పు? ఇప్పటికే నువ్వు లోపలికి అడుగుపెట్టి చాలా సమయం అయిన ట్లుంది. బయటకెళ్ళు. నిన్ను ఇష్టపడ్డట్లు నేనే మా పెద్దల చెవిన వేస్తా!" అని చెప్పేసరికి ఆమె హృదయమంతా పున్నమి వెన్నెలలాంటి సంతోషం పరచుకుంది.

వెలుపలికి వచ్చిన దివ్యను అనేక ప్రశ్నలతో గుచ్చిగుచ్చి చంపారు కొందరు. అన్నిటికీ మౌనమే జవాబు అయింది.

"కుర్రాడు ఓ.కే. చెప్పేశాడు.." పెద్దలెవరో ప్రకటించగానే తనవాళ్ళంతా సంబరపడ్డం చూసి తనకు ఆ సంగతి ముందే తెలుసునన్న విషయం గ్రహించిన దివ్య ముసిముసిగా నవ్వుకుంది.

•••

ఆ మధుర క్షణాలు రానే వచ్చాయి. తొలి రేయి మాధుర్యాన్ని గ్రోలేందుకు ఆ దంపతు లకు పాలవన్నె పక్క సిద్ధమైంది. పక్క, తాంబూలం, మీగడ కట్టిన పాలు పొగలు కక్కుతూ, తీయని పదార్థాలు, పసందైన పళ్ళు, అత్తరు వాసనల ఘుమఘుమలు.. మనోజ్ఞమైన వాతావరణం. ముందడుగు వేశాడు భార్గవ. బిడియ పడింది దివ్య. మరల చొరవ చేసింది భార్గవే!

"కాలేజీలో అమ్మాయిలంతా నన్ను ఎన్నెన్నో కొంటె ప్రశ్నలు వేసేవారు. నువ్వు తప్ప! వాళ్ళడి




గినా నువ్వేనాడూ అక్కడుండేదానివి కాదు. అప్పట్లో నువ్వు అడగని, వాళ్ళడిగిన ప్రశ్నలకు సమాధానం మాత్రం నేనీ రోజు ఇవ్వదలిచాను" తన అర్థాంగి చెంతన కూర్చున్నాడు భార్గవ.

'ఏమిటో నేనడగనివి?' మంద్ర స్వరంలో అడిగింది దివ్య.

"ఇందీవరేక్షణ... అనగా నల్లని కలువల వంటి కన్నులు గల చిన్నది. అటువంటి నీ కళ్ళ లోకే నేను చూపులు కలప బోయేది. బింబాధ రాలు... ఇదిగో ఇవే నీ ఎర్రని దొండ పళ్ళంటి పెదాలు... వాటిని కసిగా నా పెదాలతో కలిపేసి అందులో తీపిని జుర్రేస్తా!

అస్తినాస్తి విచికిత్సకు తార్కాణమైన నడు మంటే.... పిడికిట ఇమిడే నీ నాజూకైన నడుమన్న మాట! దాన్ని నా చేతులతో బంధించి ముద్ది డతా!" అని భార్గవ ఇంకా ఏవేవో చెబుతూనే ఉన్నాడు. సిగ్గిల్లిన దివ్య మంత్రముగ్ధ రాలైంది.

చెవి దగ్గర గుసగుసలాడుతూ అనేకానేక రహస్య సంభాషణలన్నీ చెబుతూనే వెచ్చని ఊపిరిలూదుతూ కమ్మగా అనుభవాలను పండించు కుంటూ ఆ రాత్రిని జీవితంలో చెరిగిపోని ఒక అపూర్వ జ్ఞాపకంగా మలిచాడు భార్గవ. ఆ రాత్రేకాదు. జీవిత పర్యంతం వేవేల రాత్రులన్నీ మధురాతిమధురమైన రాత్రులుగానే మిగిలి పోయాయి.

•••

ఇహంలోకి వచ్చింది దివ్య. కుర్రకారు మాట లకు ఒకింత బాధాతప్తత పులుముకున్నా మళ్ళా స్థిమితపడి గతంలోకి ప్రయాణించిన ఆమె గది లోపల అద్దం ముందు నిలబడి చూసుకుంది. కళ్ళ కింద చారలొచ్చాయి. జుత్తు కొద్దిగా నెరసి... హుందాతనం ప్రసాదించింది. అక్కడక్కడ ముడుతలు కనిపించకపోలేదు. తనెంత మారిన ప్పటికీ తనను ప్రేమించే ప్రియవల్లభుడు భార్గవే!

బయట పెళ్ళిపందిరిలో ఉన్న భార్గవను ఒకసారి పిలిచి అన్యోన్యంగా మాట్లాడి, ఒక్క సారి తనివితీరా కావలించుకుని మనసును అల్ల కల్లోలం చేస్తున్న భావాలను కడిగేసుకోవాలని పించింది. అందుకే భార్గవను మెల్లగా పిలిచింది దివ్య.

మేడ మీద గదిని వేరేగా విడిదిగా ఇచ్చాడు బదరీనాథ్! అది భార్గవ, దివ్యలకు ఏకాంతంగా మారింది. ఆరుగాలాల శ్రమకు ఫలితంగా అందిన పంటను చూసిన రైతులా భర్తను చూడ్డంతోనే పులకాంకితురాలైంది దివ్య.

కుర్రాళ్ళ చర్చను భర్తతో చెప్పి కన్నీళ్ళు కారు స్తుంటే భార్గవ.. "ఛ! అదేమిటి చిన్నపిల్లలాగ... వాళ్ళన్నది నిజమే! నేను ముసలివాడినైనా, నా భావాలు నీ పట్ల ఏ మాత్రం చెదరలేదే! మరి నీకు భర్త నుండి ఇంకా ఏం కావాలి? చెప్పు దివ్యా?" అని లాలనగా అడుగుతున్న భార్గవను ఒక్కసారిగా కరుచుకుపోయింది.

"నీకేమిష్టమో నాకు తెలుసు! చెవి వెనుక ముద్దు నీ శరీరాన్ని కిర్రెక్కిస్తుందని అనేదానివి. ఇదిగో పెట్టేస్తున్నా! వక్షస్థలంపై నా హస్తాలతో మర్దన నిన్ను గుమ్మెత్తిస్తుందని చెప్పడం నాకు ఇప్పటికీ గుర్తే! వయసు మీరినా బిగువు తగ్గని వాటిపై నా అధికారం ఇప్పటికీ తగ్గలేదని నిరూ పిస్తా! ఊరించే నీ నాభి చుట్టూ ముద్దుల వర్ష మంటే మహాప్రీతి అని ఎరిగినవాణ్ణి కాబట్టి దానికి నేను సిద్ధమయ్యే ఉన్నా! ఇంకా నీకు కావలసినవి ఉంటే చెప్పేయ్! అవి కూడా తీర్చేసి స్వర్గలోకాల్లో విహరింపచేస్తా!' అని గాఢాలింగ నంతో కట్టేశాడామెను. ఆ పాల పక్కపైన అప్పుడే పెళ్ళయిన వారిలా ఒకటే రెచ్చిపోయారు. ఈ తరం వాళ్ళు నేర్చుకోవాల్సిన శృంగార సిలబస్‌కి ఉదా హరణ వాళ్ళ కిలికించిత చర్యలు!

"ఈ ముసలాయన ఎప్పటికీ కుర్రాడే... కాదు.. కాదు.. ఎప్పటికీ నా "ప్రియవల్లభుడు" మీరే!" అన్నది ప్రశంసగా దివ్య.

"ఆ మాట నేనీ రాత్రి మరోసారి రుజువు చేస్తాగా!" అన్నాడు భార్గవ భార్యను లాలనగా లాక్కుంటూ....!!

*సెల్: 97054 11897*

# అధిక రక్తపోటు తగ్గించే చెర్రీ జ్యూస్



మంచిరంగుతో చూడగానే నోరూరించే చెర్రీ పండును ఇష్టపడని వారంటూ సాధారణంగా ఉండరు. ఈ పళ్ళు మంచి రుచినే కాకుండా ఆరోగ్యాన్ని ఇస్తాయంటున్నారు బ్రిటన్ పరిశోధకులు. చెర్రీ జ్యూస్‌లో అధికరక్తపోటును తగ్గించే గుణాలు మెండుగా ఉన్నాయన్న విషయం వీరి పరిశోధనలో వెల్లడైంది. గుండె జబ్బులు, కిడ్నీ సమస్యలకు కారణమయ్యే అధికరక్తపోటును తగ్గించుకోవడానికి మందులు వాడడం కన్నా ఓ గ్లాసు చెర్రీ జ్యూస్ తాగితే చాలా వరకూ రక్తపోటును అదుపులో ఉంచుకోవచ్చన్న విషయం, సుమారు వెయ్యిమంది బీపీ పేషెంట్ల మీద వీరు దీర్ఘకాలం చేసిన పరిశోధనల్లో వెల్లడైంది. వీరిని రెండు గ్రూపులుగా విభజించి, ఒక గ్రూపు వారికి రక్తపోటు మందు మోతాదు కొద్దిగా ఎక్కువగానూ, మరొక గ్రూపు వారికి చెర్రీజ్యూస్‌తో పాటు నామమాత్రపు మందులు ఇచ్చి రెండు గంటల అనంతరం వీరి రక్తపోటును పరీక్షించారు. మొదటి గ్రూపు వారిలో రక్తపోటులో ఎలాంటి మార్పు రాకపోగా రెండవ గ్రూపు వారిలో సాధారణ స్థాయికి రావడం వీరు గమనించారు. ప్రతిరోజూ ఓ గ్లాసు చెర్రీ జ్యూస్ తాగితే రక్తపోటును అదుపులో ఉంచుకోవడంతో పాటు పలు ఆరోగ్య సమస్యల నుంచి కూడా తప్పించుకోవచ్చంటున్నారు పరిశోధకులు.

# కాల్షియం సప్లిమెంట్స్ ప్రమాదమే!



వయస్సు పెరుగుతున్న కొద్దీ ఎముకల పటుత్వానికి కాల్షియం వాడమని వైద్యులు సలహా ఇస్తుంటారు. ముఖ్యంగా అరవై అరవై, అయిదు సంవత్సరాల వయస్సు ఉన్న మహిళలు కాల్షియం సప్లిమెంట్స్ తీసుకోవడం తప్పనిసరి అని కూడా సూచిస్తారు. అయితే ఈ సూచన ఎముకల పటుత్వాన్ని పెంచినా, దీర్ఘకాలంలో గుండె జబ్బులకు దారితీసే ప్రమాదం ఉందని పరిశోధకులు హెచ్చరిస్తున్నారు. నార్వే యూనివర్సిటీకి చెందిన పరిశోధకులు అరవై అయిదు సంవత్సరాలు పైబడిన సుమారు లక్షమంది మహిళల మీద పరిశోధనలు నిర్వహించారు. వీరికి ప్రతిరోజూ వెయ్యి మిల్లీగ్రాముల కాల్షియం సప్లిమెంటును దీర్ఘకాలం పాటు ఇచ్చారు. వీరిలో సుమారు పదివేల మంది ఎముకలు విరగడం అనే ప్రమాదం నుంచి తప్పించుకున్నా పదివేలమందికి పైగా మహిళలు గుండెజబ్బులతో మరణించడాన్ని వీరు గుర్తించారు. కాల్షియం సప్లిమెంట్‌ను దీర్ఘకాలం పాటు ఉపయోగించిన కారణంగానే మహిళల్లో హృద్రోగ సమస్యలు తలెత్తి మరణాలు సంభవించాయని వీరు నిర్ధారించారు. వృద్ధులైన మహిళలకు కాల్షియం సప్లిమెంట్ల వలన ఎంత ఉపయోగం ఉంటుందో అంతకు మించి ప్రమాదం పొంచి ఉంటుందని వీరు చెబుతున్నారు.

# కృత్రిమ చక్కెర పానీయాలు ప్రమాదం



ఇవి ఏ వయస్సు వారికైనా అంత మంచివి కావన్న సంగతి తెలిసిందే! ఈ పానీయాలను గర్భవతులు ఎక్కువగా తీసుకుంటే గర్భస్థ శిశువు ఆరోగ్యం మీద తీవ్ర ప్రభావం చూపించడమే కాకుండా పిల్లల్లో అధికబరువుకు కారణం అవుతాయని అంటున్నారు కెనడా యూనివర్సిటీ అధ్యయన వేత్తలు. సుమారు మూడువేల మంది గర్భవతుల మీద వీరు సుదీర్ఘకాలం అధ్యయనం నిర్వహించారు. వీరిలో కొందరు వారంలో ఒకటి లేదా రెండు సార్లు కృత్రిమ చక్కెర పానీయాలు తీసుకుంటే మరికొందరు ప్రతిరోజూ చక్కెర పానీయాలు తీసుకుంటున్నట్లు తెలిపారట! ప్రసవం అనంతరం శిశువుల ఆరోగ్యాన్ని వీరు పరిశీలించారు. చక్కెర పానీయాలను తక్కువ తీసుకున్న తల్లుల పిల్లలు సాధారణ బరువుతో జన్మించగా, ప్రతిరోజూ కృత్రిమ చక్కెర పానీయాలు తాగిన వారి పిల్లలు పుట్టుకతోనే అధికబరువుతో జన్మించడమే కాకుండా ఆ అధికబరువు అనేది పిల్లలు పెరిగిన తరువాత కూడా కొనసాగడాన్ని వీరు గుర్తించారు. పిల్లల్లో అధికబరువుకు తల్లి తీసుకున్న కృత్రిమ చక్కెర పానీయాలే కారణమా? లేక మరేదైనా కారణం ఉందా? అన్న విషయం మీద వీరు లోతుగా అధ్యయనం చేస్తున్నారు. అయితే కృత్రిమ చక్కెర పానీయాలు గర్భస్థ శిశువు మీద తప్పనిసరిగా ప్రభావం చూపుతాయన్నది మాత్రం నిజం అని వీరు స్పష్టం చేస్తున్నారు.




# కొవ్వును కరిగించే ద్రాక్ష



ద్రాక్షపండు తినడం వలన కలిగే ఆరోగ్య లాభాల గురించి తెలిసిందే! వీటిని ప్రతిరోజూ వందగ్రాముల వరకూ తీసుకుంటే శరీరంలో కొవ్వు కరగడంతో పాటు బరువు తగ్గడం, పేగులలో మంచి బాక్టీరియా వృద్ధి చెందడం జరుగుతుంది అంటున్నారు అమెరికా యూనివర్సిటీ పరిశోధకులు. కొంత మంది ఊబకాయులకు ప్రతిరోజూ ఫ్యాట్ కలిగిన ఆహారంతో పాటు సుమారు వందగ్రాముల ద్రాక్ష పళ్లను పదకొండు వారాల పాటు ఇచ్చారు. అనంతరం వారి బరువులో స్వల్ప మార్పులు రావడంతో పాటు శరీరంలో కొవ్వు శాతం తగ్గడాన్ని పరిశోధకులు గుర్తించారు. మరికొంత మందికి ద్రాక్షపళ్ళను ఇవ్వకుండా, కొవ్వుతో కూడిన ఆహారాన్ని మాత్రమే ఇచ్చి వారి బరువు పరిశీలించారు. వీరి బరువులో ఎలాంటి మార్పులు రాకపోగా కొవ్వు శాతం కొద్దిగా పెరగడం వీరు గమనించారు.

-అవినాష్

# భలే పోటీలు-భళా సంబరాలు

**ప్రపంచమే ఓ పోటీ రంగం. సత్తా తెలియాలన్నా, ఆత్మవిశ్వాసం రుజువు కావాలన్నా పోటీ పడాల్సిందే. అందుకే మనిషికైనా, మనిషి అధీనంలో ఉండే జంతువులకైనా పోటీ తప్పదు. ప్రపంచంలో ప్రాంతాన్ని బట్టి ఎన్నో రకాల పోటీలుంటాయి. మనకు తెలియని పోటీలు చూస్తే అరే! భలే ఉన్నాయే! అనిపిస్తాయి. కొన్ని పోటీలు హేళనగా అనిపించవచ్చు. కానీ ఇవన్నీ వినోదం కోసమే కాదు ఒకింత సేవాదృక్పథంతోనూ నిర్వహిస్తున్నారు. బొద్దింకల రేస్, పందుల పోటీలు, గాడిదలకు పోటీలు, ఎత్తు చెప్పులతో పరుగు పందెం, నగ్నంగా సైకిల్ పోటీల్లో పాల్గొనడం...వంటివెన్నో దేశ విదేశాల్లో జరుగుతున్నాయి. ఆ పోటీలేంటో తెలుసుకోండి.**

కోళ్ల పందాలు, గుర్రప్పందాలే కాదు మనకు తెలియని అనేక పందాలు ఉన్నాయి. ఆ పందాల గురించి వింటే ఆశ్చర్యంతో పాటు ఆసక్తి కలగక మానదు. కొన్ని పందాల గురించి వింటే ఇలాంటి ఐడియాలు ఎలా వస్తాయన్న ఆలోచన కూడా వస్తుంది. కాస్తంత వినోదంతో పాటు, కొంత లాభమూ చేకూర్చే కొన్ని చిత్ర విచిత్రమైన పోటీల గురించి మీరూ చదివేసేయండి!

## కప్ప గెంతుల పందెం



కప్పల పరుగుపందెం గురించి తెలుసా? ఓహియోలో వ్యాలీసిటీ అనే పల్లెటూరులో 1962 నుంచి సరదాగా ఈ కార్యక్రమం ఏటా జరుగుతూ వస్తోంది. అయితే కప్పలు గెంతులు వేస్తూ వెళతాయి. ఈ పందెం చూడాలను కుంటే ఫ్రీ. కానీ పోటీల్లో పాల్గొనాలంటే ఎంట్రీ ఫీజు మాత్రం మూడు డాలర్లు చెల్లించాలి. అనేక ఏళ్లుగా ఈ పోటీ జరుగుతోంది. దాదాపు ఆరువందల మంది దాకా ఈ కప్పలపరుగు పందెం పోటీల్లో పాల్గొం టారు. ఈ పోటీల్లో పాల్గొనే వారికి కొన్ని నియమ నిబంధనలు ఉన్నాయి. కప్పలను చేత్తో ముట్టుకోకూడదు, అదిలించకూడదు..నేల మీద చరచ వచ్చు, అరుచుకోవచ్చు. కప్పలు ముందు పరిగెడుతుంటే వెనక వీళ్లూ కప్పల్లాగే వెళ్లొచ్చు. ఎవరి కప్పల్ని వారే తెచ్చుకోవాలి. ఒకవేళ అక్కడికి వెళ్లాక పాల్గొనాలని అనిపిస్తే కప్పలను అద్దెకి కూడా ఇస్తారు. గెలిచిన కప్పను విజేతగా గుర్తించి ఓ కప్పు అందజేస్తారు.



## గాడిదల రేసింగ్

గుర్రం పందాల గురించి మనందరికీ తెలిసిందే. కానీ గాడిదల పందాల గురించి ఎప్పుడైనా విన్నారా? ఈ డాంకీ రేసింగ్ ప్రతి సంవత్సరం జమైకాలో జరుగుతుంది. ఈ రేసింగ్‌లో గాడిదలపై కూర్చొని సవారీ చేయాలి. 1994 సంవత్సరం నుంచి ఈ గాడిదల పరుగు పోటీలు నిర్వహిస్తున్నారు. నిర్ణీత సమయంలో ఏ గాడిద గమ్యాన్ని చేరుకుంటుందో అదే గెలిచినట్లు. ప్రస్తుతం అక్కడే కాకుండా ప్రపంచంలో పలు చోట్ల కూడా వినోదం కోసం ఈ పందాలను నిర్వహిస్తున్నారు.



## బాతుల పోటీలు

బాతుల పోటీలను ముఖ్యంగా సహాయ కార్యక్రమాల నిర్వహణకు అవసరమైన నిధులు సేకరించడానికి నిర్వహిస్తారు. ఈ బాతుల పోటీలను ఎక్కువగా అమెరికాలో జరుపుతారు. ఈ పోటీలను రాను రాను ప్రపంచవ్యాప్తంగా నిర్వహిస్తున్నారు. కొన్ని చోట్ల నిజమైన బాతులనే ఈ పోటీల్లోకి దింపితే మరికొన్ని చోట్ల రబ్బరు బాతు బొమ్మలను పోటీకి దింపుతారు. ఎక్కువగా రబ్బరు బాతు బొమ్మలతో జరిగే పోటీయే ప్రాచుర్యంలో ఉంది. రబ్బరు బాతు బొమ్మలతో జరిగే ఈ పోటీ 1994లో ప్రారంభమైంది. ఈ పోటీలో ముందుగా రబ్బరు బాతు బొమ్మలకు నెంబర్లు ఇచ్చి వాటన్నింటినీ ఒక వాటర్ గేట్‌వే వైపు తోసేస్తారు. అలా ప్రవాహంలో అవి ఈదుకుంటూ ఏది ముందుగా గమ్యస్థానం చేరితే ఆ నెంబర్ గల బాతుబొమ్మ గెలిచినట్టు ప్రకటిస్తారు.

## బొద్దింకల పోటీలు

బొద్దింకల్ని చూస్తేనే చాలు చాలా మంది అసహ్యించుకుంటారు. మరికొందరేమో భయపడిపోతుంటారు. కానీ అక్కడి వాళ్లు బొద్దింకల మధ్య పోటీలు పెట్టుకుని వినోదాన్ని ఆస్వాదిస్తున్నారు. ఆస్ట్రేలియాలో ఈ బొద్దింకల పోటీలు జరుగుతాయి. పోటీలో పాల్గొనే బొద్దింకలను ఎవరికి వారే తెచ్చుకోవాలి. అన్ని బొద్దింకలను ఒక నియమితమైన ప్రదేశంలో పెట్టి వాటి మధ్య రేసింగ్‌ను జరుపుతారు. నిర్ణీతమైన తుది లక్ష్యాన్ని ఏ బొద్దింక చేరుకుంటే ఆ బొద్దింక గెలిచినట్లు. ఆ బొద్దింకను తీసుకువచ్చిన వ్యక్తులు అది గమ్యాన్ని చేరేంత వరకు నానా పాట్లు పడుతూ దానికి దారి చూపిస్తారు. అది దారి తప్పి గీత దాటినట్లయితే పోటీ నుంచి నిష్క్రమించినట్లే. ఈ పోటీలను మొదటి సారిగా 1982వ సంవత్సరంలో ఓ క్లబ్‌లో ఇద్దరు వ్యక్తులు వినోదం కోసం ప్రారంభం చేశారు. అప్పటి నుంచి క్రమక్రమంగా కేవలం వినోదం కోసమే కాకుండా డబ్బుల కోసం కూడా ఈ పోటీలు జరుపుతున్నారు. ఈ పందాలు ప్రతి సంవత్సరం జనవరి 26న జరుగుతాయి. ఆ రోజు ఆస్ట్రేలియా డే. అందుకే ఈ పోటీలను ఆస్ట్రేలియా డే కాక్రోచ్ రేసెస్ అని కూడా పిలుస్తారు. ఈ పోటీలలో వచ్చిన డబ్బును చారిటీకి అందజేస్తారు.



## నగ్నంగా సైకిల్ తొక్కే పోటీలు

సైకిల్ పోటీల గురించి మనందరికీ తెలిసిందే. కానీ నగ్నంగా సైకిల్ తొక్కే పోటీల గురించి మీరెప్పుడైనా విన్నారా! అలాంటి పోటీలు కూడా ఉంటాయా అనుకుంటున్నారా? ఉన్నాయండీ! వాహనాల నుంచి సైకిలిస్టులకు ఎదురయ్యే ప్రమాదాలను చాటి చెప్పాలన్నది ఈ పోటీల ముఖ్య ఉద్దేశ్యం. పోటీ దారులందరూ బట్టలు లేకుండా సైకిల్ తొక్కవచ్చు. కానీ రూల్స్ మాత్రం మాత్రం పాటించాల్సిందే. 16 ఏళ్ల కన్నా చిన్న వయసుగల వారు ఇంట్లో పెద్ద వారితో కలిసి పోటీలో పాల్గొనాలి. ఒళ్లంతా దుస్తులు లేకుండా ముఖం కప్పేసుకుంటామంటే కుదరదు. అక్కడ ఎలాంటి ఫేస్ మాస్కులు ధరించరాదు. మూడు మైళ్ల దూరం సాగే ఈ వింత పోటీలు చూడడానికి జనం విరగబడతారట. ఈ నగ్న సైకిల్ పోటీలలో పురుషులు మాత్రమే కాదు స్త్రీలు కూడా పాల్గొంటారట. అన్నట్టు ఈ పోటీలకు పోలీసు ప్రొటెక్షన్ కూడా ఉంటుంది.

## హెడ్‌బాల్ ప్రపంచకప్పు

దేశదేశాల గిరిజనులంతా ఒక్కచోట చేరితే.. వారంతా వింత విన్యాసాలతో, విభిన్న రకాలైన అలంకరణ దుస్తులతో అంతర్జాతీయంగా జరిగే పోటీల్లో పాల్గొంటే చూడడానికే చాలా వింతగా ఉంటుంది కదా! అలాంటి పోటీలు బ్రెజిల్‌లో జరుగుతాయి. పల్మాస్ నగరంలో జరిగే ఈ గిరిజన పోటీల పేరు వరల్డ్ గేమ్స్ ఫర్ ఇండిజీనియస్ పీపుల్. ఈ పోటీల్లో పాల్గొనే వారంతా గిరిజనులే. ప్రతి సంవత్సరం జరిగే ఈ పోటీల్లో దాదాపు నాలుగు వేల మంది గిరిజన ప్రజలు పాల్గొంటారు. ఫుట్‌బాల్ అంటే కాలితో ఆడడం మాత్రమే తెలుసు కానీ మీకు హెడ్‌బాల్ ప్రపంచ కప్పు గురించి తెలుసా? హెడ్‌బాల్ అంటే తలతో బంతిని కొట్టాలి. ఇలాంటి ఆటలకి ఇక్కడ ప్రత్యేకత ఉంటుంది. ఇక్కడ పోటీల్లో మనకు తెలిసినవే కాదు గిరిజనులు స్థానికంగా ఆడే వింత ఆటలు ఉంటాయి. బాణాలను నోట్లో గుచ్చుకోవడం, తాడు లాగే ఆట, పక్షుల ఈకలతో ముస్తాబయ్యే యువతుల అందాల పోటీలు ఇలా ఆకట్టుకునే ఎన్నో క్రీడలు జరుగుతాయి. ఈ పోటీలన్నీ కూడా దేశదేశాల కొండ జాతి ప్రజలు తమ ఆచారాలను, సంప్రదాయాలను ప్రపంచానికి చాటి చెప్పడానికే జరుపుకుంటున్నారు.





## సర్కిల్ తాబేలు

అమెరికాలోని చికాగోలో తాబేలు పోటీలు మొదటిసారి 1902లో ప్రారంభమయ్యాయి. ముఖ్యంగా చిన్నపిల్లల ఈవెంట్స్‌లో ఈ పోటీలు జరుగుతాయి. ఈ పోటీల్లో పాల్గొనాలంటే ఎవరి తాబేలును వారే తెచ్చుకోవాలి. ఒక పెద్ద సర్కిల్‌లో వాళ్ల వాళ్ల తాబేళ్లను వదిలిపెట్టాలి. ఆ సర్కిల్ లోపలే ఉంటూ ఆ వృత్తాన్ని తాబేలు దాటకుండా చూసుకోవాలి. ఏది ఎక్కువ సమయం వృత్తం దాటకుండా ఉంటుందో అదే గెలిచినట్లు. వృత్తం దాటిన తాబేలు ఔట్ అయినట్లు అంటే ఓడిపోయినట్టు ప్రకటిస్తారు.



## వరాహాల పోటీలు

వరాహాన్ని చూస్తే చాలు చాలామందికి అసహ్యం. వాటిని ముట్టుకోవడం కూడా ఎవరికీ నచ్చదు. మన దేశంలో ఈ పందుల పెంపకం వ్యాపార జీవనోపాధి దృక్పథంతో సాగుతుంది. కానీ కొన్ని దేశాల్లో వరాహాల్ని ముద్దుగా పెంచుకుంటారు. వాటికి పోటీలు కూడా నిర్వహిస్తారు. ఈ పందుల పోటీలు అనేవి అమెరికా సంయుక్త రాష్ట్రాలలో జరుగుతాయి. అందులోనూ నార్త్ కరోలినాలో ఈ పోటీలు ఎక్కువగా జరుగుతాయి. ప్రతి సంవత్సరం ఎండాకాలంలో ఈ పోటీలు జరుపుకుంటారు. ఇవి 1992 నుంచి ప్రారంభమయ్యాయి. ఈ పందుల పోటీల కోసం ప్రత్యేకంగా గడ్డితో మార్గాన్ని ఏర్పాటు చేస్తారు. మొదట్లో కేవలం పందులను పరిగెత్తించేవారు కానీ ఇప్పుడు ఈ రేసింగ్ రూపురేఖలు మారిపోయాయి. కేవలం పందులను పరిగెత్తించడమే కాదు వాటితో హైజంప్, లాంగ్ జంప్ లాంటి విన్యాసాలను కూడా ఈ రేసింగ్‌లో చేయిస్తున్నారు. దీనికోసం పందులను పెంచుకునేవారు వాటికి శిక్షణ కూడా ఇస్తున్నారట.

## రెగెట్టా పోటీలు



నదులు, సరస్సులు కనీసం చెరువులు ఉన్న ప్రాంతాల్లో బోట్ రేస్‌లు జరుగుతాయి. అవేవీ కనిపించని ప్రాంతాల్లో బోట్ రేస్‌లు జరపాలంటే ఎలా జరుపుతాం అనుకుంటున్నారా? అయితే ఆస్ట్రేలియా వెళ్లి చూడండి మీకే తెలుస్తుంది. అక్కడి వారు "హెన్ ఆన్ టాడ్ రెగెట్టా" పేరుతో నాలుగు దశాబ్దాలుగా బోట్ రేస్ నిర్వహిస్తున్నారు. నీళ్ల లేకపోయినా బోట్ మోసుకుంటూ, నీళ్లలో ఉన్నామని భావించుకుంటూ పరుగులు తీయడమే ఈ రేస్ ప్రత్యేకత. ఒక్కో జట్టులో పది మంది సభ్యులు ఉండే ఈ బోట్ రేసింగ్‌లో ఎవరు ముందు గమ్యస్థానం చేరితే వారికే ప్రైజు.

## ఎత్తు చెప్పుల పోటీలు

ఎత్తు చెప్పులు వేసుకుని కొద్ది దూరం నడవడమే కష్టం. ఎందుకంటే మడమలు, పాదాలు నొప్పులు పుట్టేస్తాయి. పైగా వీటిని వాడడం వల్ల కాళ్లకి సంబంధించిన సమస్యలు కూడా వస్తాయి. అలాంటి ఎత్తు మడమ చెప్పులు వేసుకుని పరుగు పందాల్లో పాల్గొంటే! కిందపడితే ఏమైనా ఉందా కాలు విరగాల్సిందే! కానీ ఇలాంటి ప్రమాదకరమైన పోటీలను కూడా కొన్ని చోట్ల ఎంజాయ్ చేస్తారు. ఈ రకం పందాలు ఎక్కువగా వాషింగ్టన్ లాంటి ప్రాంతాలలో జరుగుతుంటాయి. ప్రతి సంవత్సరం నిర్వహించుకునే ఈ పోటీల్లో ఏ యేడాదికా యేడాది హీల్ ఎత్తు ఎంతుండాలన్నది టీమ్ నిర్ణయిస్తుంది. ఈ పోటీ ద్వారా వచ్చిన డబ్బుని వివిధ రకాల సేవా కార్యక్రమాలకు వినియోగిస్తుంటారు.

- సంతోషి దహగాం






**'సమంత 2012 @ జీమెయిల్ డాట్‌కామ్'**

**తన అభిప్రాయాలను ఈ-మెయిల్ చేసి రిప్లయ్ కోసం ఎదురు చూస్తున్నాడు శ్రీకర్.**

**వారం రోజులు దాటింది. సమంత నుండి రిప్లయ్ రాలేదు.**

**ఇక లాభం లేదనుకుని...ఎదురు పడి "నాకు మీరు సమాధానం పంపలేదు" ఎలాంటి ఉపోద్ఘాతం లేకుండా అడిగాడు.**

**ఆమెనవ్వి "ఆలోచిస్తున్నా..." చెప్పింది.**

**మరో వారం గడిచింది.**

**"మీ నుండి రిప్లయ్ రాలేదు" మళ్ళీ అడిగాడు.**

**"ఏం చెప్పాలో అర్థం కాక ఇవ్వలేదు" చెప్పింది ముక్తసరిగా సమంత.**

**"పర్వాలేదు, మీరెలాంటి రిప్లయ్ ఇచ్చినా నేను డైజెస్ట్ చేసుకుంటాను" చెప్పాడు శ్రీకర్.**

మళ్ళీ సమాధానంలేని నవ్వొకటి నవ్వింది.

ఆ నవ్వుకే శ్రీకర్ 'ఫ్లాట్' అయ్యాడు. ఆ నవ్వు ముగ్ధమనోహరంగా ఉంటుంది.

నందివర్ధనం పువ్వు అందంగా విచ్చుకున్నట్టు ఉంటుంది.

మరో వారం గడిచింది.

పరిస్థితిలో పెద్ద తేడా లేదు.

శ్రీకర్‌కి ఇన్ఫోసిస్‌లో ఇప్పుడున్న జాబ్ కంటే మంచి ఆఫర్ వచ్చింది.

శాలరీ దాదాపు రెట్టింపు.

మళ్ళీ ఆ డిటైల్స్‌తో ఈ-మెయిల్ పెట్టాడు.

లంచ్ టైంలో కన్పించి 'బెస్టాఫ్ లక్' చెప్పింది. శ్రీకర్ మనసు గాయపడింది.

"నాకు పొజిషన్ ముఖ్యం కాదు. మీతో జీవితమే ముఖ్యం" సిన్సియర్‌గా చెప్పాడు.

ఆమె తేరిపార చూసి "నేనెక్కడికి వెళ్తాను... ఉంటాను కదా" అంది.

"ఉంటారు. కానీ ఆ కంపెనీలో కాదు. నా కళ్ళ ముందు అంతకంటే కాదు" అన్నాడు చిరుకోపంగా.

ఆమె తనకొస్తున్న నవ్వు తొక్కిపట్టి, "మీకు పొజిషన్ కంటే మీ లవ్వే ముఖ్యమా" అంది సీరియస్‌గా.

"మీరెలా అన్వయించుకున్నా నేనేం ఫీల్ కాను. కానీ మీరే ముఖ్యం నాకు" అన్నాడు చిరుకోపంగా.

"మీ మాటల్లో మెచ్యూరిటీ లేదు" అంది నిష్కర్షగా.

అతడి సమాధానం ఆశించకుండా తన క్యాబిన్‌లోకి వెళ్ళిపోయింది.

తన సిస్టమ్ ముందు కూర్చుని అకౌంట్స్ చేస్తోందే కానీ ఆమె మనసు మనసులో లేదు. శ్రీకర్ ముఖమే గుర్తుకొస్తోంది పదే పదే.

"ఫూల్" అనుకుంది కోపంగా.

పక్కనిమిషం అతడు పంపిన ఈ-మెయిల్ కోసం మౌస్ మరోసారి బ్రౌజ్ చేసింది. అది ఓపెన్ అయింది.

శ్రీకర్ తన ఫీలింగ్స్‌ని ఎలాంటి ఇన్‌హిబిషన్స్ లేకుండా స్పష్టంగా చెప్పాడు.

**కొత్త సీరియల్ ప్రారంభం**

కవిత్వం పాళ్ళు కాస్త ఎక్కువగానే ఉన్నాయి.

"సమంత గారూ,

ఎవరు లేకుండా బ్రతకలేం అనిపిస్తుందో...ఆ వ్యక్తి మీరే అనిపిస్తుంది. రీజనింగ్స్ వగైరా నాకు తెలీదు. మీరు నచ్చారు. వర్క్‌లో మీ సిన్సియారిటీ నచ్చింది.

మీ నవ్వు నచ్చింది. మీ వ్యక్తిత్వం నచ్చింది. అన్నింటితో పాటు సగం జీతం మీరు చారిటీకి ఇవ్వడం ఇంకా నచ్చింది. నాకు శ్రీశ్రీ, కృష్ణశాస్త్రి ఇద్దరూ తెలుసు. అంటే ఫిజికల్‌గా కాదు, కవిత్వపరంగా.

ఇద్దరూ ఉత్తర దక్షిణ ధ్రువాలు. ఒకరిది భావుకత్వం అయితే మరొకరిది అభ్యుదయ వాదం.

ఇద్దరి అభిప్రాయాలు ఒక దగ్గరకు చేరవు. కానీ ఇద్దరూ గొప్ప సాహిత్యకారులే.

మీరు వారిద్దరూ ఐక్యమైన తిలక్ పొయిట్రీ వంటి వారు. మిమ్మల్ని ఆస్వాదించాలని ఉంది. ఐ మీన్ మీ స్నేహాన్ని.

ఒక నిమిషం ఆగింది.

"గురుడికి పైత్యం ఎక్కువే" అనుకుంది.

మళ్ళీ ఉత్తరంలో తల దూర్చింది.

"నాకు బాధ్యతలు పెద్దగా లేవు. జీతం మొత్తం మీ దోసిళ్ళలోనే పోస్తాను. నాకు మూడు పూటలు భోజనం పెడితే చాలు. కారు ఫైనాన్స్ తీరిపోయింది. డీజిల్‌కి, కారు మెయింటెనెన్స్‌కి ఇస్తే చాలు. మిమ్మల్ని పల్లెత్తు మాట అనను. ఆంక్షలు విధించను" మళ్ళీ ఆగింది.

"ఆడదాని మనసుకు గాలం వేయడానికి మగాళ్ళు సిగ్గు లేకుండా అబద్ధాలు ఆడతారేమో" అనుకుంది.

"మీరెలా చెబితే అలా. నాక్కాస్త నచ్చే రెండు మూడు కూరలు చేసి పెడితే చాలు. మీకిష్టమైన సినిమాలు చూపిస్తాను"

మళ్ళీ ఆగి నవ్వుకుంది.

"చిన్నగా బేరసారాలు మొదలెట్టాడా" అనుకుంది.

దరిదాపు ఉత్తరమంతా అదే విధంగా సాగింది. కాసేపు బ్రతిమాలుకుంటూ, కాసేపు ఆశలు పెడుతూ. రిప్లయ్ ఇద్దామనుకుంది. ఏం ఇవ్వాలో అర్థంగాక వదిలేసింది.

"ఈరోజు శ్రీకర్ డిస్ట్రబ్ చేశాడు" అనుకుంది.

మరో నాలుగురోజుల తర్వాత సమంతకి ఒక సమాచారం అందింది.

శ్రీకర్ ఇన్ఫోసిస్‌లో జాయిన్ కావడం లేదు.

ఆ విషయం తన ప్రాజెక్ట్ హెడ్ కర్కరే స్వయంగా చెప్పాడు ఆమెకు.

"సమంతా, శ్రీకర్ వాల్యుబుల్ ఆపర్చ్యునిటీ పోగొట్టుకున్నాడు. ఆఫీసులో నీ కోసమేనని అనుకుంటున్నారు. నిజమేనా?" అడిగింది సమీర.

సమంత సమాధానం చెప్పలేదు.

"నిజమా..?" అన్నట్టు చూసింది.

"నిజంలాగే ఉంది" అన్నట్టు ముఖం పెట్టింది సమీర.

సమీర, సమంతకు ఫ్లాట్‌మేట్. ఆఫీసులో కొలీగ్.

వీళ్ళిద్దరూ మాట్లాడుకుంటూంటే అప్పుడే అటుగా వచ్చిన కర్కరే "ప్లీజ్ వర్క్ నుండి డీవియేట్ కాకండి" అన్నాడు.

●●●

"మీతో మాట్లాడాలి" మెసేజ్ పెట్టింది సమంత.

ముందు ఆశ్చర్యపోయి, తర్వాత సంతోష పడ్డాడు శ్రీకర్.

"ఎక్కడ కలుద్దాం" అడిగాడు.

"కాఫీ షాప్" అడ్రస్ చెప్పింది.

సాయంత్రం ఆరు తర్వాత ఎవరి వెహికల్స్‌లో వారు విడివిడిగా కాఫీ షాపుకు చేరుకున్నారు.

శ్రీకర్ సాదరంగా ఆహ్వానించాడు.

సమంత కొరకొరా చూస్తూ కూర్చుంది. ఆమె చాలా హాట్‌గా ఉందనిపించింది శ్రీకర్‌కి.

ఎలాంటి ఉపోద్ఘాతాలు లేకుండా నేరుగా సంభాషణలోకి దిగింది ఆమె.

"ఇన్ఫోసిస్‌లో జాయిన్ కావడం లేదా?" అడిగింది.

లేదన్నట్టు తలూపాడు.

"నాకిలాంటి ఆపర్చ్యునిటీ వస్తే క్షణం కూడా ఆలోచించకుండా వెళ్ళిపోతాను" చెప్పింది.

"వై నాట్...అందులో తప్పేం ఉంది? బెటర్ కెరీర్ కదా"

"మరి మీరెందుకు రిజెక్ట్ చేశారు?"

"మిమ్మల్ని చూస్తూ గడపడం కన్నా, కెరీర్ గొప్పది కాదు కదా? అన్పించింది" చెప్పాడు

"మీరు చైల్డిష్‌గా మాట్లాడుతున్నారనిపించడం లేదా?"

"కావచ్చు. చిన్న పిల్లలకు ప్రేమలుండవా?"

చురుగ్గా చూసింది.

విత్ ప్లెజర్ అన్నట్టు చూశాడు.

రెండు నిమిషాల తరువాత "గో టు హెల్" చెప్పి కాఫీ కూడా తాగకుండా బైట పడింది.

శ్రీకర్ కూడా కాఫీ తాగలేదు.

ఇద్దరి బిల్ పే చేసి ఫ్లాట్‌కి చేరుకున్నాడు.

"ఈ మాత్రం దానికి కాఫీ షాప్ ఎందుకు? ఆఫీసులోనే చెప్పవచ్చుగా" అనుకున్నాడు.

●●●

ఫ్లాట్‌కి వెళ్ళేసరికి అతడి బాబాయి ప్రసాద రావు వచ్చి ఉన్నాడు.

"ఎప్పుడొచ్చావు బాబాయ్" అడిగాడు.

"ఇప్పుడే వచ్చానురా. ఎలాగూ నువ్వొస్తావు కదాని ఫోన్ చేయలేదు" చెప్పాడు.

ప్రసాదరావు వెటర్నరీ డిపార్ట్‌మెంట్ యూనియన్ లీడర్. తరచూ హైదరాబాద్ వస్తుంటాడు.

వస్తే ఒకటి రెండురోజులు ఉండిపోతుంటాడు. తన గదిలో ఉండే కొలీగ్ రమణ కోసం కీస్ వాచ్ మెన్‌కి ఇచ్చి వెళ్తుంటాడు శ్రీకర్. రమణ యాడ్ ఏజెన్సీలో క్రియేటివ్ హెడ్.

ఒకవేళ బాబాయ్ ఎప్పుడైనా వస్తే తాళం ఇవ్వమని చెప్పి వెళ్ళడం వల్ల వాచ్‌మెన్ దగ్గర తాళం తీసుకొని, టీవీ చూస్తూ కాలక్షేపం చేస్తున్నాడు ప్రసాదరావు.

న్యూస్ చానల్ తిప్పుతూ, "అరేయ్ అబ్బాయ్, నువ్వెవరో అమ్మాయిని లవ్ చేస్తున్నావట కదా? ఏ ప్రాంతం అమ్మాయి?" అని ప్రశ్నించాడు శ్రీకర్‌ని.

"అవును నిజమే, సమంతది ఏ ఏరియా?" మనసులో అనుకున్నాడు.

కొంత ఉత్సుకత తొంగి చూసింది. దాన్ని కప్పెడుతూ, "ప్రేమకు ఎల్లలూ, హద్దులూ, సరిహద్దులూ, కులాలూ, గోత్రాలూ ఉంటాయా బాబాయ్" అడిగాడు శ్రీకర్.

"అరేయ్ కులాలు అంటే గుర్తుకొచ్చింది వర్ణ సంకరం కాకుండా చూసుకో. మీ నాన్నకు పట్టింపు ఎక్కువ కదా?" అన్నాడు ప్రసాదరావు.

"చాదస్తం" అనుకుంటూ వంటగదిలో దూరి కాఫీ కలిపి బాబాయ్‌కి ఇచ్చాడు.



"కాఫీ బాగా పెట్టావురా" అంటూ, "ఎంత కాలం ఇలా చేతులూ, కాళ్ళూ కాల్చుకుంటావురా" అన్నాడు కాస్త నొచ్చుకుంటూ.

"అదేం లేదు బాబాయ్. వాచ్‌మెన్ పక్కనున్న మెస్ నుండి భోజనం తెస్తాడు. పనమ్మాయి వచ్చి గిన్నెలు వాష్ చేసి వెళ్తుంది. నేనూ రమణ మెస్ మీల్స్ బోర్ కొడితే బయట మరో హోటల్‌కెళతాం" చెప్పాడు.

వాళ్ళు మాట్లాడుకుంటుండగానే రమణ వచ్చాడు.

"అంకుల్ ఎలా ఉన్నారు?" అడిగాడు.

"బావున్నాను అబ్బాయ్. ఏంటి విశేషాలు" అడిగాడు ప్రసాదరావు.

"ఏం ఉంది అంకుల్? ట్రాఫిక్ జాంలో చిక్కుకుని ఇప్పటికి బయటపడ్డాను" అన్నాడు నవ్వుతూ రమణ.

"అవును పద్మవ్యూహంలో చిక్కుకున్నా రాగలం కానీ హైదరాబాద్ ట్రాఫిక్‌లో చిక్కుకుంటే ఎప్పుడు ఇంటికి చేరుకుంటామో మనకే తెలీదు. వర్షం పడితే ఇక దైవాధీనం" అన్నాడు ప్రసాదరావు.

"నిజమే బాబాయ్" అంటూ కప్పులో కాఫీ పోసుకుని వచ్చి రమణకిచ్చాడు శ్రీకర్.

శ్రీకర్ చేతిలోంచి కప్పు తీసుకుంటూ "బాబాయ్‌కి ఏం పెడుతున్నావురా..." అడిగాడు

"రొటీనే కదా...మెస్‌కి ఫోన్ చేసి చికెన్ ఫ్రై పంపమని చెప్పు...." చెప్పాడు శ్రీకర్.

"ఈ రోజు సోమవారం కదరా, నాన్ వెజ్ తినను" చెప్పాడు ప్రసాదరావు.

"మనోడికి అలాంటి వారాలూ, వర్జ్యాలూ లేవులే అంకుల్" చెప్పాడు రమణ.

నవ్వాడు శ్రీకర్. మళ్ళీ అతడి ఆలోచనలు సమంత వైపు తిరిగాయ్.

"సమంతకు వంటొచ్చా..." దీర్ఘాలోచనలో పడ్డాడు.

సరిగ్గా అదే సమయంలో సమంత తన ఫ్లాట్‌లో సమీరతో మాట్లాడుతోంది.

"అతడికి వేపకాయంత వెర్రి ఉందో లేదో కానీ, నీకు అతనిపైన గుమ్మడికాయంత ప్రేమ ఉందే" అంది సమీర.

"ప్రేమా?..." విస్తుపోతూ "నీకేమైనా మెదడు చెడిందా?" అంది సమంత.

"మరి ఈ ఆలోచనలన్నీ ఎందుకే? బెటర్ ఆపర్చ్యునిటీ వదులుకుంటే నీకేంటి?"

"జస్ట్ ఫర్ సింపతీ..." అంది చాలా మామూలుగా.

"ఈ సింపతే అన్నిటికీ పునాది" అంది అల్లరిగా సమీర.

"ఎనాలిసిస్ చాలు కానీ, మంచి కాఫీ పట్రా. అతడి తింగరి మాటలకు కోపమొచ్చి కాఫీ తాగకుండా బైటపడ్డాను.." అంది.

"ఎన్ని రోజులు నా చేత వంట చేయించుకుని తింటావ్. ఎంచక్కా అతడ్ని పెళ్ళాడితే నీ ప్రేమ ప్రవాహం కోసం వంట కూడా చేసి పెడతాడు

**సమంత, శ్రీకర్ సాఫ్ట్‌వేర్ ఉద్యోగులు. పెళ్ళి చేసుకోమని ఆమె వెంట పడుతున్నాడతను. ప్రాజెక్ట్ మేనేజర్‌గా వేరే కంపెనీలో మంచి అవకాశాన్ని కూడా ఆమె కోసం వదిలేసుకున్నాడతడు. ఈ విషయం ఆనోటా ఈనోటా పడి సమంత వరకూ వచ్చింది. వెంటనే అతణ్ణి కాఫీ షాప్‌కి రమ్మని మెసేజ్ పెట్టింది. మరి అతడికామె ఐ లవ్ యూ చెప్పిందా?**

కదా..." అంది సమీర.

"సలహాలు అక్కర్లేదు..?" అంది కోపంగా.

"దీనికి మాత్రం కొరతలేదే. ఆర్డర్లు బాగా వేస్తావ్. రేపు నీవాడైతే అతడి పరిస్థితి తలుచుకుంటే జాలి కలుగుతోంది..." అంది మరీ అల్లరిగా.

"ఎందుకో ఆయన గారి మీద తమరికంత సానుభూతి..." అంది తనూ నవ్వుతూ సమంత.

"వాడు మా అన్నయ్యే కదే"

"అప్పుడే వరసలు కూడా కలిపేసుకున్నారా" అంది లోలోపల నవ్వుకుంటూ సమంత.

●●●

"కలుసుకుందాం" ఎసెమ్మెస్ ఇచ్చింది సమంత.

"ఎక్కడ?" ఎసెమ్మెస్ ద్వారా అడిగాడు శ్రీకర్.

"నెక్లెస్ రోడ్, ఈవెనింగ్ సిక్స్ ఓ క్లాక్" మెసేజ్ ఇచ్చింది.

శ్రీకర్‌కి గుండె దడ మొదలైంది. ఏ నిర్ణయంతో వస్తోందో, ఏం పోట్లాడుతుందో అన్న కంగారు మొదలైంది. కారు నెక్లెస్ రోడ్డు పార్కింగ్ స్థలంలో ఆపాడు. అతడొచ్చిన ఐదు నిమిషాలకు సమంత కూడా వచ్చింది. ఆమె స్కూటీ కూడా అతడి కారు పక్కనే ఆపింది. మంచి పచ్చిక బయలు చూసి కూర్చున్నాడు. ఆమె కూర్చోవడానికి వీలుగా తనతో పాటు తెచ్చిన టర్కీ టవల్ వేశాడు.

ఆమెని చూసి చెయ్యెత్తి ఆహ్వానించాడు. "రండి" పిలిచాడు.

సమంత పెదాలు నవ్వీ నవ్వనట్టు ఉన్నాయ్.

"పర్వాలేదు. కాస్త కూల్‌గానే ఉన్నట్టుంది" అనుకున్నాడు.

ఈసారి నేరుగా విషయంలోకి రాకుండా పచ్చిక బయళ్ళపై ఆడుకుంటున్న పిల్లల్ని ఆసక్తిగా గమనిస్తోంది.

"బాల్యం చాలా మధురమైంది" అంది తన్మయత్వంగా.

"యవ్వనం ఇంకా మధురమైంది" అనాలనుకున్నాడు గానీ అంటే తననెలా ఝాడిస్తుందోనని మిన్నకున్నాడు.

అతడి వైపు నుండి రెస్పాన్సు రాకపోవడంతో అతడి ముఖంలోకి చూసింది.

ఆమె సమాధానం ఆశిస్తుందని అర్థమై "అవునవును" అన్నాడు.

"ఏమిటి అవునవును" అడిగింది.

"అదే బాల్యం గురించి అడిగారు కదా" చెప్పాడు.

"యవ్వనం ఇంకా మధురమైంది కదా" అంది లోపల నవ్వుకుంటూ.

ఖంగుతిన్నాడు. అడ్వాంటేజి తీసుకోలేకపోయానే అనుకున్నాడు.

"చెప్పాలనుకున్నాను కానీ మీరేమనుకుంటారోనని ఆగాను" చెప్పాడు.

"ఈ మాట మీరు ఈ-మెయిల్ ఇవ్వక ముందు కూడా అనుకొని ఉండవచ్చు కదా..." అంది.

ఇక 'పిండుతుంది'రా అనుకున్నాడు.

"అది...అది...నా ఫీలింగ్..." గొణుగుతున్నట్టు చెప్పాడు.

"మీ ఫీలింగ్స్ ఎదుటి వారిని హర్ట్ చేస్తాయని తెలీదా?"

"మరో మార్గంలేక" గొణిగాడు.

"ఏం...టీనేజీలో ఉన్నారా?" విసురుగా అంది.

"అది కాదండీ..." ఏదో చెప్పబోయాడు.

"మీ ఏజ్ ఎంత?" అడిగింది.

"ట్వంటీ ఫైవ్ ప్లస్"

"నాక్కూడా దరిదాపు అదే ఏజ్ ఉంది. మనం కాలేజీ పిల్లలం కాదు. ఇద్దరికీ పెళ్ళీడు వచ్చింది. మనం రాసుకోవల్సింది ప్రేమలేఖలు కాదు శుభలేఖలు. మీకు నా మీద ఏదైనా ఫీలింగ్ కలిగితే చెప్పాల్సింది నాకు కాదు మా పేరెంట్స్‌కి. డోంట్ బి చైల్డిష్" చివాట్లేసింది.

చివాట్లు పడ్డా క్లూ ఇచ్చిందని సంబరపడ్డాడు శ్రీకర్.

"ఇప్పటికైనా మించిపోయింది ఏమీ లేదు. మీ పేరెంట్స్‌ని కలిసి నా ప్రపోజల్ చెబుతాను"



అన్నాడు ఉత్సాహంగా.

"కానీ నాకు ఇష్టం లేదు" అంది

మళ్ళీ ఖంగుతిన్నాడు.

"నాకు వివాహ వ్యవస్థపైన నమ్మకం లేదు. అందుకే మా పేరెంట్స్‌ని కలవడం అవసరం లేదంటున్నాను" చెప్పింది.

కన్ఫ్యూజ్ అయ్యాడు శ్రీకర్. అతడి బ్లాంక్ ఫేస్ చూసి, అతడికి అర్థం కాలేదన్న విషయం అర్థమై "మీరు సహజంగా ఏం చేయాలో చెప్పాను. ఇలా చేయమని చెప్పలేదు" అంది.

అంతా గందరగోళమనిపించి దాన్నించి బయట పడటానికి అక్కడికి దగ్గర్లో ముంత కింద పప్పు అమ్ముతున్న కుర్రాడ్ని పిలిచి రెండు ప్యాకెట్స్ తీసుకున్నాడు.

"బావుంటాయ్" చెప్పాడు.

"అది మీ అభిప్రాయం. మీ అభిప్రాయాల్ని అందరిపైన రుద్దకండి. ఆ రెండు ప్యాకెట్స్ మీరే తినండి. నాకు ఐస్‌క్రీం కావాలి..." చెప్పింది.

"ఓ ష్యూర్" అంటూ పరిగెత్తుకెళ్ళి రెండు ఐస్‌క్రీంలు తెచ్చాడు.

ముంతపప్పు ఆ కుర్రాడికే ఇచ్చి డబ్బులు కూడా ఇచ్చాడు.

సమంత వెళుతున్న ముంతకిందపప్పు కుర్రాడ్ని పిలిచి, "అదిగో దూరంగా ఆడుకుంటున్న ఆ చిరుగుల చొక్కా కుర్రాళ్ళకు ఇవ్వు..ఆ రెండు ప్యాకెట్స్" చెప్పింది.

ఒక నిమిషం వాడు అయోమయంగా చూశాడు.

శ్రీకర్ అభినందనగా చూశాడు.

"మీకు ముంత కింద పప్పు ఇష్టం కదా? నా కోసం మీరు కూడా ఐస్‌క్రీం తీసుకున్నారా?" అడిగింది.

"నాకు రెండూ ఇష్టమే. క్లైమేట్ కూల్‌గా ఉంది కదా, అందుకే మీరు ఐస్‌క్రీం తీసుకోరని అను కున్నాను." చెప్పాడు.

"మిమ్మల్ని పెళ్ళి చేసుకోబోయే అమ్మాయి రోజూ మీరు అబద్ధాలు చెబుతుంటే వింటూ కాలం గడ పాలి కాబోలు.." అంది.

శ్రీకర్ గుండె వేగం పెరిగింది.

అంటే తను...తనని యాక్సెప్ట్ చేయడం లేదా? వివాహ వ్యవస్థపైన నమ్మకం లేదని రిజెక్ట్ చేస్తుందా? అతడికి పిచ్చి పట్టినట్టుగా ఉంది. అతడి ముఖంలో ఫీలింగ్స్‌ని గమనించింది సమంత.

"మిమ్మల్ని డిజప్పాయింట్ చేయడం నా ఉద్దేశం కాదు. నేనేమిటో, నా ఫీలింగ్స్ ఏమిటో, నా అభిప్రాయాలేమిటో మీకు చెప్పాను. మీతో జీవితం పంచుకుంటానని చెప్పలేను కానీ మీతో స్నేహం చేయగలనని మాత్రం చెప్పగలను" అంది కనికరం చూపుతున్నట్టుగా.

సగం బాధ, సగం ఆనందం ముప్పిరిగొన్న ఫీలింగ్.

మళ్ళీ అతడికి మరో షాక్ ఇస్తూ... "అందుకు ఒక కండీషన్"

ఏమిటన్నట్టు చూశాడు. అతడి ముఖంలో టెన్షన్.

"మీరు ఇన్ఫోసిస్‌లో జాయిన్ కండి" చెప్పింది.

అతడి ముఖం మాడిపోయింది.

"నేను...నేను మిమ్మల్ని చూడకుండా ఉండలేకే ఆ ఆపర్చ్యునిటీ వద్దనుకున్నాను" గొణిగాడు.

"మిమ్మల్ని ఫ్రెండ్‌గా యాక్సెప్ట్ చేశానంటే మీ ఉన్నతిని కూడా కాంక్షించాలి కదా?" అంది.

"నాకిష్టం లేదు" అన్నాడు.

"మీరు ఆ బాల్యావస్థ నుండి బయట పడండి. ఇన్ఫోసిస్‌లో ప్రాజెక్ట్ మేనేజర్‌గా సెలక్ట్ కావడ మంటే చిన్న విషయం కాదు. అది వర్క్‌లో మీ ట్రాక్ రికార్డు వల్లే సాధ్యమయింది. మంచి కెరీర్‌ని నాశనం చేసుకోకండి" హితబోధ చేసింది.

"సారీ...అది నా వల్ల కాదు" చెప్పాడు.

"మీ ప్రాబ్లమ్ ఏంటి, నన్ను చూడాలి అంతే కదా? వారానికి ఒకసారి కలుద్దాం. మీకు నచ్చిన ప్లేస్ చెప్పండి. నేను వస్తాను. లేదంటే నన్ను చూడాలనిపిస్తే ఎపుడైనా రావచ్చు. ఆఫీసయినా, ఫ్లాటయినా ఓకే.." చెప్పింది. అయినా అతడు చిన్న పిల్లాడిలా మొండికేశాడు.

"నే వెళ్ళను" దాదాపు స్థిరంగా చెప్పాడు.

"అయితే నేనే వెళ్ళిపోతాను. నాకు కంప్యాక్‌లో ఆఫర్ ఉంది" చెప్పింది.

మరోసారి షాకయ్యాడు శ్రీకర్. బెట్టు చేస్తే అసలుకే బెడిసికొట్టేలా ఉందనుకున్నాడు. అయి ష్టంగానే ఓకే చెప్పాడు.

"మరి నా మ్యారేజ్ ప్రపోజల్..." బయలుదేరే ముందు అడిగాడు.

"చెప్పా కదా...ఆ సిస్టమ్ మీద నాకు నమ్మకం లేదు. కనీసం నా ఫ్రెండ్‌షిప్‌నైనా నిలుపుకోండి" అంది.

శ్రీకర్‌కి మాట్లాడే అవకాశం కలగలేదు.

●●●

సమంతకిచ్చిన మాట మేరకు ఇన్ఫోసిస్‌కి షిఫ్ట్ అయ్యాడు శ్రీకర్.

ఆ రాత్రి టీవీలో వస్తున్న ప్రోగ్రామ్ చూస్తూ సమీర అడిగింది. "అతణ్ణి ఎందుకు పంపించావ్."

"మీ అన్నయ్యనా?"

"ఇంకా చేయలేదు కదా నువ్వు..."

"అంటే నేను అతణ్ణి పెళ్ళాడితే నీకు అన్నయ్య... లేకపోతే బావా?" అంది.

"నీ లాజిక్కులు తగలబడ. చెప్పవే..." అంది సమీర.

"ఒకటి అతడి కెరీర్. రెండు అతడి చూపులు" చెప్పింది సమంత.

"అతడిపై నీకు ఏ ఫీలింగ్ లేనప్పుడు అతడి కెరీర్ గురించి నీకెందుకే? రెండు...అతడు అలా చూస్తున్నట్టు నీకెలా తెలుసు..." నిలదీసింది సమీర.

"మనం మనుషులం కదా? సాటివారి ఉన్నతిని కోరుకోవడం మన ధర్మం. రెండు అటువంటి చూపులు గుచ్చుకుంటే నీకూ తెలిసి వస్తుంది అదెంత బాధాకరమో" చెప్పింది సమంత.

## సన్నీ అందాలు బోర్‌కొట్టాయా?

నిజమే అంటున్నారు బాలీవుడ్ జనాలు. సన్నీ తాజా సినిమా 'వన్ నైట్ స్టాండ్' ఆమె కెరీర్‌లో అతి పెద్ద ఫ్లాప్‌గా నిలిచింది. సన్నీ మీద నమ్మకంతో ఎక్కువ రేటు పెట్టి కొన్న బయ్యర్లు నిండా మునిగారంటున్నారు బాలీవుడ్ జనాలు. ఏళ్ళ తరబడి సన్నీ అందాలు చూస్తున్న ప్రేక్షకులకు ఈ సినిమా బోర్ కొట్టేసిందట! సినిమాలో కొద్దిగా కంటెంట్ ఉందని విమర్శకులు అంటున్నా, వీరి మాటలు ఏవీ ప్రేక్షకుల చెవికి ఎక్కినట్టు లేదు. అందుకే మొదటి వారం కేవలం మూడు లక్షలు మాత్రమే వచ్చాయట! సినిమా ఫలితం చూసిన సన్నీ కూడా షాక్ అయిందట! ఇక నుంచి నటించకుండా సినిమాలు తీస్తే ఎలా ఉంటుంది? అన్న విషయం మీద భర్తతో కలిసి తీవ్రంగా ఆలోచిస్తోందట! అయితే సన్నీ పోర్న్ సినిమాలు తీస్తుందా? లేక మామూలు సినిమాలు తీస్తుందా? అన్న చర్చలు బాలీవుడ్‌లో బాగానే జరుగుతున్నాయి.




"మరి ఫ్రెండ్‌షిప్...వారానికి ఒకసారి కలవడం..." విస్తుపోతూ అడిగింది సమీర.

"వారానికి ఒకసారి కదా? చూసుకోనీ! ఎక్స్‌రే కళ్ళతో చూసినా అభ్యంతరం లేదు. ఆఫీసు కదా ఇబ్బందిగా ఉంది." అంది సమంత.

"నువ్వు తప్పు చేస్తున్నావేమోనే..." చెప్పింది సమీర

"తప్పో...రైటో నాకు తెలీదు. శ్రీకర్ మార్జిన్ దాటడన్నదే నా దృఢ విశ్వాసం" చెప్పింది.

"అమ్మో, నీతో మాట్లాడితే గుండె బరువెక్కుతుందే తల్లీ"

"నువ్వు కూడా ఎవరో ఒక బకరాగాణ్ణి చూసుకో... బరువు తగ్గిస్తాడు.." అంది శ్లేషగా.

"ఛీ...నీకు తెలుగు సినిమాల పరిజ్ఞానం ఎక్కువైంది" అంది.

"సర్లే. కింద స్క్రోల్ చూడు. రామలింగ రాజు గారికి బెయిల్ వచ్చిందట" అంది న్యూస్ చానల్ చూస్తూ.

"పోనివ్వులే...ఎలా బ్రతికి ఎలా అయిపోయాడు"

నిట్టూర్చింది సమీర.

"అంతా వివాహ వ్యవస్థలో ఉన్న గొప్పతనం. వివాహంలో సంతానం, సంతానం కోసం స్వార్థం, ఆనక ఇటువంటి వారికి ఊచలు" తనకు తెలిసిన పరిజ్ఞానం బహిర్గతం చేసింది.

"రాజుగారు కొడుకుల కోసమే ఇంత చేశాడా?" సందేహంగా అడిగింది సమీర.

"ఒక్కోసారి రాజకీయ నాయకుల ఉచ్చులో కార్పొరేట్ దిగ్గజాలు సైతం చిక్కుకుంటారు" విశ్లేషించింది.

"నిజమే, నీ కంటే ఎక్కువ చదివిన శ్రీకర్ నీ ఉచ్చులో చిక్కలేదా?" అంది నవ్వుతూ.

"ఇదీ అదీ ఒకటేనా?"

"మరి?"

"అనాటమి. మా అమ్మ నాన్న నాకిచ్చిన రంగో, అందమో, తెలివితేటలో మరేదో అతడికి నచ్చి ఉంటుంది." చెప్పింది సమంత.

"సర్లే, నీతో వేగడానికి మానవ మాత్రులకు సాధ్యం కాదు" కితాబిస్తూనే తిట్టింది.

"నువ్వు నన్ను పొగిడావా? తిట్టావా?" అడిగింది సమంత.

"అది నీ విచక్షణను బట్టి" నవ్వుతూ అంది సమీర.

తన్నేందుకు సమీర పైకి వెళ్ళింది సమంత. సమీర పక్క గదిలోకి పరిగెత్తింది.

•••

శ్రీకర్ ఇన్ఫోసిస్‌లో చేరాడు.

"మీ కంపెనీ సంక్షోభంలో ఉంది కదా? మా కంపెనీలో జాబ్ చూడనా?" అడిగాడు శ్రీకర్.

"వద్దు...వద్దు" అంది.

నిజానికి తనిచ్చిన ఆఫర్‌కి మరొకరైతే ఎగిరి గంతేసే వాళ్ళు.

మరి సమంత ఎందుకు రిజెక్ట్ చేసినట్టు? ఆలోచనల్లో పడ్డాడు శ్రీకర్.

కొంపముంచి తనని అవాయిడ్ చేస్తోందా?

గత సండే అతడి ఆహ్వానంపై ఎన్టీఆర్ పార్కుకి వచ్చింది సమంత.

పార్కులోని ట్రైన్‌లో కేరింతలు కొడుతూ తిరిగింది.

తర్వాత ఐమాక్స్ థియేటర్‌లో హ్యారీపోటర్‌కి తనే తీసుకెళ్ళింది.

తనకి తాను అంత సన్నిహితంగా ఉండటంతో అతడికి ఊపిరాడలేదు.

ఆమె మాత్రం ఇవేవి పట్టనట్టు సినిమా చూడడంలో నిమగ్నమైంది.

కాబట్టి తనని అవాయిడ్ చేస్తున్నట్టు అనుకోవడానికి లేదు.

తల విదిల్చాడు శ్రీకర్. ఆరోజు సాయంత్రం శ్రీకర్ ఇచ్చిన ఆఫర్ గురించి సమీరకి చెప్పింది సమంత.

"మంచి ఆఫరే కదా? వెళ్ళవచ్చు కదా? పైగా మనది మునిగిపోతున్న పడవలా ఉంది..." అంది సమీర.

"అందుకే మనం ఉండాలి. కష్టకాలంలో నిలబడాలి" చెప్పింది సమంత.

"నువొక్కదానివి వెళ్ళిపోతే కంపెనీ మూత బడుతుందా?"

## ఆ సినిమాలో శ్రియ పక్కా!



*చిరంజీవి 150వ సినిమాలో శ్రియ నటించబోతోందన్నది తాజా సమాచారం. దర్శకుడు వినాయక్ శ్రియ కోసం కేవలం ఐదునిమిషాల పాత్ర సృష్టించారట! ఐదు నిమిషాల పాత్రే అయినా సినిమాకి కీలకంగా ఉంటుందట! శ్రియ ఎంట్రీకి మెగా కుటుంబం నుంచి కూడా అంగీకారం లభించడంతో ఆమె డేట్లను కూడా కన్‌ఫర్మ్ చేసుకున్నారట! అయితే ఈ విషయాన్ని దర్శకుడు కానీ, మెగా ఫ్యామిలీ కాని ధ్రువీకరించలేదు.*

"ప్రతి ఒక్కరూ అలాగే అనుకుంటే కంపెనీకి మనుగడ ఏముంది?"

"రెండునెలల శాలరీ ఉండదట"

"ప్రాణం పోదులే" అంది సమంత.

"అవుననుకో." సాలోచనగా అంది సమీర.

"కేంద్రం ఇన్‌వాల్వ్ అవుతుంది. కంపెనీ నిలబడుతుంది. అప్పటి వరకూ సిబ్బందిగా మనం నైతిక బాధ్యత వహించి కంపెనీకి అండగా నిలవాలి. ఒకవేళ వాళ్ళకు సర్ప్రైస్ అయి పంపితే అప్పుడు ఆలోచిద్దాం. మరో విషయం.. శ్రీకర్‌ని అతడి చూపులను వారానికి ఒక్కసారి మాత్రమే భరించగలను" అంది సమంత.

"ఏమోలే తల్లీ, నువ్వొక మెంటల్ కేసువి. అతడెలా వేగుతాడో మరి.." అంది.

"అబ్బ...అన్నపై ఎంత ప్రేమో!"అంది సమంత.

నవ్వుకుంది సమీర.

•••

రెండునెలలు గడిచాయి. సమంతలో ఏ మార్పు లేదు.

వారానికి ఒకసారి శ్రీకర్ ఎక్కడికి రమ్మంటే అక్కడికి వస్తోంది. నిజానికి చాలా సన్నిహితంగా మెలుగుతోంది. కానీ అడ్వాంటేజ్ తీసుకోవడానికి అతడు ధైర్యం చేయలేకపోతున్నాడు. తను జోకు లేస్తుంది. కానీ అతడు ఎంజాయ్ చేయలేకపోతున్నాడు.

తను ఒకవేళ ప్రాక్టికల్ జోక్ ఏదైనా వేస్తే ఆమె ఎలా రియాక్ట్ అవుతుందోనన్న భయం అతడిది.

ఆ రోజు రమణకు చెప్పాడు.

"సమంత తీరు చిత్రంగా ఉందిరా. తన తమ్ముడితోటో, అన్నయ్యతోటో తిరిగినట్టు తిరుగుతుంది తప్ప తనకి నాపై ఎలాంటి ఫీలింగ్స్ ఉన్నట్టు కన్పించడంలేదు..." కంప్లయింట్ చేశాడు.

రమణ శ్రీకర్ కళ్ళలోకి సూటిగా చూస్తూ...

"అంటే తను నిన్ను హగ్ చేసుకుని, తన పెదవులను నీ పెదవులతో ముడి వేసుకోవాలని కోరుతున్నావా?" అడిగాడు.

"ఛా...అది కాదురా"

"మరేంటి? ముందు నువ్వు ఆమెని అర్థం చేసుకో. తర్వాత అన్నీనూ.." చెప్పాడు రమణ.

"నిజమే...తనది తప్పు కాకపోవచ్చునేమో. ముందే చెప్పింది స్నేహానికి ఓకే అని. అందుకే తన పరిధిలో తాను ఉంది" చెప్పాడు శ్రీకర్.

"జాగ్రత్త. తొందరపడి అడ్వాంటేజ్ తీసుకోకు. ఎత్తికొడితే ఏట్లో పడగలవు" హెచ్చరించాడు రమణ.

సరిగ్గా ఇదే సమయానికి సమీరతో మాట్లాడుతోంది సమంత.

"ఏంటే, మీ అన్నయ్య అప్పుడే నీరు కారిపోతున్నాడు. నేను జోకేసినా అతడికి నవ్వు రావడం లేదు. పైగా ఏవో పిచ్చి చూపులు చూస్తున్నాడు. సంవత్సరాల తరబడి చీకటి గుహల్లో ఉండి వచ్చిన వాడిలా ఉన్నాడు" చెప్పింది సమంత.

"వాడికి మాట్లాడే స్వేచ్ఛైనా ఇస్తున్నావా? లేదా?"

"మాట్లాడే స్వేచ్ఛ ఏమిటే తల్లీ... అతడితో కలిసి ఐమాక్స్‌కి కూడా వెళ్ళాను కదా?" చెప్పింది సమంత.

"అతను అడ్వాంటేజ్ తీసుకోవాలనే ఐమాక్సుకి వెళ్ళావా?"

"అలా చేస్తే చెంప పగులుతుంది" కోపంగా అంది సమంత.

"మరదే వాడి బాధ. దగ్గరకొస్తే దూరమవుతావేమోనని భయపడి చస్తున్నాడు. అందుకే ఆ పిచ్చి చూపులు. అసలు వాడిపైన నీ ఒపీనియన్ ఏంటి?" నిలదీసింది సమీర.

"ఒపీనియన్ ఏముంది? ప్రేమ, పెళ్ళి అన్నాడు. కుదరదని చెప్పాను కదా...స్నేహానికి ఓకే అన్నాను" చెప్పింది.

"ఫ్రాంక్‌గా చెప్పు...ఆడా మగా మధ్య రొమాన్స్ లేని స్నేహం ఉంటుందా?"

"కావచ్చు. అతణ్ణి డిజప్పాయింట్ చేయడం ఇష్టం లేకే స్నేహానికి ఓకే చెప్పాను. అంతేతప్ప అతడిపై నాకు ఎలాంటి ఫీలింగ్ లేదు.."

"సమూ నువ్వు చూసే కోణం వేరు. అతడు నిన్ను చూసే కోణం వేరు. గులాబ్ జామ్ కళ్ళ ముందు పెట్టి తినవద్దని చెబితే ఎంత నరకంగా ఉంటుందో...అతడి పరిస్థితి కూడా దరిదాపు అదే విధంగా ఉంటుంది" చెప్పింది సమీర.

"సర్లే నువ్వు ఆ సరసమైన కథలు చదవడం ఆపేయ్ ముందు" అని దుప్పటి తీసి ముఖం మీద వేసుకుని కప్పుకుంది. దుప్పటి కప్పుకుందనే పేరే గాని సమంత ఆలోచనలన్నీ పరుగులు పెడుతున్నాయి."

**(ఇంకావుంది)**

## సరదాగా

### టికెట్

స్టేడియంలో క్రికెట్ మ్యాచ్ జరుగుతోంది. గ్యాలరీలో కూర్చున్న పురుషోత్తం ముందు సీట్లో కూర్చున్న అబ్బాయినే చూస్తున్నాడు. వాడికి ఎనిమిది, తొమ్మిదేళ్ళు ఉంటాయేమో! వాడికి తోడుగా పెద్దవాళ్ళు ఎవరూ వచ్చినట్లు లేరు. ఎవరూ లేకుండా ఒక్కడే మ్యాచ్ చూడ్డానికి ఎలా వచ్చాడా? అని ఆలోచించసాగాడు. ఉండబట్టలేక, "ఏం బాబూ, టికెట్ చాలా ఖరీదు కదా, ఎవరు కొన్నారు?" అని అడిగాడు. మా డాడీ కొన్నారంకుల్ చెప్పాడా అబ్బాయి. మరి ఆయనేరి? అని అడిగాడు పురుషోత్తం. "ఈ టికెట్ కోసం ఆయన ఇంట్లో వెదుక్కుంటున్నారుగా!" అని చల్లగా పాప్‌కార్న్ తింటూ తీరిగ్గా బదులిచ్చాడు.

### ఒక ప్రశ్న?

నివేదిత విలేకరిగా పనిచేస్తోంది. ఒకానొక రోజు ఒకానొక ఊరి గురించి ఒక ఇంటరెస్టింగ్ వార్త అందింది నివేదితకి. ఆ ఊర్లోవాళ్ళు ఊరుదాటి బయటకు రావడానికి వీల్లేదు. బయటివాళ్ళు ఊళ్ళో అడుగుపెట్టడానికి వీల్లేదు. ఊరు చుట్టూ గోడలు కట్టేశారు. లోపలికి రావాలన్నా, బయటికి వెళ్ళాలన్నా ఒకేఒక గేటు ఉంటుంది. ఆ గేటును దాటాలంటే సుమారు ఎనిమిది నిమిషాలు సమయం పడుతుంది. ఆ గేటుకి గురిచూసి కొట్టగల షూటర్‌ని కాపలాగా ఉంచారు. లోపలి వాళ్ళు బయటికెళ్లాలని ప్రయత్నిస్తే వాళ్ళని వెనక్కి ఊళ్ళోకి పంపేయాలి. ఒకవేళ బయటివాళ్ళు ఊళ్ళోకి అడుగుపెట్టాలని ప్రయత్నిస్తే, వాళ్ళను అక్కడికక్కడే చంపేయాలి. ఇదీ ఆ కాపలాదారుడి పని. ఎక్కువ సమయం నిలబడి ఉంటాడేమో, విశ్రాంతి తీసుకోవడానికి మాత్రం ఓ ఐదునిమిషాలు అక్కడే ఉన్న తన గుడిసెలోకి వెళతాడు అతడు. ఆ సమయంలోనే ఎవరు వెళ్ళినా, వచ్చినా! నివేదిత ఆ ఊళ్ళోకి ఎలాగైనా ప్రవేశించాలనుకుంది. ఆ గేట్‌మ్యాన్‌ని రెండు రోజులపాటు పరిశీలించింది. మూడవరోజు ఎలాగైనా సరే గేటు దాటాలనుకుంది. గేట్‌మ్యాన్ విశ్రాంతి కోసం గుడిసెలోకి వెళ్ళాడు. ఈలోపు కాస్త దూరం వెళ్ళింది నివేదిత. ఐదు నిమిషాల తర్వాత గేట్‌మ్యాన్ గేటు దగ్గర ప్రత్యక్షమయ్యాడు. ఆమెను చూశాడు. అయినా కూడా నివేదిత ఊళ్ళోకి వెళ్ళగలిగింది. ఎలా? అన్నదే ప్రశ్న.

**సమాధానం**

గార్డ్ విశ్రాంతి కోసం లోపలికి వెళ్ళగానే నివేదిత ఊళ్ళోకి నడవడం మొదలుపెట్టింది. గార్డ్ లోపల ఐదు నిమిషాలే ఉంటాడు కాబట్టి ఆ ఐదు నిమిషాలు ఎటువంటి తడబాటు లేకుండా ఊరివైపు నడక సాగించింది. ఐదు నిమిషాలు అయిపోగానే సడన్‌గా వెనక్కి తిరిగి ఊళ్ళో నుంచి బయటకు వెళుతున్నట్లు కనబడింది గార్డ్‌కి నివేదిత. అంతే, గార్డ్ ఆమెను పిలిచి వార్నింగ్ ఇచ్చి ఊళ్ళోకి పంపించాడు.

Jayadev

# అడపా దడపా నవ్వుల్లా

2

# నోబెల్ కథలు

# నాన్న

-బ్యోర్న్‌స్టెర్న్ బ్యోర్న్‌సన్



బ్యోర్న్‌స్టెర్న్ బోర్న్‌సన్ 8 డిసెంబర్ 1832న నార్వేలో జన్మించారు. సాహిత్యంలో నోబెల్ బహుమతి 1903లో అందుకున్నారు. 77 ఏళ్ళ వయసులో 26 ఏప్రిల్ 1910న ఫ్రాన్స్‌లో మరణించారు.

**ఒక ప్రీస్టు అధికార పరిధిలోకి వచ్చే ప్రాంతంలో అందరికన్నా ధనవంతుడు, పేరు ప్రఖ్యాతులున్న ఒక మనిషి కథ ఇప్పుడు మీకు చెప్పాలి. అతని పేరు థోర్డ్ ఓవరాస్. ప్రీస్టు చదువుకోవడానికి ఉపయోగించే గదిలో అతను ఓ రోజు ప్రత్యక్షమయ్యాడు. అతను పొడుగ్గా గంభీరంగా ఉన్నాడు.**

**"నాకు ఒక కొడుకు పుట్టాడు. అతనికి బాప్టిజం ఇప్పించాలనుకుంటున్నాను" అని అతను ప్రీస్టుతో అన్నాడు.**

"అతని పేరు ఏంటి?" ప్రీస్టు అడిగాడు.

"ఫిన్. మా నాన్న పేరే".

"దీన్ని ఎవరు నిర్వహిస్తారు?"

థోర్డ్ వాళ్ళ పేర్లు చెప్పాడు. వాళ్ళు థోర్డ్ బంధువులు. ఆ ప్రాంతంలోనే గొప్ప వర్తకులుగా పేరుపొందిన వాళ్ళు.

"ఇంకా చెప్పాల్సింది ఏమన్నా ఉందా?" ప్రీస్టు అడిగాడు.

థోర్డ్ ఒక నిమిషం తటపటాయించాడు.

"తనంతట తనే బాప్టిజం తీసుకోవాలనుకుంటున్నాను" చివరికి అతను చెప్పాడు.

"ఏ రోజు చేయించాలని?"

"వచ్చే శనివారం. మధ్యాహ్నం పన్నెండింటికి".

"ఇంకా ఏదన్నా చెప్పాల్సి ఉందా?" ప్రీస్టు అడిగాడు.

"ఇంకేమీలేదు" థోర్డ్ పైకి లేచి టోపీ పెట్టుకుంటూ చెప్పాడు.

ప్రీస్టు కూడా లేచి నిలబడ్డాడు.

"సరే ఇప్పటికింతే అనుకుందాం" అంటూ ప్రీస్టు థోర్డ్ వైపు నడిచి అతని చేయి పట్టుకుని కళ్ళల్లోకి లోతుగా చూశాడు.

"ఆ బాలుడు నీకు వరంగా మారాలని దేవుడు అతన్ని నీకు ప్రసాదించాడు" ప్రీస్టు అన్నాడు.

పదహారు సంవత్సరాల తర్వాత థోర్డ్ మళ్ళీ మరోసారి ప్రీస్టు చదువుకునే గదిలోకి వచ్చాడు.

"నీకు ఏ మాత్రం వయసు మీద పడినట్టు లేదు థోర్డ్. నువ్వు అప్పుడు ఎలా ఉన్నావో ఇప్పుడూ అలానే ఉన్నావు" ప్రీస్టు అన్నాడు.

నిజంగానే అతనిలో మార్పు ఏమీ కనిపించలేదు.

"దానికి కారణం నాకు ఎలాంటి సమస్యలు లేకపోవడమే" థోర్డ్ అన్నాడు.

తర్వాత ప్రీస్టు ఏమీ మాట్లాడకుండా కాసేపు అలాగే ఉండిపోయాడు.

"ఈ సాయంత్రం నువ్వు ఇక్కడికి రావడానికి కారణం ఏంటి?"

"మా అబ్బాయికి రేపు చర్చిలో ఇవ్వబోయే స్థానం గురించి తెలుసుకుందామని వచ్చాను".

"వాడు చాలా తెలివైనవాడు".

"చర్చిలో అతనికి రేపు మీరు ఏ స్థానం ఇవ్వబోతున్నారో కచ్చితంగా తెలిసేవరకూ నేను ప్రీస్టుకి డబ్బు ఇవ్వదలచు కోవడం లేదు".

"అతను మొట్టమొదటి వాడిగా ఉంటాడు".

"నేనూ అలాగే విన్నాను. ఇవిగోండి ప్రీస్టు కోసం పది డాలర్లు ఇస్తున్నాను".

"నేను నీకు చేయవలసింది ఇంకేదన్నా ఉందా" ప్రీస్టు థోర్డ్ కళ్ళల్లోకి చూస్తూ ప్రశ్నించాడు.

"ఇంకేమీ లేదు" అంటూ థోర్డ్ వెళ్ళిపోయాడు.

తర్వాత మరో ఎనిమిదేళ్ళు గడిచిపోయాయి. తర్వాత ఒక రోజు ప్రీస్టు చదువుకునే గది ముందు సందడి కనిపించింది. ప్రీస్టు గది ముందు చాలా మంది నిలబడి ఉన్నారు. వాళ్ళముందు నుంచుని ఉన్న థోర్డ్ ముందుగా గదిలోకి వచ్చాడు. ప్రీస్టు అతన్నిచూసి గుర్తుపట్టాడు.

"ఏంటి విశేషం థోర్డ్. చాలామందితో కలిసి వచ్చావు" ప్రీస్టు అడిగాడు.

**ఆ ప్రాంతంలో అతడే పెద్ద ధనవంతుడు. కొడుకు పుట్టాక ఇరవైనాలుగేళ్ళలో మూడుసార్లు చర్చిఫాదర్‌ని కలిసి ఆయన సలహా సంప్రదింపులతో ఫంక్షన్లు చేశాడా తండ్రి. కానీ నాలుగోసారి మాత్రం అతడు పేదల పక్షాన ఆలోచించాడు. పుత్రోత్సాహాన్ని విడిచి ఆ తండ్రి ఎందుకలా ఆలోచించాడు? అది అతడికి వరమా? దీవెనా?**

"మా అబ్బాయి పెళ్ళి గురించి ప్రకటన చేయాలని మిమ్మల్ని అభ్యర్థించడానికి వచ్చాను. మా అబ్బాయి కరెన్ స్టోర్లిడెన్‌ను వివాహం చేసుకోవాలనుకుంటున్నాడు. స్టోర్లిడెన్ నా పక్కన నిల్చున్న ఈ గుడ్‌మండ్ కూతురు" థోర్డ్ చెప్పాడు.

"అంటే ఈ ప్రాంతంలోనే పెద్ద ధనవంతుడి కుమార్తె అన్నమాట"

"వాళ్ళంతా అలానే ఉంటారు" థోర్డ్ ఒక చేత్తో జుట్టు వెనక్కు తోసుకుంటూ చెప్పాడు.

ప్రీస్టు దీర్ఘాలోచనలో పడిపోయినట్టు కాసేపు అలాగే కూర్చుండిపోయాడు. తర్వాత వాళ్ళిద్దరి పేర్లూ పుస్తకంలోకి ఎక్కించాడు. పెళ్ళి గురించి ఒక్కమాట కూడా అనలేదు. థోర్డ్‌తో వచ్చిన వాళ్ళు పుస్తకంలో సంతకాలు చేశారు. థోర్డ్ బల్లమీద మూడు డాలర్లు ఉంచాడు.

"నేను తీసుకునేది ఒక్క డాలరే" ప్రీస్టు అన్నాడు.

"నాకు ఆ విషయం తెలుసు. అయితే నాకు ఉన్నది ఒక్కగానొక్క కొడుకు. అందుకే ఇవి మీకు సంతోషంగా ఇవ్వాలని అనుకున్నాను" ప్రీస్టు ఆ డబ్బు తీసుకున్నాడు.

"నీ కొడుకు గురించి నువ్వు ఇక్కడికి రావడం ఇప్పటికిది మూడోసారి థోర్డ్" ప్రీస్టు అన్నాడు.

"దీనితో ఇంక పని పూర్తి అయ్యింది" థోర్డ్ అన్నాడు. తన చేతిలో ఉన్న పుస్తకాన్ని మడిచి పెట్టుకుంటూ అతను ప్రీస్టు వద్ద సెలవు తీసుకున్నాడు. మిగిలిన వాళ్ళు అతన్ని అనుసరించారు.

ఒక పదిహేను రోజుల తర్వాత తండ్రీ కొడుకులిద్దరూ పెళ్లి ఏర్పాట్ల గురించి స్టోర్లిడెన్‌తో మాట్లాడటానికి పడవపై బయలుదేరారు. ఆ రోజు వాతావరణం ప్రశాంతంగా ఉంది. తండ్రీ

కొడుకులిద్దరూ తెడ్డు వేస్తూ పడవ నడుపుతున్నారు.

"ఈ సీటు సరిగ్గాలేదు" అంటూ కొడుకు పడవలో లేచి నుంచొని తను కూర్చున్న సీటుని సరిచేయబోయాడు. సరిగ్గా అదే సమయంలో అతను నిలుచున్న కొయ్యపలక జారిపోయింది. అతను ఒక్కసారిగా చేతులెత్తి కేకలు పెడుతూ పడవలో నుండి నీళ్ళలోకి పడిపోయాడు.

"తెడ్డుని గట్టిగా పట్టుకో" తండ్రి గట్టిగా అరుస్తూ తెడ్డుని కదలకుండా పట్టుకున్నాడు. తెడ్డుని పట్టుకోవడానికి ఒకటి రెండుసార్లు ప్రయత్నించి కొడుకు విఫలమయ్యాడు.

"ఒక్క నిమిషం ఆగు" అంటూ తండ్రి కొడుకు ఉన్న వైపు తెడ్డుతో పడవను నడిపాడు. అయితే కొడుకు వెల్లకిలా పడిపోయి తండ్రి వంకే రెప్ప వేయకుండా చూస్తూ నీళ్ళలో మునిగిపోయాడు.

థోర్డ్ దీనిని ఏ మాత్రం నమ్మలేకపోయాడు. అతను పడవను పట్టుకుని కొడుకు మునిగిపోయినవైపే కన్నార్పకుండా చూస్తూండిపోయాడు. కొడుకు ఏ క్షణంలోనైనా పైకి లేస్తాడని చూస్తున్నట్లున్నాయి అతని చూపులు.

నీళ్ళలో చిన్న చిన్న బుడగలు లేచాయి. తర్వాత ఇంకొన్ని బుడగలు లేచాయి. చివరికి ఒక పెద్ద బుడగ పైకిలేచి చిట్లిపోయింది. సరస్సు మళ్ళీ ఎప్పటిలా ప్రశాంతంగా అద్దంలా మెరవసాగింది.

తర్వాత మూడు రాత్రుళ్ళు, మూడు పగళ్ళు థోర్డ్ సరస్సులో కొడుకు మునిగిపోయిన చోటులోనే తెడ్డు వేసుకుంటూ పడవ నడపడం అందరూ చూశారు. అతను తిండీ నిద్రా మానేసి కొడుకు శరీరం కోసం ఆ సరస్సుని జల్లెడ పట్టాడు. మూడో రోజు ఉదయానికి థోర్డ్‌కి కొడుకు అచేతన శరీరం దొరికింది. అతను కొడుకు శరీరాన్ని చేతులపై కెత్తుకొని కొండపై ఉన్న తోటకి తీసుకెళ్ళాడు.



ఇదంతా గడిచి సంవత్సరం అయిన తర్వాత ఒకరోజు ప్రీస్టు తన గది వెలుపల వరండాలో ఎవరిదో అడుగుల చప్పుడు విన్నాడు. ఎవరో తలుపుకున్న గడియను కదిలిస్తున్నారు. ప్రీస్టు గది తలుపులు తెరిచాడు. ఎదురుగా పొడవుగా, సన్నగా ఉన్న ఒక వ్యక్తి నుంచొని ఉన్నాడు. అతను తెల్లటి జుట్టుతో బాణంలాగా వంగిపోయి ఉన్నాడు. ప్రీస్టు అతన్ని తదేకంగా చాలాసేపు చూసిన తర్వాత కానీ గుర్తుపట్టలేకపోయాడు. అతను థోర్డ్.

"ఏంటి ఇంత రాత్రివేళప్పుడు వచ్చావు థోర్డ్" ప్రీస్టు అడిగాడు.

"అవును బాగా పొద్దుపోయింది" అంటూ థోర్డ్ కుర్చీలో కూర్చున్నాడు. ప్రీస్టు కూడా కుర్చీలో కూర్చుని థోర్డ్ ఏం చెబుతాడో వినడానికి చూశాడు. తర్వాత చాలాసేపు మౌనంగా గడిచింది. చిట్టచివరికి థోర్డ్ నోరు విప్పాడు.

"నేను పేదవాళ్ల కోసం నా దగ్గరున్న డబ్బు కొంత ఇవ్వదలచుకున్నాను. నా కొడుకు పేరుతో నేను దాన్ని దానంగా ఇవ్వాలని అనుకుంటున్నాను" అంటూ థోర్డ్ అక్కడున్న బల్లమీద డబ్బులుంచి తిరిగి కూర్చున్నాడు. ప్రీస్టు డబ్బు లెక్కపెట్టాడు.

"ఇది చాలా పెద్ద మొత్తం" ప్రీస్టు అన్నాడు.

"ఇది మా తోటని అమ్మగా వచ్చిన మొత్తంలో సగం. నేను ఇవాళ దాన్ని అమ్మేశాను" థోర్డ్ చెప్పాడు.

ప్రీస్టు చాలాసేపు మౌనంగా కూర్చుండిపోయాడు.

"ఇప్పుడు నువ్వు ఏం చేయాలనుకుంటున్నావు థోర్డ్" ప్రీస్టు అతన్ని మృదువుగా అడిగాడు.

"ఏదన్నా మంచిగా అనిపించే పని" థోర్డ్ బదులిచ్చాడు. వాళ్ళిద్దరూ చాలాసేపు అలాగే కూర్చుండిపోయారు. థోర్డ్ కళ్ళు కిందకు దించుకుని కూర్చోగా ప్రీస్టు తదేకంగా థోర్డ్‌నే చూస్తూ కూర్చున్నాడు.

"నీ కొడుకు చివరికి నీకు నిజమైన దీవెన లభించేలా చేశాడని అనుకుంటున్నాను" ప్రీస్టు నెమ్మదిగా మృదువుగా అన్నాడు.

"అవును. నేనూ అలాగే అనుకుంటున్నాను" అంటూ థోర్డ్ కళ్ళెత్తి పైకి చూశాడు.

అతని కళ్ళనుంచీ రెండు పెద్ద నీటి చుక్కలు చెంపల మీదుగా కిందకు జారాయి.

నవ్య

అనువాదం: **జి.లక్ష్మి,** e-mail: guttalakshmi62@gmail.com

# శృంగారంలో చురుగ్గా ఉండాలనుందా?

**శృంగారంలో చురుగ్గా ఉండాలని ఎవరికి అనిపించదూ? శృంగారంలో సత్తా పెంచుకోవాలని, ఎంత వయసు వచ్చినా ఆరోగ్యంగా ఉంటూ పడకసుఖం అనుభవించాలనీ కుటుంబ జీవితంలో భార్యాభర్తలు గాఢంగా కోరుకోవడం అతి సహజం. కానీ ఆధునిక సమాజం ఆ రేంజ్‌లో అందుకు పర్మిట్ చెయ్యడం లేదు. అందర్నీ ఒత్తిడికి గురిచేస్తూ మనస్ఫూర్తిగా ఆ సుఖాన్ని పొందనివ్వడం లేదు!**

## లైంగికాసక్తి తగ్గిపోకుండా..

1. ఎన్ని పనులున్నప్పటికీ రోజుకు కనీసం ఆరుగంటలు నిద్రపోవాలి
2. ప్రతిరోజు ఓ గంట వ్యాయామం చేయాలి. వాకింగ్, స్విమ్మింగ్, షటిల్ వంటి శారీరక వ్యాయామాలు మంచివి. ధ్యానం కూడా లైంగిక శక్తిని పెంచుతుంది.
3. మారిన జీవనశైలికి అనుగుణంగా పండ్లు, కూరగాయలు తీసుకుంటూ ఉండాలి. చాక్లెట్లు తినడం వల్ల కూడా లైంగిక శక్తి పెరుగుతుందని ఇటీవల పరిశోధనలో తేలింది.
4. ఎప్పుడూ ఒంటరితనం ఫీలవకుండా సన్నిహితులతో ఎక్కువ సమయం గడపాలి. వారానికి ఒకసారైనా మిత్రులతో, సినిమాలకు, పార్కులకు, రెస్టారెంట్‌లకు వెళ్లి వారితో కలిసిమెలిసి ఉల్లాసంగా ఉండాలి.
5. భార్యాభర్తల మధ్య లేనిపోని అనుమానాలకు తావు లేకుండా చూసుకోవాలి. అనుమానాల వల్ల మానసిక ఆందోళనకు గురై లైంగిక ఆసక్తి తగ్గుతుంది. మనసు విప్పి మాట్లాడుకోవడం వల్ల జీవితం సుఖమయమవుతుంది.



చాలామంది భార్యాభర్తలు తమ మధ్య ఒకరిపై ఒకరికి ప్రేమ, స్నేహం, నమ్మకం ఉంటే చాలనుకుంటారు. కానీ వీటన్నింటి కంటే ప్రధానంగా ఆ ఇరువురి జీవితాలపై ప్రభావం చూపించేది శృంగారమే కదా!

మరి అలాంటి శృంగార జీవితం సాఫీగా ఉందంటే వారి మధ్య దృఢమైన దాంపత్య బంధం నెలకొందని చెప్పవచ్చు. సంతృప్తికరమైన శృంగార జీవితాన్ని అనుభవించే వారి దాంపత్యంలో అడుగడుగునా ఆనందం వెల్లివిరుస్తుంది. ఒకరికొకరం తోడుగా ఉన్నామనే నమ్మకం కలుగుతుంది.

### విడాకులకు అదీ కారణమే

ఆధునిక జీవనశైలిలో భాగమైన పని ఒత్తిడి, అలసట, ఆందోళన మొదలైన ప్రభావాలు శృంగార జీవితంపై పడుతున్నాయి. విడాకులు తీసుకోవడానికి అవి కూడా ఒక కారణమని విశ్లేషకులు చెబుతున్నారు. ఈ పరిస్థితులు రాకుండా కొన్ని పద్ధతులు పాటించాలి. నేటి ఒత్తిడి సమాజంలో మంచి శృంగార జీవితం అనుభవించాలంటే ఆహార నియమాలు, వ్యాయామం చాలా అవసరం. లైంగిక సామర్థ్యం బాగుండాలంటే అనారోగ్యకరమైన ఆహారానికి దూరంగా ఉండాలి. బరువు పెంచే ఆహారం, క్రమం తప్పిన భోజనం వల్ల లైంగికాసక్తి తగ్గుతుంది. మరి లైంగికాసక్తిని తగ్గించే ఆ ఆహార పదార్థాల్ని వీలైనంత తక్కువ తినేందుకు ప్రయత్నించండి!

### తక్కువ తింటే సామర్థ్యం మెండు

తక్కువగా తినడం వల్ల మూడ్ బాగుంటుంది. టెన్షన్ తగ్గుతుంది. ఫలితం.. సంసార జీవితం చాలా బాగుంటుంది. మితంగా తినడం వల్ల లైంగిక సామర్థ్యం మెరుగ్గా ఉంటుందని లూసియానాలోని పెన్నింగ్టన్ బయోమెడికల్ రీసెర్చ్ సెంటర్ పరిశోధకులు వెల్లడించారు. ఆరోగ్యవంతులైన 200 మంది వ్యక్తుల ఆహార అలవాట్లను రెండేళ్ల పాటు వారు పరిశీలించారు. వీరిలో కొందరికి తినే ఆహారాన్ని 25 శాతం తగ్గించి పెడుతూ, మరో గ్రూపు వారికి సాధారణ పరిమాణంలో భోజనం పెట్టారు. తక్కువ భోజనం తిన్నవారు రాత్రి పడకసుఖాన్ని బాగా ఆస్వాదించినట్లు చెప్పారు. వీరితో పోల్చి చూస్తే మిగిలినవారు అంతగా ఆస్వాదించలేదని చెప్పారు.

### సోషల్ మోడలింగ్

ఎక్కువ బరువు వల్ల సరిగా నిద్ర పట్టదు, సంసార జీవితంపై దాని ప్రభావం పడుతుందని పరిశోధకులు తెలిపారు. ఒకవేళ భాగస్వామి తక్కువ తింటూ సాంసారిక జీవితంలో చురుగ్గా ఉంటే, భాగస్వామి కూడా అదే మంచి లక్షణం ఫాలో అవుతారని కూడా మరో పరిశోధనలో వెల్లడైంది. దీన్ని సోషల్ మోడలింగ్ అంటారు. ఈ మధ్య కాలంలో ఇది ఎక్కువైందని కూడా పరిశోధకులు వెల్లడించారు.

## ఇవి తినడం తగ్గించాలి

**పాస్తా:** సాయంకాలం స్నాక్స్‌లా ఉదయం టిఫిన్‌లా త్వరగా తయారయ్యే పాస్తా అంటే చాలామందికి ఇష్టమే. ఇది రుచికరం కూడా. అయితే రుచిగా ఉందని ఎక్కువ తినేస్తే మాత్రం ముప్పు తప్పదు. తిన్న పాస్తాను గ్లూకోజ్‌గా మార్చుకోవడానికి శరీరం ఫిజికల్‌గా చురుకుగా ఉండదు. దాంతో ఎక్కువ తిన్నారన్న ఫీలింగ్ కలుగుతుంది. ముఖ్యంగా ఇది అలసట, కడుపు ఉబ్బరానికి దారి తీస్తుంది. కాబట్టి లైంగిక సామర్థ్యం మెరుగుపడాలంటే పాస్తాకు దూరంగా ఉండాలి.



**కాఫీ:** మూడ్ బాలేనప్పుడో, అలసటగా ఉన్నప్పుడో ఓ కప్పు కాఫీ తాగడం వల్ల రీఫ్రెష్ అవుతాం. మన మూడ్‌ను ప్రేరేపించే కాఫీని మూడుకప్పులకు మించి



తాగకూడదు. ఎక్కువ తాగితే దాన్లోని కెఫిన్ హార్మోన్ల అసమతౌల్యం ఏర్పడడానికి కారణం అవ్వొచ్చు. ఇది లైంగిక జీవితంపై ప్రభావం చూపించే అవకాశం ఉంది.

**ఫాస్ట్‌ఫుడ్:** ఫ్రెంచ్‌ఫ్రైస్, పిజ్జా, బర్గర్ వంటివి ఎక్కువగా తినకూడదు. వీటివల్ల శరీరంలో కొవ్వు పేరుకుపోవడమే కాదు లైంగిక సామర్థ్యం కూడా నశిస్తుంది. వీటిలో ఉండే హైడ్రోజినేటెడ్ ఫ్యాట్స్ టెస్టోస్టిరాన్ హార్మోన్ లెవల్స్‌ను తగ్గించేస్తాయి. పురుషులు ఎక్కువ తింటే స్పెర్మ్ నాణ్యత దెబ్బ తింటుంది. జీవంలేని స్పెర్మ్ ఉత్పత్తికి ఫాస్ట్‌ఫుడ్ దోహదం కావచ్చు.

**ఆల్కహాల్:** పార్టీల సందర్భంగా డ్రింక్ చేయడం పరిపాటే. కానీ రోజూ అదే పనిగా మద్యం సేవించడం మంచిది కాదు. ఇది ఇతర జబ్బులు తీసుకు రావడమే కాదు, కామ వాంఛను కూడా నశింప జేస్తుంది. అంతేకాదు మోతాదుకు మించి తాగడం వల్ల తలనొప్పి, హ్యాంగ్ ఓవర్ మూడ్ వస్తుంది. దీనివల్ల భాగస్వామితో సుఖపడాలనే వాంఛ తగ్గిపోతుంది.



**చీజ్(వెన్న):** వెన్న, మీగడ లాంటి అధిక కొవ్వున్న పాల ఉత్పత్తులను తీసుకోవడం కూడా మంచిది కాదు. ఈ ఉత్పత్తులను అధికంగా తీసుకోవడం వల్ల ఈస్ట్రోజన్, టెస్టోస్టిరాన్ వంటి సహజ ఉత్పత్తులకు అంతరాయం కలిగి టాక్సిన్స్ ప్రేరేపించడానికి కారణం అవుతుంది.

**పుదీనా:** నోటి దుర్వాసన అరికట్టే పుదీనా తింటే ఎన్నో లాభాలున్నాయి. కానీ అతిగా పుదీనా వాడడం వల్ల అందులో ఉండే మెంతల్ గుణం శృంగార కోరికలను చల్లబరుస్తుంది.

**కార్న్‌ఫ్లేక్స్:** మొక్కజొన్న పొత్తులు లేదా కార్న్ ఫ్లేక్స్ రోజూ తింటూ ఉన్నా కూడా శరీరంలో టెస్టోస్టిరాన్ స్థాయిలు పడిపోతాయి. ఈ ఆహారం కామ వాంఛను తగ్గిస్తుంది. అలా కాకుండా శృంగార కోరికలు అధికంగా ఉండి మానసిక శారీరక సమస్యలు తగ్గాలని కోరే వారికి ఈ ఆహారం ఎంతో సహకరిస్తుంది.



**ధనియాలు, సోయాబీన్, సోంపు విత్తనాలు:** సోయాబీన్ ఆరోగ్యానికి ఎంతో మంచిది. ధనియాలు మసాలాలలో వాడతారు. ఇక తిన్న ఆహారం జీర్ణం కావడానికి చాలామందికి సోంపు వేసుకోవడం అలవాటే. కానీ ఈ పదార్థాల్ని మోతాదుకు మించి తింటే శరీరంలో టెస్టోస్టిరాన్ హార్మోన్ల స్థాయి తగ్గిపోతుంది. అయితే తక్కువ మొత్తాలలో వాడితే ఈ సమస్య ఉండదు.

**మాంసాహారం:** మాంసాహారంలో అధిక ప్రోటీన్స్ కొవ్వు పదార్థాలు ఎక్కువగా ఉండడం వల్ల రాత్రి సమయంలో జీర్ణం అవడానికి కష్టం అవుతుంది. కాబట్టి రాత్రి సమయంలో అతి తక్కువ తినడం లేదా పూర్తిగా తగ్గించడం మంచిది.

**కూల్‌డ్రింకులు, టానిక్‌లు:** దాదాపు సాఫ్ట్ డ్రింకులన్నింటిలోనూ క్వినైన్ పదార్థం ఉంటుంది. దీన్ని సింకోనా చెట్టు బెరడు నుంచి తీస్తారు. దీన్ని మలేరియా వ్యాధి నివారణలో, కొన్ని రకాల టానిక్‌లలోనూ వాడతారు. ఈ పదార్థం కూడా లైంగికేచ్ఛను తగ్గిస్తుంది.



### శృంగారంలో ఆశ్చర్యపరిచే నిజాలు

కొన్ని సర్వేలు శృంగారానికి సంబంధించి ఆసక్తికరమైన అంశాలను వెల్లడించాయి. శృంగారంలో పాల్గొనే పురుషులకు 100 నుంచి 200 కేలరీల శక్తి ఖర్చు అయితే స్త్రీలకు సుమారు 70 కేలరీల శక్తి ఖర్చవుతుందట. కేవలం మనుషులు మాత్రమే కాదు తోడేళ్లు, ఎలుగుబంట్లు, గబ్బిలాలు లాంటి జంతువులు కూడా ఓరల్ సెక్స్‌ను ఎంజాయ్ చేస్తాయని ఇప్పటికే పరిశోధనల్లో రుజువైంది. మైగ్రేన్‌తో బాధపడే చాలామంది స్త్రీలలో శృంగార కోరికలు ఎక్కువగా ఉంటాయట. అలాగే ఎక్కువ మంది మహిళలు వెలుతురు కంటే, బాగా చీకటిగా ఉన్న గదిలో శృంగారానికే ఎక్కువ మొగ్గు చూపుతారని తేలింది. ప్రపంచంలో కేవలం అయిదు శాతం మంది మాత్రమే ప్రతీరోజు శృంగారంలో పాల్గొంటున్నారు. మరో ఇరవై శాతం మంది వారానికి మూడు లేదా నాలుగు సార్లు శృంగారంలో పాల్గొంటుండగా మిగిలిన వారు ఎప్పుడో ఓసారి ఆ సుఖం అనుభవిస్తారట. సెక్స్‌లో భావప్రాప్తి పొందే సమయంలో గుండె నిమిషానికి 140 సార్లు కొట్టుకుంటుంది. లవర్స్‌ను స్వీటీ అనీ, స్వీట్ హార్ట్ అనీ పిలవడం వెనుక ఓ సైంటిఫిక్ రీజన్ కూడా ఉంది. రక్తంలో షుగర్‌కి సెక్స్ లైఫ్‌కి సంబంధం ఉందట. రక్తంలో షుగర్‌లెవల్స్ తక్కువ ఉంటే అవతలి వారికి ఆకర్షణ తగ్గిపోతుందట. మంచి సెక్స్‌లైఫ్‌ను ఎంజాయ్ చేయడానికి చాకొలేట్స్ తోడ్పడతాయని తెలుసు అయితే గుమ్మడికాయ ముక్కలు జస్ట్ వాసన పీల్చితే పురుషాంగానికి రక్తప్రసరణ పెరుగుతుందని కూడా పరిశోధనల్లో తేలింది.

- నివేదిత



## బ్లూ ఫిల్మ్స్ వల్ల నో యూజ్

మద్యపానం, ధూమపానం మాత్రమే కాదండీ పోర్న్ వీడియోలు చూడడం కూడా హానికరమే. పోర్న్ వీడియోలు చూడటం ఒక వ్యసనం లాంటిదే. దాని వల్ల లైంగిక సామర్థ్యం తగ్గుముఖం పడుతుందట. అది చూస్తున్న సమయంలో బానే ఉంటుందట కానీ దీర్ఘకాలంలో మైండ్ బ్లాంక్ అయిపోతుందట. ఇటీవల జేఏఎమ్ఏ సైకియాట్రి అనే వ్యక్తి జరిపిన పరిశోధన పలు వివరాలు వెల్లడించింది. అందులో బ్లూ ఫిలిమ్స్ చూసే వారికి భవిష్యత్తులో నిజంగా శృంగారంలో పాల్గొన్నప్పుడు ఆసక్తి ఉండదట. తరచూ నీలిచిత్రాలను చూసేవారు దాంపత్య జీవితంలో పూర్తి సంతోషాన్ని పొందట్లేదన్నది ఈ పరిశోధన సారాంశం. ఇది హార్మోన్లపై ప్రభావం చూపి వాటిని ఓవర్‌గా రెస్పాండ్ అయ్యే విధంగా తయారు చేసే ప్రమాదం ఉందట. కాబట్టి పరిశోధకుల సూచన ప్రకారం పోర్న్ చిత్రాలు చూడటం ఒక వ్యసనంగా మారకుండా చూసుకోవాలి.





# నిండు నూరేళ్ళు

8

-సింహప్రసాద్ సెల్: 98490 61668

**"ఏదో నీ పిల్లల అదృష్టం కొద్దీ బతికి బయటపడ్డావు గానీ కాసేపు అలా జరగలేదనుకో. అప్పుడేం జరుగుద్ది? నీ పీడ విరగడయ్యిందని నీ మొగుడు నీ సవతితో కులికేవాడు. నీ పిల్లల్ని వీధిలోకి తోలేవాళ్ళు. లేదా చదువు మాన్పించి ఏదో పనిలో పెట్టేవారు. చూశావా, నీ చావు వల్ల పండంటి నీ బతుకుపోయింది. నీ పిల్లల భవిష్యత్తుపోయింది. నువ్వు ద్వేషించే నీ మొగుడికి నీ అడ్డు తొలగిపోయింది. ఇందులో లాభమంటూ ఉంటే అతడికే గానీ నీకూ నీ పిల్లలకూ కాదు. ఒప్పుకుంటావా?"**

తలొంచుకుని ఏడ్చేసింది.

"ఏడ్పులతో ఏమీ సాధించలేం. చావుతో ఏ సమస్యా పరిష్కారం కాదు. దేవుడు పశుపక్ష్యాదుల కన్నా ఉన్నతమైన జన్మ మానవులకు ఇచ్చాడు. పశువులూ పక్షులూ ఎప్పుడైనా ఎక్కడైనా ఆత్మహత్య చేసుకోవడం చూశావా? పోనీ విన్నావా? లేదు కదా. మరి వాటికన్నా ఉత్కృష్టమైన జన్మ పొందిన మనమెందుకు ఆ ఘాతుకానికి పాల్పడాలి చెప్పు?"

"ఆడదాన్నాయె. ఇంకేటి సేసీది?"

"దారులే లేవా? బాగా ఆలోచించి చెప్పు. నీ వాళ్ళకి చెప్పి నీ మొగుడికి బుద్ధి చెప్పించవచ్చు. పోలీసులకి ఫిర్యాదు చేసి సవతిగోల వదిలించుకోవచ్చు. కోర్టుకెక్కి నీ మొగుడితో తెగతెంపులు చేసుకోవచ్చు. ఆ ఇంట్లోంచి వచ్చేసి నీ కాళ్ళమీద నిలబడి పిల్లల్ని ప్రయోజకుల్ని చేయవచ్చు. నీకంత శక్తి లేకపోతే పిల్లల్ని శరణాలయంలో చేర్చవచ్చు. మారుమనువాడి సుఖపడవచ్చు. కష్టమో నష్టమో భరిస్తూ వీలున్నంత వరకూ సంసారం చక్కదిద్దుకోనూ వచ్చు. అవునా కాదా?"

"అలాగ ఆలోసించనేదు. నాకు సదువా సట్టు బండలా!"

"ఇది తెలుసుకోవడానికి చదువక్కర్లేదు. లోకానుభవం చాలు. ఒక్కసారి వెనుదిరిగి చూడు. మీ పూర్వులు సరైన వర్షాల్లేక పనుల్లేక ఆకలితో అలమటించి ఉంటారు. పస్తులుండి ఉంటారు. అయినా ఆత్మహత్య చేసుకుని చనిపోయారా? లేదే. దేవుడు మనకి జన్మనిచ్చింది నిండు నూరేళ్ళు బతకమనిగాని అర్థాంతరంగా చావమనికాదు. బలవంతంగా చచ్చినవాళ్ళు నరకానికిపోయి నరకబాధలు అనుభవిస్తారని పెద్దలు చెబుతారు. ఆ బాధల ముందు ఈ బాధలు పెద్దవి కావు. నువ్వు గట్టిగా తలచుకుంటే, కొంగుబిగిస్తే నీ సమస్యలు పారిపోకుండా నిలబడతాయా?"

ఆలోచనలో పడింది తలుపులమ్మ.

"పిరికితనం వద్దు తలుపులమ్మా. మనకి ధైర్యం ఎప్పుడైతే పోతుందో అప్పుడే మనం చచ్చినట్టులెక్క. ఎటువంటి పరిస్థితిలోనూ ధైర్యాన్ని కోల్పోకూడదు. మన మీద, మన శక్తి మీద, మన రెక్కల మీద మన నమ్మకాన్ని పోగొట్టుకో కూడదు. ఏం? పెళ్ళికి ముందు నువ్వు బతకలేదూ? రెక్కల కష్టంతో డబ్బు సంపాదించలేదూ? పొలం పని దొరక్కపోతే రాళ్ళెత్తావు. అదీ లేకపోతే ఇళ్ళూడ్చావు. అదిపోతే ఆఫీసులోనో, ఆసుపత్రిలోనో పని చేశావు. శ్రమించే వారి దగ్గరకు దరిద్రాదేవి రానేరాదు. పరమాన్నాలు గాకపోయినా కలోగంజో నువ్వు తాగి నీ పిల్లలు కింత పోయగలవు కదా? ఇంకా సందేహముందా?"

తల అడ్డంగా ఊపింది.

"ఇప్పుడు చెప్పు. బలవంతంగా చావాలనుకోవడం మంచి పనేనా?"

కళ్ళు కన్నీటి బుగ్గలవుతోంటే మళ్ళీ తల అడ్డంగా ఊపింది.

"చచ్చి సాధించేదేమీ ఉండదు. ఏం సాధించాలన్నా ఆఖరికి నీ మొగుడికి బుద్ధి చెప్పాలన్నా బతికే ఉండాలి తప్ప చావ కూడదు. తప్పు, దోషం, ద్రోహం అతడిదైతే నువ్వెందుకు శిక్ష అనుభవించాలి? పుట్టింది బతకడానికిగాని ఇలా చావడానిక్కాదు. చావే మనకోసం ఎదురు చూడాలి తప్ప మనం దానికి ఎదురెళ్ళకూడదు. చావడానికి క్షణం చాలదు. నీకు జీవం పోయడానికి మీ అమ్మకి తొమ్మిది నెలలు పట్టింది. నువ్విలా పోవడానికేనా మీ అమ్మ చచ్చి బతికి నిన్ను కన్నది? మాట్లాడవేం. బతుకు చాలాగొప్పది తలుపులమ్మా. అది దీపం లాంటిది. ఎన్నో బతుకుల్ని వెలిగిస్తుంది. ఆ వెలుగులే నీ పిల్లల నవ్వులు!"

"ఈపాలికి సెమించీండి అమ్మగోరూ. ఆ మనిషి మీది కోపంతో పిచ్చెక్కిపోతాది. ఇంకలాటి దగుల్బాజీ పని సెయ్యను గాక సెయ్యను. నా బిడ్డల మీదొట్టు. సివాసెలం అప్పన్న మీదొట్టు" ఏడుస్తూ టపటపా చెంపలు వాయించుకుంది.

ఎర్రగా కాలినప్పుడే ఇనుము మీద సుత్తిదెబ్బలు పడాలని అనుకున్నట్టున్నారు అమ్మాజీ. మళ్ళీ తన ప్రసంగం కొనసాగించారు.

"నీకేం నువ్వు కొంతైనా అనుభవించావ్. ముప్ఫై ఏళ్ళపాటు మంచీ చెడూ, కష్టం సుఖం, పెళ్లీ, సంసారం, పిల్లలూ అన్నీ చూశావు. అభం శుభం తెలీని వీళ్ళేం చూశారు చెప్పు? వీళ్ళకి సరైన బతుకివ్వడం, దారి చూపడం నీ బాధ్యత. అలా చేతకానప్పుడు, అలా చేయలేనప్పుడు వీళ్ళకి జన్మ నివ్వకుండా ఉండాలి. ఇచ్చాక అది నీ బాధ్యతే. ఇందులో నీ మొగుడికేం బాధ్యత లేదనటం లేదు. అతడికీ ఉంది. పిల్లల్నేకాదు నిన్నూ చక్కగా చూసుకోవాలి. మిమ్మల్ని బాధలు పెట్టిన అతగాణ్ణి వదిలేస్తామనుకుంటున్నావేమో, వదలం. నీ సవతినీ వదిలిపెట్టం. ఇక మీ



## జరిగిన కథ

విజ్జీ వివాహం జరిగి ఏడు నెలలు గడిచినప్పటికీ విహాన్ జ్ఞాపకాలను మరిచిపోలేదామె. ఇంతలోనే ఆత్మహత్య చేసుకోబోతున్నట్టు ఆమెకు మెసేజ్ ఇస్తాడు విహాన్. అతన్ని రక్షించే ప్రయత్నంలో భర్తను కూడా లక్ష్యపెట్టకుండా అర్థరాత్రి పూనే నుండి హైదరాబాద్ వెళ్ళేందుకు ఎయిర్‌పోర్ట్‌కు చేరుకుంది విజ్జీ. ఆమె ఆలోచనలు గతంలోకి జారుకున్నాయి. ఒక పబ్‌లో బౌన్సర్‌గా పరిచయమైన విహాన్‌తో ప్రేమలో పడుతుంది విజ్జీ. వారి పెళ్ళికి మొదట అభ్యంతరం చెప్పినా తర్వాత ఓకే చెబుతాడు ఆమె తండ్రి. ఈ లోపు విశాఖపట్నం వెళ్ళిన విజ్జీకి రాజేశ్వర్ పరిచయం అవుతాడు. అతడితో సన్నిహితంగా మెలుగుతుందామె. ఆ తర్వాత....

బతుకుల్లో ఆడుకోనివ్వం. వాళ్ళనీ పిలిపిస్తాం. ఎలా దారిలోకి తేవాలో అలా తెస్తాం. కాని ఇంతకంటే పెద్దకష్టం వచ్చినాసరే, మళ్ళీ మరో హుద్‌హుద్ వచ్చి నువ్వు తప్ప అంతా కొట్టుకుపోయినా సరే ఎలా వోలా బతకాలి. బతికితీరాలి తప్ప చావుని తలచు కోకూడదు. బతికి నువ్వేంటో నీ శక్తేంటో చాటు కోవాలి. వయస్సుడిగాక తృప్తిగా చావాలి. తెల్సిందా?"

"మా బాగా తెల్సినాది. ఈపాలికొగ్గేయండి. ఇంక జన్మల సెయ్యనేసెయ్య"

"ఒక్కటిమాత్రం గుర్తుపెట్టుకో. నువ్వు నీ మొగుణ్ణి నమ్మి పుట్టలేదు. కానీ నీ బిడ్డలు నిన్ను నమ్మి పుట్టారు. వాళ్ళకి ద్రోహం చేసే హక్కు, అధికారం నీకు లేవు. నీ మొగుడికీ లేవు. వారి ఎదుగుదలకు చేతులు అడ్డుపెట్టాల్సిన బాధ్యత మీ ఇద్దరి మీదా ఉంది. అది బరువుకాదు బంధం. ప్రేమ బంధం. మీకు మీ బిడ్డలకీ మధ్య ఎలాంటి బంధముందో మనల్ని పుట్టించిన ఆ దేవుడికీ మనకీమధ్య అచ్చం అలాంటి బంధమే ఉంది. అమ్మగా నాన్నగా మనం ఓడిపోవద్దు. మనిషిమీదెన్నో ఆశలు పెట్టుకున్న దేవుణ్ణీ ఓడిపోనివ్వొద్దు. బతుకుదాం. బతికిద్దాం. బతికినన్నాళ్ళు మంచినీ మమకారాన్నీ పంచుదాం.."

తలుపులమ్మ అమాంతం అమ్మాజీ కాళ్ళమీద పడిపోయింది. ఆమెని లేవనెత్తి అక్కున చేర్చుకున్నారు. కన్నీళ్ళు తుడిచారు.

"నీకు అండగా మేమంతా ఉన్నాం. నువ్వు ఒంటరివని కలలో కూడా అనుకోవద్దు. మనమంతా ఒకరికోసం ఒకరు నిలబడదాం. అప్పుడు మనమే ఓ మహాశక్తి అవుతాం".

ఆమెలో ఆత్మవిశ్వాసం పోగయింది. ధీమాగా చూసింది.

చేతులు జోడించింది. పిల్లల చేతులు పట్టుకుని నడిపించుకుంటూ వెళ్ళిపోయింది తలుపులమ్మ.

ఇలాంటి కౌన్సెలింగ్ లలితకీ, ఆమె తండ్రికీ, సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లకీ ఎవరైనా ఇచ్చిఉంటే, ఇప్పించి ఉంటే ఎంత బావుండేది! కనీసం సైకియాట్రిస్టుని కలిసినా పరిస్థితి వేరేలా ఉండేది!

అమ్మాజీనెలా ప్రశంసించాలో వారంతా కలిసి చేస్తోన్న మహత్తర కార్యాల్నెలా అభినందించాలో తెలీలేదు.

ఇంతవరకూ డబ్బు మనుషుల్నే చూశాను. ఇప్పుడు అసలు సిసలు మనుషుల్ని చూశాను. అమ్మాజీ మనిషి కాదు, మనీషి.

"మిమ్మల్ని ఇంకెప్పుడూ ఆంటీ అని పిలవను అమ్మాజీ. మీరు అక్షరాలా అమ్మాజీయే. అణువణువూ అమ్మాజీయే" చేతులు జోడించాను.

నాకిది కొత్త అనుభవం. సరికొత్త పాఠం!

●●●

ఇందిరా వెంకట్‌ల పెళ్ళి ఘనంగా జరిగింది.

అమ్మా నాన్నా, అన్నయ్య వచ్చారు.

ఇంకో పదిరోజులు పుట్టింట్లోనే ఉంటానని చెప్పి ఆగిపోయింది వదిన.

మేమంతా తిరుగు ప్రయాణమయ్యాం.

ఫ్లయిట్‌లో నాన్న తన బ్యాగ్‌లోంచో వారపత్రిక బయటికి తీసి తిరగెయ్యసాగారు.

"మీరు పత్రికలు చదవటం ఎప్పుడూ చూళ్ళేదు డాడీ" ఉండబట్టలేక అన్నాను.

"ప్రయాణాల్లో బోర్‌కొట్టకుండా కొంటూ ఉంటాను. స్కూల్, కాలేజీ డేస్‌లో డిటెక్టివ్ పుస్తకాలు బాగా చదివేవాణ్ణి. అవి ఒకఊపు ఊపేవనుకో. ఇప్పుడు అలాంటివి ఎక్కడ వస్తున్నాయి!"

"ఊరికే తిరగెయ్యకుండా సీరియస్‌గా చదివితే ఇప్పటి కథలూ, నవలలూ కూడా బాగానే ఉంటున్నాయి".

"సినిమాలు చూడటం కుదరదు గనుక ఎక్కువగా సినిమా విశేషాలు చదువుతూ ఉంటాను".

కాసేపు తిరగేశారు. ఆవులింతలు రాగా పుస్తకం పక్కన పడేసి కళ్ళు మూసుకున్నారు.

ఆ వీక్లీని అందుకున్నాను. సినీనటుల ఫోటోలు



వేసి వాటి పక్క బాక్సుల్లో ఇచ్చిన గాసిప్ సమాచారాన్నీ, జోక్స్నూ, కార్టూన్లనీ చూస్తున్నాను.

ఒకచోట విహాన్ ఫోటో కనిపించింది. ఉలిక్కిపడ్డాను. ఆత్రంగా చదివాను.

విహాన్ షూటింగుల్లో సహనటీమణులతో ఇబ్బందికరంగా ప్రవర్తిస్తున్నాట్ట. ఏమైనా అంటే కండలు ప్రదర్శిస్తూ భయపెడుతున్నాట్ట. అతడితో కలిసి నటించడానికి భయపడు తున్నారని వార్తలొస్తున్నాయట. ఇప్పుడిప్పుడే వృద్ధిలోకొస్తున్న నటుడికి ఈ 'ఆడరోగం' ఏవిటోనని వ్యాఖ్యానించారు!

నా కళ్ళని విశ్వసించలేకుండా ఉన్నాను.

ఇది నిజమై ఉంటుందా? నాతో ఎంతో హుందాగా, మర్యాదగా, లక్ష్మణరేఖ దాటకుండా వ్యవహరించే విహాన్...

ఆలోచించేకొద్దీ గుండె గుబేల్మంటోంది. కళ్ళమ్మట నీళ్ళు వచ్చాయి.

'ఇది నిజం కాదేమో, అభూతకల్పనేమో' అని సమర్థించుకో జూశాను గాని సాధ్యం కాలేదు.

నిప్పులేనిదే పొగరాదు!

అతడి మీద కట్టుకున్న ఆశాసౌధాల పునాదులు కదుల్తున్నాయి.

నాన్న ఈ గాసిప్ని చూసిఉంటారా? ఉండి ఉండరు. చూసిఉంటే కచ్చితంగా కోపంతో ఊగిపోయేవారు. అతడి అంతు చూస్తానంటూ చెలరేగిపోయేవారు!

హైదరాబాద్ వెళ్ళగానే విహాన్ని నిలదీయాలి. ఈ వార్త వెనకనున్న నిజానిజాలేమిటో తేల్చుకోవాలి! అయ్యో. ఇలాంటి ప్రవర్తన గల వాళ్ళు ఏ రంగంలోనైనా ఎలా పైకొస్తారు? ఆడవారిని లైంగిక వేధింపులకు గురిచేసేది ఇలాంటి వారే!

నా కళ్ళు గంగా గోదావరులయ్యాయి!

•••

చాలా అసహనంగా ఉంది. విసుగ్గా ఉంది. విహాన్ మీద కోపంగా ఉంది.

ఒకటి కాదు రెండు కాదు పదిసార్లు ఫోన్ చేశాను. వాట్సప్లో మెసేజ్లు పెట్టాను.



**ప్రాచీన ఈజిప్షియన్లు తలదిండ్లను రాతితో తయారు చేసుకునేవారు.**

ఫోన్ రిసీవ్ చేసుకోడు. తను చెయ్యడు. జవాబివ్వడు.

గాసిప్ గురించి చెడామడా తిట్టేస్తానని భయపడి ముఖం చాటేస్తున్నాడేమో!

లేకపోతే ఎన్నడూలేనిది ఇలా ఎందుకు ప్రవర్తిస్తాడు? దానికంటే బలమైన కారణం ఉండే అవకాశం లేదు.

రాత్రి పదిగంటల ప్రాంతంలో మళ్ళీ చేశాను. ఏ కళనున్నాడో లిఫ్ట్ చేశాడు.

"వాట్ హేపెన్డ్ టు యూ?" కించిత్తు కోపంగానే అరిచాను.

"ప్లీజ్. కొంచెం టైమియ్యి. తర్వాతంతా వివరంగా చెబుతాను"

"ఇప్పుడు నోర్రావటం లేదు గాని అప్పుడొస్తుందా?"

"దయచేసి నా పరిస్థితి అర్థం చేసుకో. తర్వాత చేస్తాను"

**వార పత్రికలో విహాన్ గురించి రకరకాల వార్తలు రావడం ప్రారంభమయ్యాయి. సహనటీనటులతో అసభ్యంగా ప్రవర్తిస్తున్నాడన్న వార్త ఆమెను తీవ్ర కలవరపాటుకు గురిచేసింది. ఆ వార్తలు అభూత కల్పనలా? లేక నిప్పు లేకుండా పొగ రాదన్న సామెత లాంటివా? అని సందిగ్ధంలో పడిందామె. ఫోన్ చేసినా రెస్పాన్స్ లేదు. అతన్ని కలిసి నిలదీయాలని బయలుదేరింది. అప్పుడేమైంది? అతడేమన్నాడు?**

"నిన్ను అర్జంటుగా కలవాలి..."

"తర్వాత కలుద్దాం... బై..."

కాల్ కట్ చేశాడు. నా కోపం నషాళానికంటింది. మళ్ళీ ఫోన్చేసి చెడామడా తిట్టేద్దామనుకునే నిగ్రహించు కున్నాను.

అతడి దృష్టికోణం నుంచి ఆలోచించడానికి ప్రయత్నిస్తూ విఫలమయ్యాను.

నా ఊహ కందనిదేదో ఉంది. అది నాకు తెలియడం అతడికి ఇష్టం లేదన్నది స్పష్టమవుతోంది.

అదేమిటో ఎలా తెలుసుకోవడం? అప్పటిదాకా ఈ అశాంతినెలా భరించడం?

ఆలోచనలు తెగలేదు. నిద్ర దరిచేరనూ లేదు!

మర్నాడు బ్రేక్ఫాస్ట్ కూడా చెయ్యకుండా విహాన్ని కలవడానికి బయల్దేరాను. గుమ్మం దాటుతోంటే నాన్న పిలిచారు.

"నీ కంపెనీ గురించి కొన్ని డాక్యుమెంట్లు రిజిస్ట్రార్ ఆఫ్ కంపెనీకి పంపించాలిట. చాలా అర్జంటని అంటున్నాడు ఆడిటరు. వెంటనే వెళ్ళి చార్టర్డ్ ఎకౌంటెంటుని కలిసి ఆ సంతకాలేవో పెట్టేసెయ్.."

మరేమన్లేక తలాడించి తిన్నగా సిఏ ఆఫీసుకి వెళ్ళాను. పదకొండింటికి గాని రాడన్నారు.

కడుపులో ఎలుకలు గోల చేస్తున్నాయి. దగ్గర్లోని హోటల్ కెళ్ళి టిఫిన్ చేసి వచ్చాను.

సిఏ వచ్చాడు. ఫోన్లలో బిజీగా ఉన్నాడు. అతడి ముందు కెళ్ళి నిలబడ్డాను.

"అరెరె ఎంతసేపయిందొచ్చీ.." నొచ్చుకుంటూ అసిస్టెంటుకేదో చెప్పాడు.

అతడు అయోమయం మార్కు మొఖంపెట్టగా "కంపెనీ తాలూకు అన్నిరకాల ఫారాల మీద సంతకాలు తీసుకోవయ్యా మగడా?" అని అరిచాడు.

అతగాడు కంగారుపడ్డాడు. కంప్యూటర్లోంచి ఏవేవో కాపీలు తీసి నా చేత సంతకాలు పెట్టించుకున్నాడు. లోపలికెళ్ళి సిఏకి చూపించాడు. మళ్ళీ వచ్చి మళ్ళీ కొన్ని ఫారాలు ప్రింటు తీసి మళ్ళీ సంతకాలు, స్టాంపులు.."

అక్కడి నుంచి బయటపడే సరికి మధ్యాహ్నం మూడయింది.

ఇప్పుడు పడుతూ లేస్తూ కూకట్పల్లి హౌసింగ్ బోర్డు వెళ్ళినా విహాన్ రూంలో ఉండే అవకాశం తక్కువ.

ఉస్సూరుమని నిట్టూర్చి ఇంటి మొహం పట్టాను.

భోంచేసి పక్కమీద దొర్లుతుంటే ఏదో అపరాధభావన నన్ను చుట్టెయ్యసాగింది.

విహాన్కి ఎలాఉందో అసలు! అతడి రూమ్మేట్స్ ద్వారానైనా తెలుసుకోకుండా పీకలదాకా మెక్కి ముసుగు తన్నడం... క్షమించరాని నేరం!

మరి అయిదు నిమిషాలకి నా కారు రోడ్డు మీద దూసుకుపోతోంది.

నా కంపెనీ ఆఫీసు తెరవాలనుకున్న బిల్డింగుకి దగ్గర్లోనే ఉంటున్నాడు. ఇదివరకు రెండుసార్లు వెళ్ళాను గనుక తేలిగ్గానే ఇల్లు పట్టుకోగలిగాను.

టీవీలో నటించే విహాన్ అని చెప్పేసరికి ఫ్లాట్ నెంబరు చెప్పాడు వాచ్మేన్.

తలుపుకి తాళం లేదు. ఎవరో ఒకరు ఇంట్లో ఉన్నందుకు సంతోషిస్తూ తలుపు మీద చిన్నగా తట్టాను. తెరవలేదు. తోశాను.

వెలుగు లోపలికి ప్రవేశించేసరికి పడుకుని ఉన్న విహాన్ విసుగ్గా తలెత్తాడు.

"విహాన్!"

చటుక్కున లేచి కూర్చున్నాడు. "నువ్వా! ఏవిటిలా ఉరుము లేని పిడుగులా...!"

"నీకెలా ఉంది?"

"ఫైన్..." కుర్చీ ముందుకు లాగాడు.

"అసలు నీకేమయింది? ఫోనెందుకు లిఫ్ట్ చెయ్యవు?" దూకుడుగానే అడిగాను.

మొహం తిప్పుకుని కళ్ళు తుడుచుకున్నాడు. నా గుండె చెమరింది.

"చెప్పాలి. కాని ఏంచెప్పినా అపార్థం చేసుకుంటావేమోనని.."

"అర్థం చేసుకోగలన్లే చెప్పు".

"నీ దగ్గర దాచాలని లేదు. కానీ.. సరేకానియ్... టీవీ ఇండస్ట్రీలో చాలా అన్పాపులర్ అయ్యాను విజితా. ఎవరో ఒక రూమర్ పుట్టించారు. నేను సహనటీమణుల్తో అసభ్యంగా ప్రవర్తిస్తుంటానని, వారెవరో గాని విత్తితే సుడిగాలి లేచింది. 'ఆటగదా' అన్నది ఆనోటా ఈ నోటా వ్యాపించింది. అంతానన్ను కాసనోవాలా చూడటం మొదలుపెట్టారు. అమ్మాయిలు దూరంగా జరుగుతున్నారు. అతి జాగ్రత్తగా వ్యవహరిస్తున్నారు. నా వంక అనుమానంగా చూస్తున్నారు. నేనలాంటివాణ్ణి కాదనీ, ఎవరో కిట్టని వాళ్ళు విష ప్రచారానికి పూనుకున్నారనీ ఎలా చెప్పాలో ఎందరికి చెప్పాలో తెలీకుండా ఉంది. దాంతో నాలో నేను సతమత మవుతూ, కుళ్ళిపోతూ... నువ్వు చెప్పు విజితా నేనలాంటి వాణ్ణా! నా కాళ్ళని నేనే నరుక్కుంటానా?" కిందా మీదా అయిపోతూ బేలగా అడిగాడు.

"ఆఫీసుల్లో, పనిచేసే ప్రదేశాల్లో లైంగిక వేధింపులు ఇదివరకు కన్నా ఎక్కువగా వెలుగు జూస్తున్నాయి. అందుకని అంతా తేలిగ్గా నమ్మేసి ఉంటారు."

"అలాగని ఒక్కరూ నోరెత్తి చెప్పలేదు. నన్ను ప్రశ్నించలేదు".

"నిన్ను సమర్థిస్తే తమనీ అనుమానిస్తారేమో నని ఎవరికి వారు సర్దుకుని ఉంటారు.."

"ఏమైతేనేం బద్నామ్ చేశారు. అనధికారికంగా వెలివేశారు" అతడి కళ్ళ నుండి జలజలరాలాయి కన్నీళ్ళు.

"ఎవరూ ఎక్కువకాలం అందర్నీ మోసగించ లేరు. నిజం నిప్పులాంటిది. దానికి చుట్టిన గుడ్డల్ని కూడా చీల్చుకుని బయట పడుతుంది".

నా వంక అనుమానంగా చూశాడు. అప్పుడర్థమైంది నా మాటలకు రెండు వైపులా పదునుందని!

"ఆ రూమర్లు నాటిన వాళ్ళ గురించి అంటున్నాను."

"అదెప్పటికి జరుగుతుందో గాని ఈలోగా నా కెరీర్‌కి గొడ్డలి వేటు అయింది. బాక్సుల్లో ఉన్న మరో డైలీ సీరియల్లో హీరో పాత్ర ఎగిరిపోయింది!"

"మైగాడ్! టీవీరంగంలో ప్రేమలూ, సహజీవ నాలూ ఎక్కువంటారు. అయినా అంతగా అపార్థం చేసుకున్నారా!"

"వాళ్ళు చిమ్మిన విషం అంత శక్తిమంతమైంది!"

"పోతే పోయిందిలే. బంగారంలాంటి ఇంకో అవకాశం తలుపు తడుతుంది".

శుష్కహాసం చేశాడు. "నేను చేస్తున్న 'అగ్ని పరీక్ష' సీరియల్ నుంచీ తీసేశారు?"

"నిజమా? మైగాడ్. దారుణం కదా? అకారణంగా నీ పాత్రని చంపేశారా?"

"అలా చేసివుంటే బాగానే ఉండేది. వేరే నటుణ్ణి తీసుకున్నారు. నన్ను చావుదెబ్బ కొట్టారు.

"ప్రొడ్యూసర్ మీద కంప్లయింట్ చెయ్యలేమా?"

"అప్పుడు పెనం మీంచి పొయ్యిలో పడతాను".

కాసేపు మౌనం వహించి మెల్లగా అన్నాను. "ఇంకేం జరిగినా సరే ధైర్యం సడలనివ్వొద్దు విహాన్. వజ్ర సంకల్పం ఉంటే చాలు నేలకు కొట్టిన బంతిలా అంతెత్తుకు లేస్తావ్".

"నీ మాటలు ముక్కలైన ఆశల్ని ప్రోది చేస్తు న్నాయి. బట్... ఆ ఎఫెక్ట్ నా మీద బలంగా పడింది. దేని మీదా కాన్సన్‌ట్రేట్ చెయ్యలేకపోతున్నాను. ఆర్జెగానూ ఇదివరకట్లా ఉత్సాహంగా చెయ్యలేక పోతున్నా. ప్రోగ్రాం డైరెక్టర్ రెండు సార్లు హెచ్చ రించాడు.." కిటికీలోంచి ఎటో చూస్తూ అన్నాడు.

అదిరాను. బెదిరాను. నలుదెసల్నుంచీ కారు చీకట్లు నా మీద నిర్దాక్షిణ్యంగా దాడి చేస్తున్నాయి. వణికాను. కృంగాను. నిన్నటిదాకా కనిపించిన రంగుల ప్రపంచం హఠాత్తుగా నా కళ్ళముందే కరిగి నీరవు తోంది!

పెళ్ళికి ముందే ఇలా ఎందుకు జరుగుతోంది?

ఇది హెచ్చరికా లేక భవిష్యత్తు సూచనా?

అతడికి ధైర్యం చెప్పి నేను అధైర్యపడటంలో అర్థం లేదు.

"గదిలో ఒంటరిగా ఉంటే ఇలాగే నిరాశగా, నీరసంగా ఉంటుంది గాని అలా బయటికెళ్దాం పద. విశ్వం ఎంత విశాలమైందో తెలిస్తే మన సమ స్యలూ వేదనలూ నలకంత అయిపోతాయి!"

బలవంతాన అతన్ని తీసుకుని ప్రగతినగర్ చెరువు దగ్గరికెళ్ళాను. ఓ బండ మీద కూర్చున్నాం.

"ఈ చెరువునే కదూ అప్పుడెప్పుడో ట్యాంక్ బండ్‌లా తయారుచేస్తామని ప్రకటించింది!" దృష్టి మరల్చడాని కన్నాను.

"ఇవన్నీ మీ డాడీకి తెలిస్తే?" హఠాత్తుగా అన్నాడు విహాన్.

నా భయమూ అదే. నిజానికది భయం కాదు ఆందోళన. అయినా అదేమీ కన్పించకుండా జాగ్రత్త పడుతూ అన్నాను. "ఆయన పక్కా బిజినెస్‌మేన్. ఆటుపోట్లూ లాభనష్టాలూ సహజమని తెలుసు. బ్యాలెన్స్‌షీట్‌లో ప్రాఫిట్టేకాదు లాసూ ఉంటుంది".,

తల పంకించాడు. ఉరకబోతున్న కన్నీటిని బలవంతాన దిగమింగుతున్నాడు.

అతడి తలను నా గుండెలకి హత్తుకుని ఓదా ర్చాలని బలంగా అనిపించింది. అది పబ్లిక్ ప్లేస్ అని గుర్తు రాగా నన్ను నేను నిగ్రహించుకున్నాను.

"నువ్వు అతిగా ఊహించుకుంటున్నావు విహాన్. ఊరికే పిచ్చి ఆలోచనలతో బుర్ర పాడుజేసుకోకు. ఇది కాకపోతే ఇంకోటి. నడవడానికి కాళ్ళుండాలి గాని లోకం నిండా దార్లే. లక్షలూ కోట్లూ సంపా దించలేక పోవచ్చు. తృప్తిగా బతకడానికి సరిపడా సంపాదించడం కష్టమేం కాదు. కొండల్ని పిండి చెయ్యగల యువతరం ప్రతినిధులం. మనకీ అవ రోధాలో లెక్కా. గుండెల నిండా ఆత్మవిశ్వాసం కొలువై

## మనమీదేనర్రోయ్!

సరసి





ఉన్నంతవరకూ నువ్వు హీరోవే. కమాన్. విహాన్! ఎరైజ్! రెస్ట్‌నాట్ టిల్ యూ అచీవ్ యువర్‌గోల్. ఇవి నా మాటలు కాదు. వివేకానందుడు యువతకి ఇచ్చిన సందేశం" అమ్మాజీ స్ఫూర్తితో రెచ్చిపోయాను.

అతడు ఆర్తిగా చూశాడు. ఆశగా చూశాడు. గాఢంగా హత్తుకు పోవాలన్నట్టు చూశాడు.

"నువ్వు నా అదృష్టానివి విజితా.." సూటిగా నా కళ్ళలోకి చూస్తూ అన్నాడు.

"మరింక ఈ విషాదయోగం ఎందుకు పార్థా!"

తల విదిలించాడు. "ఓకే. అన్నీ మర్చిపోతాను" గుండెల్నిండా గాలి పీల్చుకుంటూ అన్నాడు.

"ఇప్పుడు నా విహాన్ వనిపించావ్".

మళ్ళీ మౌనం మా మధ్యకు చొచ్చుకొచ్చింది. చెరువు వంక చూసి చూసి దీర్ఘంగా నిశ్వసించాడు.

"ఒకవేళ నా భయాలే నిజమై నేను పట్టుతప్పి అగాధంలోకి జారిపోతుంటే నా చెయ్యి పట్టుకుని ఆపుతావా లేక నా చెయ్యి వదిలేస్తావా?"

విస్మయంగా చూశాను. "ఏయ్ అదేం ప్రశ్న? వదలడానికా నీ చేయి పట్టుకున్నదీ? చచ్చినా నిన్నూ వదల్ను. నీ చెయ్యీ వదల్ను. దిసీజ్ మై ప్రామిస్!"

విహాన్‌ని వాటేసుకున్నాను.

గుర్తుపెట్టు కుంటాను"

ఆనందంగా నవ్వాను.

"నీ నవ్వుకి.."

"చాలుచాలు. ఇదివరకే ఫిదా అయ్యావుగా!"

నవ్వుకుంటూ చెయ్యీచెయ్యీ పట్టుకుని బయటికి వెళ్తోంటే కొందరాడవాళ్ళు మా వంక ఆసక్తిగా చూశారు.

ఒకావిడ మా ముందుకొచ్చి "మీరు అగ్నిసాక్షి సీరియల్లో నటిస్తున్నారు కదూ? మీ యాక్షన్ నేచురల్‌గా ఉంటుంది. సినిమాల్లో ఎందుకు ప్రయత్నించకూడదు?" అంది విహాన్‌తో.

జనం మూగారు. కరచాలనాలు, సెల్ఫీలు, ఫొటోలు..!

విహాన్ వారి అభిమానానికి పొంగిపోయాడు. జనంలో తన గ్లామర్ చెక్కుచెదర్లేదనుకున్నాడు కాబోలు రీచార్జి అయ్యాడు.

అతడితో బాటు నేనూ పొంగిపోయాను.

"త్వరలో సినిమాల్లోనూ చూస్తారు" అన్నాడు.

•••

ఎంబీఏ పరీక్షలు మొదలయ్యాయి. నేను చదువులో బిజీ అయ్యాను.

మధ్యమధ్య విహాన్ ఫోన్ చేస్తున్నాడు. కొత్త ప్రయత్నాల గురించీ, కొత్త ప్రామిస్సుల గురించీ చెబుతున్నాడు.




"పొరబాటున కూడా నన్ను వదలకు విజితా. నామరూపాల్లేకుండా పోతాను. నాశనమైపోతాను.." ఏడుపు తన్నుకొస్తోంటే కౌగిలి మరింతగా బిగిస్తున్నాడు.

"అలా ఎప్పటికీ జరగదు. నేనీ భూమ్మీద ఉన్నంతవరకూ జరగనివ్వను".

"ఇదిచాలు. ఈ వరం చాలు. జన్మజన్మలకీ నీకు ఋణపడి ఉంటాను"

"అలాగే ఉందువుగాన్లే గాని గెటప్. ఏమైనా తిందువు గాని. ఎప్పుడు తిన్నావో ఏమో!"

మంజీరా మాల్‌కెళ్ళి చికెన్ దమ్‌బిర్యానీ తిన్నాం.

"నీతో కలిసి సినిమా చూడాలని ఉంది విజితా"

"ఛలో.."

"మీ ఇంట్లో ఎదురు చూస్తుంటారేమో?"

"మాది హోటల్ టైపు ఇల్లు"

సినిమా చూస్తున్నంతసేపు అతడు నా చేతులు వదల్లేదు. నా చేతివేళ్ళతో తన వేళ్ళు పెనవేసి పట్టుకున్నాడు.

"నీతో పంచుకున్న ప్రతీక్షణాన్ని జీవితాంతం

కాలేజీలో కొందరు విద్యార్థులు నా వంక అదోలా చూడటం, వంకరగా నవ్వటం గమనించాను.

నా డ్రెస్సువంక చూసుకున్నాను. డిగ్నిఫైడ్‌గా ఉంది. మరెందుకై ఉంటుందబ్బా?

పరీక్ష రాశాక ప్రాంజలితో అన్నాను. "ఇవాళ మన కాలేజీవాళ్ళ చూపుల్లో ఏదో తేడా కనిపిస్తోంది'.

"నీకెలా చెప్పటమా అని నేను తర్జనభర్జన పడుతున్నాను".

"దేని గురించి?"

బ్యాగ్‌లోంచి ఓ వీక్లీ తీసి నా చేతిలో పెట్టింది. "పేజీ నెంబరు 42"

ఆ పేజీలో కెళ్ళాను. మాల్‌లోంచి విహాన్, నేనూ చెట్టపట్టాలేసుకుని వస్తున్న ఫోటో ప్రచురించారు! ఫోటో చిన్నదే. క్లారిటీ తక్కువే. అయినా అందులో ఉన్నదెవరో స్పష్టంగా తెలుస్తోంది.

నిర్ఘాంతపోతూ చదివాను.

'కొత్తపిట్టతో విహాన్ షికార్లు' అని పెట్టిన హెడ్డింగ్ మ్యాటర్ చూసి కుంగిపోయాను.

పాపం విహాన్ ఎలా ఫీలవుతున్నాడో!

"పబ్లిక్‌లో ఉన్నవాళ్ళు ఇమేజ్ డ్యామేజ్ కాకుండా చూసుకోవడం చాలా ముఖ్యం. లేకపోతే చెల్లితో కలిసి కారులో వెళ్ళినా పిచ్చిరాతలు రాసేస్తారు?" ప్రాంజలి అంది.

నాకు పిచ్చికోపం వచ్చేసింది. ఇదివరకు విహాన్ నటీమణుల్తో అసభ్యంగా ప్రవర్తిస్తున్నాడని రాసిందీ ఈ పత్రికే!

వెంటనే ఆ పత్రిక ఎడిటర్‌కి ఫోన్‌చేసి చెడామడా తిట్టేశాను.

"నా అనుమతి లేకుండా నా ఫోటో వేసి కారు కూతలు కూసి నా పరువు తీసినందుకు పోలీసు కేసు పెడతాను. పరువు నష్టం దావా వేస్తాను".

"నిరభ్యంతరంగా వేసుకోవచ్చు...' నిర్లక్ష్యంగా అన్నాడు.

"నేను విహాన్‌కేమవుతానో తెలుసా?"

"మీరు చెబితే మీ వెర్షనూ ప్రచురిస్తాం.."

"మేం త్వరలో పెళ్ళి చేసుకోబోతున్నాం తెలుసా?"

"తెలీదే. అయితే 'పిట్ట'కాదు 'ప్రియురాలు' అని వేయమా?"

"సిగ్గులేదూ!"

"వ్యాపారం చెయ్యడానికి సిగ్గెందుకూ. మీ ప్రవర్తనకి మీరు కదా సిగ్గుపడాల్సింది! పాఠకులు కోరుకునే వార్తలూ విశేషాలూ వేస్తేనే మా పత్రిక హాట్‌కేక్ అవుతుంది. మీ ఇద్దరి సంబంధం గురించి ఇంటర్వ్యూ ఇస్తానంటే చెప్పు ఇప్పుడే మా రిపోర్టర్ని పంపిస్తా.."

ఇంకో తిట్టు తిట్టి లైను కట్ చేశాను.

"బ్లడీ ఇడియట్స్... రోగ్స్... గాలి పోగుచేసే బద్మాష్లు.." రొప్పుతూ అన్నాను.

"నీ దాకా వచ్చిందో లేదోగాని విహాన్ గురించి రకరకాల పుకార్లు వస్తున్నాయి. నువ్వు జాగ్రత్తగా ఉండటం మంచిది. నువ్వు ఎవరి సలహాలూ వినవని తెలుసు. అయినా ఫ్రెండువి గనుక హెచ్చరిస్తున్నాను."

"నువ్వు కూడా అతన్ని అనుమానిస్తున్నావా?"

"అతన్నికాదు, అతడున్న పరిస్థితుల్ని... ఆ గ్లామర్ రంగాన్ని"

"దారుణం!"

"అతడితో నీ ప్రేమవ్యవహారం వల్లే నీ బిజినెస్ బెడ్ ఎక్కింది. లేకపోతే ఈపాటికి రన్ చేస్తూ ఉండేది!"

వెర్రిగా చూశాను. దానికీ దీనికీ సంబంధం ఉండి ఉంటుందా! నాన్న నా ప్రేమ గురించి కావాలనే డబ్బు ఇవ్వటం లేదా?

నాన్నని ప్రశ్నించాలి. సమాధానం రాబట్టాలి!

డిన్నర్ చెయ్యకుండా నాన్నకోసం ఎదురు చూస్తూ కూర్చున్నాను.

"క్లబ్బుకెళ్ళి ఎప్పటికో వస్తారు. భోంచేసి ఎదురు చూడొచ్చు కదే" అంది అమ్మ.

వినిపించుకోలేదు. సోఫాలోనే నిద్రపోయాను.

ఎందుకో మెలకువ వచ్చి చూశాను. నన్నెవరో ఎత్తుకుని తీసుకెళ్తున్నారు. మూతలు పడుతున్న కనురెప్పల కంతలోంచి చూశాను.

నాన్న!

నన్ను మంచం మీద పడుకోబెట్టి దుప్పటికప్పి వెళ్ళిపోయారు.

**(ఇంకావుంది)**




వానరులందరి సహకారంతో నూరు యోజనాల పొడవునా పటిష్టమైన వంతెన నిర్మించాడు నలుడు. ఆ వంతెనను అణువణువూ పరిశీలించి, ఎలాంటి ప్రమాదమూ లేదని చెప్పాడు విభీషణుడు. అప్పుడు కోదండాన్ని ధరించి, రాముడు వంతెనపై ముందుకు నడుస్తోంటే అతన్ని లక్ష్మణ సుగ్రీవులూ, సమస్త వానరసైన్యం అనుసరించింది. లంకాతీరానికి చేరుకున్నారంతా. సముద్రంపై వంతెన నిర్మాణం, లంకకు చేరిన అపార వానర సైన్యం గురించి రావణునికి వివరించాడు శుకుడు. ఆపై తన మాటగా సీతను అప్పగించి, రామునితో సంధి చేసుకోవడమే మేలన్నాడు. అందుకు కోపగించుకున్నాడు రావణుడు. శుకుణ్ణి కసిరి కొట్టి అక్కణ్ణుంచి పొమ్మన్నాడు. వెళ్ళిపోయాడతను. ఒంటరిగా మిగిలాడు రావణుడు. ఎన్నడూ లేనిది అతన్ని ఏదో భయం ఆవహించింది. సన్నగా వణికిపోయాడు.

# రావణ కుతంత్రం:రాముని మాయాశిరస్సు

కొంతసేపు గడిచింది.

గడిచిన ఆ కొంతసేపూ సుదీర్ఘంగా ఆలోచన సాగించాడు రావణుడు. ఆలోచించి, చారులు శుక సారణులనూ, మంత్రులనూ మందిరానికి రప్పించాడు. సముద్రం మీద వంతెన నిర్మాణం గురించీ, వానరసైన్యంతో రాముడు లంకకు తరలి రావడం గురించీ వారితో చర్చించాడు. లంక ఉత్తరతీరంలో రాముడు మజిలీ చేశాడంటూ మంత్రులను చేర పిలిచి, చెప్పాడిలా.

"మీరంతా మారువేషాలతో వెళ్ళి శత్రువుల వివరాలు తెలుసుకుని రండి! ముఖ్యంగా రామ లక్ష్మణులకూ, సుగ్రీవునకూ విశ్వాసపాత్రులైన మంత్రులూ, సేనాపతుల గురించీ కచ్చితమైన సమాచారాన్ని సేకరించుకుని రండి. అలాగే ఋక్ష వానర సైన్యాలెంతమందో మనకు స్పష్టంగా తెలియాలి. అది కూడా తెలుసుకుని రండి."

"అలాగే ప్రభూ"

"వెళ్ళి రండి! మీ రాకకోసం ఇక్కడే నిరీక్షిస్తూ ఉంటాను." అన్నాడు రావణుడు.

రకరకాలుగా ఆలోచించి, చారులూ, మంత్రులూ వానరరూపాలు ధరించారు. బయల్దేరారు అక్కణ్ణుంచి. ఉత్తర తీరానికి చేరుకున్నారు. చేరుకుని, వంతెన దాటుతున్న సేనలనూ, దాటి వచ్చిన సేనలనూ, దాటి వచ్చి వనాలూ, పర్వతాలూ, గుహల్లో మజిలీ చేసిన లెక్కకు మిక్కిలిగా ఉన్న సేనలనూ చూశారు. గుండెలు దిగజార్చుకున్నారు. ఇక వెనక్కి తిరిగి వెళ్ళడం ఉత్తమం అనుకుని వెనుతిరిగేంతలో వారిని గుర్తించాడు విభీషణుడు. పెడరెక్కలు విరచి కట్టాడందరికీ. తీసుకు వచ్చి రాముని ముందు కట్టెల మోపుల్లా పడేశాడు.

"చెప్పండి! ఇక్కడికి మీరంతా ఎందుకు వచ్చారో నిజం చెప్పండి. చెబితే మా రాముడు మిమ్మల్ని క్షమిస్తాడు. అబద్ధాలాడారో అంతేసంగతులు." అన్నాడు. బెదరిపోయారంతా. అబద్ధం ఆడలేకపోయారు. నిజం చెప్పారు. చెప్పి, రాముణ్ణి శరణు కోరారు.

అభయం ప్రసాదించాడు రాముడు. నవ్వుతూ అన్నాడిలా.

"ఇంకా మీరు చూడాల్సిన ప్రముఖులూ, సైన్యసమూహాలూ చాలా ఉన్నాయి. వాటిని మా విభీషణుడు మీకు దగ్గరుండి మరీ చూపిస్తాడు."

ఏం మాట్లాడాలో తెలియలేదు రావణసేవకులికి. తలలొంచుకుని నిల్చున్నారు.

"నాకు ఓ చిన్న సాయం చెయ్యండి! మీ ప్రభువుకి నా మాటగా ఈ రెండు ముక్కలూ వినిపించండి." అన్నాడు రాముడు. చెప్పాడిలా.

"రావణా! ఏ బలగర్వంతో నా ఇల్లాలు సీతను అపహరించావో, అదే బలగర్వాన్ని నీ బంధుబలగాలతోనూ, నీ మంత్రి సామంతులతోనూ చేతనైతే చూపించు. రేపు సూర్యోదయానికి నేనూ, నా సేనలూ నీ నగరాన్ని ముట్టడిస్తున్నాం. నువ్వు నిర్మించిన ప్రాకారాలూ, నువ్వు నిలబెట్టిన తోరణాలూ మమ్మల్నేమీ చెయ్యలేవు. ధ్వంసం చేస్తాం, కాచుకో!"

రాముని నోటి నుంచి సింహగర్జనలా వినవచ్చిన ఆ మాటలకు రావణసేవకులు వణికిపోయారు. ధైర్యం పుంజుకునేందుకు ఒకరిని ఒకరు గట్టిగా పట్టుకున్నారు.

"భయపడకండి" అన్నాడు రాముడు. వారిని బంధవిముక్తుల్ని చేశాడు. వెళ్ళిరండి అని ఆశీర్వదించాడు. రాముని ధర్మదీక్షకు రావణసేవకులు ఆశ్చర్యానందాలు చెందారు. అతనికి జయజయధ్వానాలు పలికి, అక్కణ్ణుంచి పరుగుదీశారు. మందిరంలో వారి కోసమే చూస్తున్న రావణుణ్ణి సమీపించారు. తాము చూసినవన్నీ వివరంగా చెప్పారతనికి. అలాగే రాముని మాట కూడా రావణునికి వినిపించారు.

"ప్రభూ! దిక్పాలురవంటి రామలక్ష్మణ సుగ్రీవ విభీషణులు నలుగురే మన నగరాన్ని నాశనం చేయగలరనిపిస్తోంది. మరో మాటగా చెప్పాలంటే...రాముడు ఒక్కడే ఆ పని చేయగలడనిపిస్తోంది. సైన్యం అంతా కలిసికట్టుగా ఉంది. ఆ సైన్యంతో పోరాడి గెలవడం ఇంద్రునికి కూడా అసాధ్యం అనిపిస్తోంది." అన్నాడు శుకుడు.

"నీకు అనిపించడం కాదు, నాకు అనిపించాలి. రాజుకీ సేవకుడికీ తేడా అక్కడే." అని నవ్వాడు రావణుడు.

"ప్రభూ! మహావీరులతోనూ, వారి సైన్యాలతోనూ యుద్ధం మంచిది కాదు. ఇలా చెబుతున్నానని నువ్వేమీ అనుకోకపోతే ఓ చిన్న మాట! కోపావేశాలను నిగ్రహించుకుని, శాంతి వహించి, సీతాసాధ్విని రాముడికి అప్పగించడమే అన్నివిధాలా మనకిప్పుడు మంచిదనిపిస్తోంది. ఆలోచించి నిర్ణయం తీసుకో." అన్నాడు శుకుడు.

"పదే పదే అదే మాట! నీలో వీరత్వం చచ్చిపోయింది. భయం ఆవహించింది. అందుకే నోటికొచ్చినట్టల్లా మాట్లాడుతున్నావు." అన్నాడు రావణుడు. శుకునిపై కోపగించుకున్నాడు.

"లోకాలన్నీ ఏకమై ఎదిరించినా నేను భయపడను. దేవ యక్ష కిన్నర గంధర్వులు ఆ రామునికి అండగా నిలిచి పోరాడినా నేను సీతను అప్పగించను." అన్నాడు రావణుడు. తల్పంపై కూర్చున్నాడు. కళ్ళు మూసుకున్నాడు. చేతివేలితో శూన్యంలో గీతలు గీస్తూ దీర్ఘంగా ఆలోచించాడు. ఒక్కసారిగా కళ్ళు తెరిచాడు.

"పదండి! ముందు రాముని సేనావాహినిని చూద్దాం." అన్నాడు. దిగ్గున లేచి నిలబడ్డాడు. వందలాదిగా గల మహాసౌధం మెట్లెక్కి మిద్దె మీదకు చేరుకున్నాడు. అక్కణ్ణుంచి వానరసేనావాహినిని చూశాడు.

"ఆ వానరసేనలో ఎవరెవరు ప్రముఖులు? వారి బలపరాక్రమాలేమిటి?" శుకుణ్ణి అడిగాడు రావణుడు. చెప్పాడు శుకుడు.

"వారి మధ్యలో ఆకాశరంగులో మెరిసిపోతున్న ఆ వ్యక్తి ఎవరు?" అడిగాడు రావణుడు.

"జడలు ధరించి, మహాకోదండం పట్టుకుని ఆకాశరంగులో మెరిసిపోతున్న ఆ వ్యక్తే రాముడు." చెప్పాడు శుకుడు.

"రా...ము...డు" అక్షరాల్ని విడివిడిగా కసికసిగా పలికాడు రావణుడు.

"పెద్దపెద్ద కళ్ళతో చుట్టూ కలియజూస్తున్న ఆ రాముడే ఇక్ష్వాకుల్లో మహారథుడు. వేదవేదాం

గాల్లో పండితుడు. ధర్మాత్ముడు. బ్రహ్మాస్త్రాది మహాస్త్రాలలో మేటి. కోపించాడా...మృత్యువు వంటి భయంకరుడు." చెప్పాడు శుకుడు.

కళ్ళు పెద్దవి చేసి కోపంగా చూశాడు రావణుడు. అయినా చెప్పడం తన ధర్మం అన్నట్టుగా చెప్పసాగాడు శుకుడు.

"రాముడికి కుడి వైపున ఉంగరాల జుత్తుతో ఉండి, బంగారురంగులో మెరిసిపోతున్న వీరుడే రాముని తమ్ముడు లక్ష్మణుడు. అతను రాముడికి కుడిచేయి వంటివాడు. అతనికి ఆరోప్రాణం వంటి వాడు. కేవలం రామసేవకే జన్మించిన వాడు. అతని పక్కగా నిల్చున్న సువర్ణమాల ధరించిన వీరుడు, వాలితో సమాన విక్రముడు, నేల నాలుగు దిక్కుల్లోగల ఋక్ష వానర సమూహాలకు ప్రభువు... సుగ్రీవుడు."

సరిసరే అన్నట్టుగా తలాడించాడు రావణుడు.

"సుగ్రీవునికి దగ్గరగా నలుగురు మంత్రులతో నిల్చుని మాట్లాడుతున్న వీరుడెవరో తెలుసా? నీ సోదరుడు విభీషణుడు." అన్నాడు శుకుడు.

"విభీషణుడా! ఎంత ఉత్సాహంగా ఉన్నాడు? వెరపన్నదే వాడిలో లేదు." అన్నాడు రావణుడు.

"ఎందుకు ఉంటుంది ప్రభూ? రాముడి అండలో ఉన్నాడు. పైగా లంకారాజ్యం అతని సొంతం చేస్తానన్న రామశపథం విన్నాడు. వినడమే కాదు, అనంత సేనావాహిని మధ్య లంకా రాజ్యానికి పట్టాభిషిక్తుడు కూడా అయ్యాడు. అలాంటివాడికి వెరపెందుకు ఉంటుంది? ఉండేదంతా ఉత్సాహమే! ఆ ఉత్సాహంతోనే నీతో పోరాడేందుకు సిద్ధమవుతున్నాడు." అన్నాడు శుకుడు.

బాధనిపించింది రావణునికి. తమ్ముడు విభీషణునితో యుద్ధం తగదనిపించింది. చేతివేళ్ళు నలుచుకున్నాడు.

"ప్రభూ! అందరూ మహావీరులూ, శూరులూ. వారితో యుద్ధం మనకే ప్రమాదం. అందుకే మళ్ళీ చెబుతున్నాను, ఆలోచించు ప్రభూ! యుద్ధం అవసరమా?" అడిగాడు శుకుడు. మాట పూర్తి కానే లేదు. అతని చెంప చెళ్ళమనిపించాడు రావణుడు. నిప్పులు చిమ్ముతున్న కళ్ళతో చూశాడు.

"యుద్ధం అవసరం కాదు. అత్యవసరం. యుద్ధంలోనే బలాబలాలు తెలుతాయి. నాకు కావాల్సింది, సలహాలు కాదు, శత్రుసైన్యసంగతులు కావాలి. అంతే! అంతకు మించి మాట్లాడితే ఒప్పుకోను." అన్నాడు రావణుడు. చరచరా మిద్దె దిగి, మందిరంలోనికి చేరుకున్నాడు.

తల్పం మీద శయనించి విశ్రాంతి తీసుకుందామనుకున్నాడు. కాని, కన్ను మూతపడదే! లేచి కూర్చున్నాడు. శత్రుసైన్యాన్ని పరిశీలించి, వారి వివరాలు వినడంతో ఆందోళనగా ఉంది అతనికి. దేనిమీదా మనస్సు నిలవడం లేదు. శుక సారణులు కాదు, తన మనసెరిగి ప్రవర్తించే శార్దూలుడులాంటి చారులిప్పుడు కావాలనుకున్నాడు రావణుడు. అలాంటి వారిని సభాముఖానికి రప్పించుకున్నాడు.

"ఆజ్ఞ ప్రభూ" శార్దూలుడూ, ఇంకా మరి కొందరు చారులు చేతులు జోడించి, నమస్కరిస్తూ నిల్చున్నారు.

"మీరంతా వెళ్ళి రాముణ్ణి క్షణక్షణమూ కనిపెట్టుకుని ఉండండి. అతనికి ఆప్తులు ఎవరు? ఆత్మీయులు ఎవరు? ఏ సమయానికి మేల్కొంటాడతను? ఏ సమయంలో నిద్రపోతాడు? ఎప్పుడు ఏఏ పనులు చేస్తాడు? అతనికి కాపలా ఎవరు? అలాగే లక్ష్మణుణ్ణి కూడా ఓ కంట కనిపెట్టుకుని ఉండండి. వారి రక్షణ ఏర్పాట్లు కూడా గమనించి రండి." చెప్పాడు రావణుడు.

"ఈ క్షణమే బయల్దేరండి." ఆజ్ఞాపించాడు.

రాజాజ్ఞను అనుసరించి శార్దూలాదులు మారువేషాలు ధరించారు. వెళ్ళి రామసుగ్రీవులు ఉండే ప్రాంతాల్లో సంచరించసాగారు. మారువేషాల్లో ఉన్న రావణచారులను గుర్తించారు విభీషణుని మంత్రులు. పట్టుకున్నారు వారిని. ముఖ్యుడైన శార్దూలుణ్ణి బంధించి, అతన్ని వానరులకు అప్పగించారు. మిగిలిన వారిని జాలి తలచి విడిచిపెట్టారు.

శార్దూలుణ్ణి వానరులు చావమోదారు. వాడి కాళ్ళూ చేతులూ మెలిపెట్టారు. బాధ భరించలేక పోయాడు శార్దూలుడు. గగ్గోలుగా ఏడవసాగాడు.

**మారువేషాలు ధరించి అపారమైన వానరసైన్యంలో కలిసిపోయిన రావణ చారులనూ, మంత్రులనూ విభీషణ మంత్రులు గుర్తించారు. వారిని పెడరెక్కలు విరిచి కట్టిపడేశారు. రాముడిచ్చిన అభయంతో నిజంచెప్పి శరణు కోరారు. సింహగర్జనలా రామునినోటి వెంట వినవచ్చిన హెచ్చరికను పరిగెత్తుకెళ్ళి రావణుడికి వినిపించారా చారులు. అప్పుడు రావణుడేం చేశాడు?**

అతని ఏడుపు వినలేకపోయాడు రాముడు. జాలి చెందాడు. బంధవిముక్తుణ్ణి చేశాడతన్ని.

"వెళ్ళిపో! నా సైనికులు నిన్ను నానా హింసలూ పెట్టకముందే ఇక్కణ్ణుంచి పారిపో." అంటే...పారిపోయాడు శార్దూలుడు. పారిపోయి సభామండపానికి చేరుకున్నాడు. మంత్రిమండలితో చర్చిస్తున్న రావణుణ్ణి సమీపించాడు.

"ప్రభూ! సకలసైన్యంసహా రాముడు సువేలాద్రికి చేరుకున్నాడు." అన్నాడు. శత్రువు అతి సమీపానికి వచ్చాడయితే! రానీ అనుకున్నాడు రావణుడు. ఆందోళన కప్పిపుచ్చుకున్నాడు. వివరాలు ఇంకా చెప్పమన్నట్టుగా శార్దూలుణ్ణి చూశాడు.

"ప్రభూ! పర్వతాల వంటి వానరులు రామునికి పహారా కాస్తున్నారు. వారిని చూసేందుకే భయం వేస్తోంటే నోరు తెరచి వారితో ఏం మాట్లాడగలం? అందుకే వారితో మనవారు ఎవరూ ఏమీ మాట్లాడలేదు. తెలివిగా అందరం గుడారాల్లోకి ప్రవేశించాం. అక్కడా ఇక్కడా సంచరిస్తూ ఆనుపానులు తెలుసుకుంటుంటే విభీషణుని మంత్రులు గుర్తించి నన్ను పట్టుకున్నారు. వానరులకు అప్పగించారు. వారు నన్ను కొట్టని దెబ్బలేదు. పెట్టని హింస లేదు. తట్టుకోలేక ఏడుస్తోంటే కరుణించి రాముడు వదలమంటే వదిలారు. ప్రాణాలతో బయటపడ్డాను." అన్నాడు శార్దూలుడు.

"చాల్లే నువ్వూ, నీ పిచ్చిమాటలూ." అన్నాడు రావణుడు. అసహ్యించుకున్నాడతన్ని.

"ప్రభూ! రాముడు గరుడ వ్యూహాన్ని తీర్చిదిద్దాడు. కోదండాన్ని ధరించి గుమ్మం ముందు నిల్చున్నాడు. నేడో రేపో కోతిమూకలు మన ప్రాకారాల్ని ఆక్రమిస్తాయి. అందుకని బాగా ఆలోచించి యుద్ధమా? లేదంటే సంధి చేసుకుని సీతమ్మను రామునికి అప్పగించడమా? అన్నది నువ్వే నిర్ణయించుకో." అన్నాడు శార్దూలుడు.

"నోర్ముయ్" అన్నాడు రావణుడు. సంధి, సీతను రామునికి అప్పగించడం లాంటి మాటలు అతను భరించలేకపోయాడు. కట్టలు తెంచుకున్న కోపంతో అరిచాడలా.

"చారులు చారుల్లా ప్రవర్తించడం లేదు. రాముడికి తాబేదారుల్లా ప్రవర్తిస్తున్నారు. తట్టుకోలేకపోతున్నాను." అన్నాడు రావణుడు.

"వెళ్ళిక్కణ్ణుంచి. నీ ముఖం నాకు చూపించకు." అన్నాడు. సరేనన్నట్టుగా తల వంచుకుని వెళ్ళిపోయాడక్కణ్ణుంచి శార్దూలుడు.

శత్రువు సముద్రం దాటడమే కాదు, సైన్య సమేతంగా సువేలాద్రికి చేరాడన్న వార్తను జీర్ణించుకోలేకపోతున్నాడు రావణుడు. ఏం చెయ్యాలిప్పుడు? శత్రువును ఎలా ఎదుర్కోవాలి? మంత్రులతో మంచీ చెడూ చర్చించాడు రావణుడు. చర్చలో ఏదీ కొలిక్కి రాలేదు. దాంతో మంత్రులని చూడకుండా వారిపై కూడా కోపగించుకుని అక్కణ్ణుంచి మందిరానికి చేరుకున్నాడు రావణుడు.

తల పేలిపోతున్నట్టుగా ఉంటే...సురాపానం చేశాడు. రాముణ్ణి గెలవడం కష్టం. ఎలాగైనా యుద్ధాన్ని తప్పించాలనుకున్నాడు. అలాగే సీతను లోబరుచుకునేందుకు ఓ తంత్రాన్ని ఆలోచించాడు. ఆ తంత్రం ఫలిస్తే రామలక్ష్మణులు ఆత్మహత్య చేసుకుంటారు. నాయకులు ఆత్మహత్యలు చేసుకుంటే కోతిమూకలేం చేస్తాయి? తోకముడిచి పారిపోతాయి అనుకున్నాడు రావణుడు. తంత్ర సాధనకు మంత్రగాడూ, మాయావీ విద్యుజ్జిహ్వుణ్ణి రమ్మని కేకేశాడు.

"విద్యుజ్జిహ్వా! నీ తెలివితేటలన్నీ ప్రదర్శించే రోజొచ్చింది. నీ వంచనాశిల్పంతో సీతను నమ్మించే సమయం వచ్చింది. రాముని తలవంటి శిరస్సునూ, అతని కోదండం వంటి ధనుస్సునూ వెంటనే తయారు చెయ్యి."

"ఆజ్ఞ" అన్నాడు విద్యుజ్జిహ్వుడు.

"తయారు చేసి రెంటినీ సిద్ధంగా ఉంచుకో! సాయంత్రం సీతను చూసేందుకు నేను అశోక వనానికి వెళ్తాను. అప్పుడు నిన్ను పిలుస్తాను. పిలుపు అందుకుని తయారుచేసిన మయాశిరస్సుతోనూ, కోదండంతోనూ నువ్వు అక్కడికి రావాలి.



వచ్చి వాటిని సీతకు చూపించాలి. చాలు! అంతటితో నీ పని ముగిసినట్టే." అన్నాడు రావణుడు.

"ఈ కార్యాన్ని నువ్వు విజయవంతంగా నిర్వహిస్తావనే నమ్మకం నాకు ఉంది. అందుకు ముందుగా ఈ బహుమతులు అందుకో." అన్నాడు రావణుడు. మెడలోని అమూల్యాభరణాలు తీసి, విద్యుజ్జిహ్వానికి కానుకగా సమర్పించాడు.

సాయంత్రం అయింది.

రావణుడు అశోకవనానికి చేరుకున్నాడు. రామనామాన్ని జపిస్తూ తలవంచుకుని కూర్చున్న సీతను సమీపించాడు.

"సీతా" అని ప్రేమగా పిలిచాడు. ఆ పిలుపునకు శరీరం మీద జెర్రులు పాకినట్టె నిలువునా వణికిపోయింది సీత. తప్పనిసరై తలెత్తి చూసింది.

"నీకు ఓ ముఖ్యమైన మాట చెప్పాలనే వచ్చానిక్కడికి. ఎవరంటే నీకు ఇష్టమో, ఎవరినైతే మనస్సంతా నింపుకుని ఇన్నాళ్ళూ నన్ను కాదంటున్నావో ఆ రాముణ్ణి, నీ రాముణ్ణి నిన్న రాత్రి మా ప్రహస్తుడు చంపేశాడు." అన్నాడు రావణుడు.

"అబద్ధం" అన్నది సీత.

"నిజం సీతా! నేను అబద్ధం చెప్పట్లేదు. నిన్న సాయంత్రం రామలక్ష్మణ సుగ్రీవులు వానరసేనలతో దక్షిణసముద్రతీరం చేరారు. చాలా దూరం నుండి నడచి వచ్చారేమో! బాగా అలసిపోయారేమో! ఎక్కడివారక్కడే నేలపైబడి ఒళ్ళు మరచి నిద్రపోయారు. ఆ వార్త చారుల వల్ల తెలుసుకున్న నా సైన్యాధ్యక్షుడు ప్రహస్తుడు ఏం చేశాడంటే..."

"ఏం చేశాడు?"

"అర్ధరాత్రి సేనలతో పోయి, గురకపెట్టి నిద్రిస్తున్న నీ రాముణ్ణి వధించి వచ్చాడు."

"నమ్మను! నమ్మలేను." గట్టిగా అరుస్తూ చెవులు మూసుకుంది సీత.

"నువ్వు నమ్మాలి సీతా! నమ్మి తీరాలి. నీ రాముణ్ణి ప్రహస్తుడు వధిస్తోంటే అతను భీకరంగా కేకలు వేస్తోంటే నీ మరిది లక్ష్మణుడేం చేశాడో తెలుసా? కోతులతో పరిగెత్తి పారిపోయాడక్కణ్ణుంచి. పారిపోయినా, ప్రహస్తుని సేనలు వారిని వదల్లేదు. వెంటబడి సుగ్రీవ హనుమంత జాంబవంతుల్నీ, అంగద, మైంద, ద్వివిద, పనస, దధిముఖ, కుముదాదుల్నీ ముక్కలుగా నరికి పోగులు పెట్టారు. అది చూసి, భయపడి, ఆకాశానికి ఎగిరి కిందపడి కొన్ని కోతులు మరణిస్తే, మరికొన్ని కోతులు సముద్రంలో పడి మరణించాయి. దక్షిణ తీరం అంతా శవాలగుట్టలు. నేను కళ్ళారా చూసిందే చెబుతున్నాను. నీ రాముని దండయాత్ర మా ప్రహస్తుని చేతిలో నలిగి ఇలా నాశనం అయింది." అన్నాడు రావణుడు.

భగవంతుడా అంది సీత. ఆకాశానికేసి చూసి తల బాదుకుంది. ఏడవసాగింది.

"ఇదిగో! ఈ ఏడుపుల కారణంగానే నీ రాముడు అలా అంతమయ్యాడు. పోయినవాడు పోయాడు. తిరిగి రాడు. వాడికోసం ఏడ్చి లాభం లేదు. అందుకని బుద్ధిగా ఆలోచించు! శోకాన్ని వదలి శాశ్వతంగా నా దానివి కా! నా పట్టపురాణివై నన్నూ, నా రాణులనూ పాలించు." అన్నాడు రావణుడు.

"నీచుడా" అంది సీత. రావణుణ్ణి అసహ్యించుకుంది.

"నీ నాటకాలు నా దగ్గర కాదు." అంది.

"నా మాటలు మీద నీకు నమ్మకం లేదు కదూ? అయితే చూడు." అన్నాడు రావణుడు. విద్యుజ్జిహ్వాని కేకేశాడు. వచ్చాడతను. అతని చేతిలో రాముని మాయాశిరస్సూ, కోదండమూ ఉన్నాయి.

"ఈ పిచ్చి సీత నా మాటలు నమ్మడం లేదు. చూపించవి." అన్నాడు రావణుడు.

చేతిలోని రాముని శిరస్సునూ, కోదండాన్నీ సీతకి చూపించాడు విద్యుజ్జిహ్వుడు. తర్వాత వాటిని సీత ముందు ఉంచి, తల వంచుకుని అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు.

**-అరణి**

# మలివయసులో మరుపువ్యాధి



**మనిషి ఎన్నో సుఖాల్ని అనుభవిస్తాడు. తనకు తిరుగులేదంటాడు. తుళ్ళిపడతాడు. దేనికీ తలవంచేది లేదని గర్వపోతాడు. కానీ కరిగిపోతున్న జీవితకాలం అతన్ని వృద్ధాప్యానికి చేరువ చేస్తోందనీ, దానికి తలవంచక తప్పదనీ విస్మరిస్తాడు. వర్తమానానికీ గతానికీ మధ్య ఏది నిజమో తెలియకుండా కాలం గడపాల్సి వస్తుందా వయసులో. నెమ్మది నెమ్మదిగా వయసుతో పాటు గతం, వర్తమానం గుర్తుండదు. కొన్నాళ్లకి పలుకూ పాటా కూడా పోయి మంచానికే అకింతమైపోతారు. స్నానం, అన్నపానీయాలు వంటి దైనందిన కార్యక్రమాల్లో ఏం చేస్తున్నారో కూడా తెలియనిస్థితికి దిగజారుతుంది వారి ప్రవర్తన. ఈ పని చేస్తున్నాం అన్న కనీస స్పృహ లేకుండా కాలం వెళ్ళదీస్తుంటారు. అలాంటి వ్యక్తులు మన ఇళ్ళల్లో ఎవరో ఒకరైనా ఉండే ఉంటారు.**

ప్రపంచంలో ఎలాంటి జబ్బులకైనా మందులున్నాయి. ముందుగా గుర్తిస్తే కొన్ని జబ్బులకు సరైన చికిత్సతో ప్రమాదం నుంచి గట్టెక్కించగలం. దీర్ఘకాలిక రోగాలకు మందులున్నాయిగానీ వృద్ధాప్యాన్ని అడ్డుకునే మందులు ఇప్పటివరకు రాలేదు. అలాంటి వృద్ధాప్యానికి చికిత్సలేని జబ్బు తోడైతే ఆ వ్యక్తి పరిస్థితేంటి? ఒక్కసారి ఆలోచించండి? అదేం వ్యాధి అనేనా మీ డౌటు! దానిపేరే అల్జీమర్స్! వయసుతో పాటు వచ్చే మతిమరుపు వ్యాధి.

### పరిశోధనలు

మన జీవితం ఎంత హాయిగా గడుస్తుందో తెలియాలంటే మలివయసులో మన మెదడెంత బాగా పనిచేస్తోందన్న దాని మీదే ఆధారపడి



ఉంటుంది. పెద్దవాళ్లయ్యాక ఎలాంటి కష్టాలూ రాకూడదని ముందునుంచే అనేక రకాల బీమా పాలసీలు చేసి డబ్బు దాచుకుంటాం. పెద్ద పెద్ద ప్రణాళికలు వేసుకుంటాం. కేవలం డబ్బు దాచుకుంటే సరిపోతుందా? ఆరోగ్యం కూడా ముఖ్యమే కదా! శారీరకంగా ఏమైనా సమస్యలుంటే అధిగమించవచ్చేమో కానీ మెదడు మొరాయించి సరిగ్గా పనిచేయకపోవడం మొదలైతే మాత్రం తట్టుకోవడం చాలా కష్టం. అందుకే ఈ విషయమ్మై మలివయసులో వచ్చే అల్జీమర్స్‌పై ఇప్పటికే పెద్ద ఎత్తున పరిశోధనలు జరుగుతున్నాయి.

ప్రస్తుతం ప్రపంచంలో 65 ఏళ్లకు పైబడిన వారిలో అయిదు శాతం మంది ఈ వ్యాధి బారిన పడుతున్నారని అంచనా. ఈ వ్యాధి ముఖ్య లక్షణం క్రమక్రమంగా జ్ఞాపకశక్తి క్షీణించడం. మతిమరుపు అన్నది మన అందరిలో కొద్దో గొప్పో ఉంటూనే ఉంటుంది. వయసు పైబడే కొద్దీ అది కాస్త ఎక్కువ అవుతుంది. ఆ ఎక్కువవడం అన్నది ఈ వ్యాధిగ్రస్తుల్లో ఎంత ఎక్కువగా ఉంటుందంటే ఈ మతిమరుపుతో రోజురోజుకి వారి దైనందిక జీవితం దుర్లభంగా మారుతుంది. ఏదీ గుర్తుండదు. అన్నం తినడం, స్నానం చేయడం లాంటి చిన్న చిన్నపనులు కూడా మరిచిపోతారు. కట్టుకున్న భార్యనీ, కన్న కొడుకునూ గుర్తుపట్టలేకపోతారు. వారు కనిపిస్తే ఎవరు మీరు? అని అడగడం ప్రారంభిస్తారు. కష్టపడి గుర్తుచేస్తే గుర్తొస్తుంది. మళ్లీ అంతలోనే మరిచిపోతారు!

# విటమిన్ బితో అల్జీమర్స్‌కు చెక్!



ముసలితనంలో వచ్చే డెమెన్షియా, అల్జీమర్స్ వంటి జబ్బులను రాకుండా చూసుకోవాలంటే సరైన పోషకాహారం, ప్రధానంగా విటమిన్ బి పుష్కలంగా ఉన్న ఆహారం తీసుకోవాలని నిపుణులు చెప్తున్నారు. ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ పరిశోధకులు ఈ వ్యాధుల నివారణకు చేసిన పరిశోధనలో ఈ విషయాన్ని వెల్లడించారు. రోజూ నిర్ణీత పరిమాణంలో విటమిన్ బి ఉన్న ఆహారం తీసుకుంటే ముసలితనంలో వచ్చే జ్ఞాపకశక్తి తగ్గిపోయే సమస్యను సమర్థంగా ఎదుర్కోవచ్చని పేర్కొన్నారు. ఈ అధ్యయనంలో భాగంగా పరిశోధకులు 250 మందిని పరిశీలించారు. వీరిలో 70 ఏళ్ల దాటి స్వల్పంగా వినికిడి సమస్య ఎదుర్కొంటున్నవారు కూడా ఉన్నారు. వారిలో కొంతమందికి సహజ ఆహారమైన ధాన్యాలు, అరటిపండ్లు, మాంసం, బీన్స్‌లో దొరికే విటమిన్ బి ఇచ్చారు. మరికొంత మందికి విటమిన్ బి మాత్రలను ఇచ్చారు. మాత్రల రూపంలో తీసుకునే వారికంటే అసలైన ఆహారం ద్వారా విటమిన్ బిని తీసుకునే వారిలో మెదడు క్రియాశీలత పెరగడాన్ని గుర్తించారు.

### మతిమరుపు ఓ హెచ్చరిక

మతిమరుపు ఏ వయసువారికైనా సహజం. అయితే వయసుతో పాటే విషయగ్రహణ శక్తి ఎంతో కొంత సన్నగిల్లడం సహజమైన ప్రక్రియ.

మామూలు జీవితానికి ఇబ్బంది లేకుండా ఉండే మతిమరుపు వల్ల జీవితంపై అంత పెద్దగా ప్రభావం ఉండకపోవచ్చు. ఇలాంటి మతిమరుపును మైల్డ్ కాగ్నిటివ్ ఇంపెయిర్‌మెంట్ అంటారు. అయితే ఇదే క్రమేపీ ముదురుతూ ఉంటే మాత్రం తీవ్రస్థాయి మతిమరుపు రావడానికి అదో ముందస్తు హెచ్చరిక అని గుర్తించి జాగ్రత్త పడాలి. అంటే క్రమక్రమంగా చిన్న చిన్న విషయాలు మరిచిపోయే లక్షణం ముదురుతూ ఉంటుందన్నమాట. ఈరకం స్థితి నుంచి డెమెన్షియా రావచ్చు. డెమెన్షియా అంటే వారేం చేస్తున్నారో వారే గుర్తించలేని పరిస్థితి. అల్జీమర్స్ ముదిరి పాకాన పడే స్థాయిని డెమెన్షియా అని చెప్పవచ్చు. ఈరకం పరిస్థితి రావడానికి మూడింట రెండొంతుల మందికి అల్జీమర్స్ వ్యాధే కారణం.

### ఎలా వస్తుందంటే

వృద్ధాప్యంలో మతిమరుపు సమస్యలకు వివిధ రకాల అంశాలు కారణమవుతాయి. వైద్యశాస్త్రం ప్రకారం ముఖ్యంగా రెండు కారణాలవల్ల అల్జీమర్స్ సమస్య వస్తుంది. మెదడులో అత్యంత కీలకమైన నాడీ కణాల మధ్యలో కొన్ని రకాల ప్రొటీన్లు పేరుకుపోయి ఆయా నాడీ కణాలు, వాటి మధ్య అనుసంధానాలు దెబ్బతినిపోవడం ఒక కారణం. ఇక రెండో కారణం, మెదడులోని రక్తనాళాలు దెబ్బతిని, వాటిలో రక్తప్రవాహం సరిగా లేకపోవడం మూలంగా మెదడు కణాలు క్షీణించడం. సాధారణంగా 60 ఏళ్ల లోపు వారికి ఈ సమస్యలు రావడం తక్కువే. కానీ 60 - 70 ఏళ్ల మధ్య వయసులో మాత్రం ఈ కేసుల సంఖ్య గణనీయంగా పెరుగుతోందని సర్వేలు వెల్లడిస్తున్నాయి. 70 - 80 ఏళ్ల మధ్య వయసు వచ్చేసరికి దాదాపు 5 శాతం మందికి, 80 దాటితే 25 నుంచి 30 శాతం మందిలో కూడా ఈ సమస్య కనపడుతోంది. కాబట్టి 80 ఏళ్ళు పైబడిన వారి సంఖ్య పెరిగిన కొద్దీ ఈ తరహా సమస్యల భారం కూడా పెరుగుతోందన్నది సుస్పష్టం.

### మెదడుకు పదును పెడితే

అల్జీమర్స్ ఉన్నవారు జ్ఞాపకశక్తి పెంపొందించుకునే విషయాలపై ఎక్కువ శ్రద్ధ పెట్టాలి. అంటే పదసంబంధం, సుడోకు లాంటి పజిల్స్ నింపడం, చదరంగం ఆడడం, వర్డ్ గేమింగ్ లాంటివి చెయ్యాలి. పుస్తకాలు ఎక్కువగా చదవాలి. ఒంటరితనం ఫీల్ అవకూడదు. మనసును ఎప్పుడూ బిజీగా ఉంచాలి. వీలైనంత ఎక్కువ సమయం వివిధ రకాల పనులకే కేటాయిస్తూ ఉండాలి. అయితే కేవలం మెదడుకు పదును పెట్టే పనులు ఒక్కటే చాలవు.

మెదడు మన శరీరంలో ఒక సున్నితమైన అవయవం. దానికి తగినంత ఆక్సిజన్ అవసరం. అంతేకాదు దానికి కావల్సిన పోషకాలు, శక్తి అందేలా చూడడం కూడా ముఖ్యం. మెదడులో నాడీకణాలకు ఈ ఆక్సిజన్, పోషకాలు అందాలంటే వాటికి రక్త సరఫరా సాఫీగా జరగాలి. అందుకోసం మెదడులోని రక్తకణాలు, మెదడులోని రక్తనాళాలు ఆరోగ్యంగా ఉండడం చాలా అవసరం. అవి ఆరోగ్యంగా ఉండాలనుకుంటే ముందుగా పొగ తాగడం మానేయాలి, తినే ఆహారంలో కొలెస్ట్రాల్ స్థాయి ఎక్కువ లేకుండా చూసుకోవాలి. షుగరు, బీపీలాంటివి రాకుండా లేదా నియంత్రణలో ఉండేలా చూసుకోవాలి. వీటన్నింటినీ కంట్రోల్‌లో ఉంచుకున్న వారిలో మతిమరుపు లక్షణాలు తక్కువ స్థాయిలో కనిపిస్తున్నట్లు అనేక అధ్యయనాల్లో వెల్లడైంది. అంతే కాదు మేధోసంపత్తి క్షీణించిపోకుండా శారీరక వ్యాయామం కూడా అడ్డుకుంటుంది. కాబట్టి శారీరక వ్యాయామమూ ముఖ్యమే.

### సరైన ఆహారం తినాలి

విటమిన్ సి, ఇ, ఫోలేట్ వంటి బి విటమిన్లు, ఒమేగా 3 ఫ్యాటీ ఆమ్లాలు ఇవన్నీ మెదడుకు అవసరమైన పోషకాలు. మన ఆహారంలో వీటిని సమృద్ధిగా తీసుకోలేకపోతే అల్జీమర్స్ మరింత ఎక్కువ పెరిగే అవకాశాలున్నాయి. అలాగని వీటిని మాత్రల రూపంలో లేక మందుల రూపంలో తీసుకున్నంత మాత్రాన సరైన ప్రయోజనాలు వస్తాయనుకుంటే పొరపాటే. సాధ్యమైనంత వరకు పండ్లు కూరగాయలూ వంటి ఆహార పదార్థాల రూపంలోనే ఈ పోషకాలన్నింటినీ తీసుకోవాలని వైద్యులు చెప్తున్నారు. ఇంకా మెదడును చురుగ్గా ఉంచే పనులు చేయాలి. నిత్యం, ఆరోగ్యకరమైన జీవనశైలిని అనుసరించడం వల్ల ముసలితనంలో కూడా నిండైన ఆనందమయ జీవితాన్ని గడపడానికి ఈరెండూ ముఖ్యమన్నది పరిశోధకుల సలహా.

**- విజేత దహగాం**

# ఆరెంజ్ జ్యూస్‌తో అల్జీమర్స్ మాయం!



అల్జీమర్ వ్యాధికి చెక్ పెట్టాలా? అయితే రోజూ ఒక గ్లాస్ ఆరెంజ్ జ్యూస్ తాగాలని ఆరోగ్య నిపుణులు సూచిస్తున్నారు. రోజూ గ్లాసు ఆరెంజ్ జ్యూస్ తీసుకుంటే అల్జీమర్స్ వ్యాధికి చెక్ పెట్టవచ్చునని స్వీడన్ పరిశోధకులు నిర్వహించిన ఒక తాజా అధ్యయనంలో తేలింది. ఆరెంజ్ జ్యూస్‌లో ఉన్న సి విటమిన్ శరీరానికి ఎంతో అవసరం. అది అల్జీమర్స్ వ్యాధిని దూరం చేస్తుందని స్వీడన్ పరిశోధకులు చెబుతున్నారు. ఆరెంజ్‌లోని సి విటమిన్లు అల్జీమర్ వ్యాధికి చెక్ పెట్టేందుకు ఎంతగానో ఉపయోగపడుతుందని లండన్ విశ్వవిద్యాలయం నిర్వహించిన అధ్యయనంలో తేలింది. రోజూ ఒక గ్లాసు ఆరెంజ్ జ్యూస్ తాగడం ద్వారా శరీరానికి కావలసిన పోషకాలతో పాటు టాక్సిక్ ఆమ్లాలు, ప్రొటీన్ల శాతాన్ని పెంచుకోవచ్చు. ఈ జ్యూస్ తాగడం వల్ల మెదడు సంబంధిత వ్యాధులు కూడా దరిచేరవని అధ్యయనంలో వెల్లడైంది.




# అరవింద @ బ్యాడ్‌గర్ల్?

**ముప్పైయేళ్ళ క్రితం ఇంట్లోంచి వెళ్ళిపోయింది అరవింద. ఆమె జాడ కనిపెట్టాలని డిటెక్టివ్ శరత్‌ను ఆశ్రయించాడు అభయ్. సడన్‌గా ఆమె సంతానం వచ్చి అడిగితే ఆస్తిలో వాళ్ళకీ భాగం ఇవ్వాల్సి వస్తుంది. అందుకే ఆమెను వెంటనే వెతికి పట్టుకోవాలి అభ్యర్థించాడు. అతడికేసి పరిశీలనగా చూశాడు శరత్. సరే అని కేసు టేకప్ చేశాడు. కానీ ఆమె బతికుందో లేదో, ఎక్కడుందో, ఎలా కనిపెట్టడం? శరత్‌కు సాధ్యపడిందా?**

**'పేరొందిన ప్రసాద్ కన్‌స్ట్రక్షన్స్ మా మామయ్య శివరామప్రసాద్ గారిదే. నేను ఆయన అక్క కొడుకుని. ఆయనకు నేను తప్ప వేరే వారసులు లేరు. కానీ ముప్ఫయ్ ఏళ్ల క్రితం అతడి చెల్లెలు కనబడకుండా పోయింది. ఆమె బ్రతికిఉంటే, ఆమె సంతానం కూడా కంపెనీకి వారసుల వుతారు. కాబట్టి ఆమె జాడ మీరు కనుక్కోవాలి' సూటిగా విషయం చెప్పి డిటెక్టివ్ శరత్ సహాయం కోరాడు అభయ్.**

అతడికేసి పరిశీలనగా చూసి కుర్చీలో వెనక్కు వాలాడు శరత్.

'కనబడకుండా పోయి ముప్ఫయ్ ఏళ్లయిందా? అప్పుడు ఆమె పారిపోయిందా? ఇల్లొదిలి వెళ్లిందా?' అడిగాడు శరత్.

'తెలియదు. అమ్మకూడా ఏమీ తెలియదంటోంది. మామయ్య చెల్లెలి ప్రసక్తి భరించలేడు. ఎవరికీ ఏమీ తెలియటం లేదు. నేను అప్పటి వారిని కొందరిని అడిగాను. చాలా మంచి అమ్మాయి అండీ' అంటారు తప్ప, ఇంకేమీ చెప్పటం లేదు' అన్నాడు అభయ్.

తల పంకించాడు శరత్. 'నా అసిస్టెంట్ రాముకు వివరాలివ్వండి. ప్రయత్నిస్తాను' అన్నాడు.

ఆ తర్వాత రాము ఆమె వివరాలన్నీ సేకరించి, శరత్ దగ్గరకు వచ్చాడు.

"బాస్... అమ్మాయి పేరు అరవింద. డిగ్రీ చదువుతుండగా, పద్దెనిమిదేళ్ళ వయసులో జాడ తెలియకుండా పోయింది. ఇప్పుడు నలభై ఎనిమిది ఉంటాయి. అమ్మాయి అప్పటి ఫోటో ఇది. ఆమె అక్క అంటే అభయ్ తల్లి పేరు జలజ. ఆమె భర్త సుగమ్. వీళ్లిద్దరూ వ్యాపారంలో శివరామ్‌కి అండగా ఉన్నారు. కాబట్టి అభయ్‌కి వ్యాపారం సంక్రమించటం సహజమే' చెప్పాడు రాము.

ఇన్‌స్పెక్టర్ విజయ్‌కి ఫోన్ చేశాడు శరత్. విషయం చెప్పి 'కేసు వివరాలేమ్మైనా ఉంటే పంపించవా?' అడిగాడు.

'రాము, ఆర్టిస్ట్ అంజలికి ఈ ఫోటో పంపించు. ఇప్పుడు ఎదిగిన తరువాత ఆ అమ్మాయి ఎలా ఉందో ఊహించి అయిదారు బొమ్మలు గీయమను' అన్నాడు.

•••

శివరామప్రసాద్ ముఖం గంభీరంగా మారింది శరత్ ప్రశ్న వినగానే.

'మా తల్లిదండ్రులు చిన్నప్పుడే పోయారు. నేనే అందరినీ పెంచాను. అరవింద మంచిదే. కాలేజీకి వెళ్ళొచ్చేది. హఠాత్తుగా మాయమైపోయింది. నేను బిజినెస్ వ్యవహారాల్లో బిజీగా ఉండేవాడిని. పోలీసు కంప్లయింట్ ఇచ్చి వెతికించాను. అదేమీ చిన్న పిల్ల కాదు తప్పిపోవటానికి' అన్నాడు.

శరత్ ఏ ప్రశ్న అడిగినా ముభావంగా 'తెలియదు' అన్న సమాధానమే వచ్చింది.

•••

'నాకూ దానికీ పదేళ్ల తేడా. మేమిద్దరం ఫ్రెండ్స్‌లా ఉండేవాళ్లం. అరవింద చాలా అందంగా ఉండేది. మార్కులు కూడా బాగానే వచ్చేవి. ఏమైందో తెలియదు. తమ్ముడు కూడా బాగా వెతికించాడు'.

'మీ తమ్ముడికి అరవిందకు ఏమైనా ఘర్షణలు ఉండేవా?'

కాసేపు మౌనం వహించి తర్వాత చెప్పింది జలజ. 'వాడికి దాని ప్రవర్తన నచ్చేది కాదు. ఆ కాలంలోనే అరవింద ఆడ, మగ తేడా లేనట్టు స్వేచ్ఛగా ప్రవర్తించింది'.

'ఆమెకి ప్రేమ వ్యవహారాలేమ్మైనా ఉన్నాయా?'

'అలాంటిదేమీ లేదు' అంది.

ఆమె భర్త కూడా ఏమీ సమాచారం ఇవ్వలేక పోయాడు. 'అప్పటికి మాకు పెళ్లయి మూడేళ్లయింది. నా వ్యవహారాల్లో బిజీగా ఉండేవాడిని' అన్నాడు.

ఆలోచిస్తూ బయటకు నడిచాడు శరత్.

•••

'బాస్, కంపెనీలో పాత ఉద్యోగులందరినీ ప్రశ్నించా. కంపెనీకి ఎవరితోనూ శత్రుత్వం ఉన్నట్టు లేదు. అమ్మాయి ఆఫీసుకు వచ్చేది కాదట. శివరామప్రసాద్‌కు, ఆ అమ్మాయికీ పడేది కాదని మాత్రం అందరూ చెప్తున్నారు. ఇంట్లో నౌకర్లను అడిగాను. ఇంట్లో ఘర్షణలు ఆమె ఇల్లొదిలి వెళ్ళిపోయేంత తీవ్రమైనవి కావంటున్నారు. ఆమె స్నేహితుల్ని కొందరిని కలిశాను. చలాకీ అమ్మాయి. గలగలా మాట్లాడుతూ కలివిడిగా ఉండేదంటున్నారు' చెప్పాడు రాము.

ఆ అమ్మాయి పేరు మీద ఏదైనా ఎకౌంట్ ఉండేదా? దాన్లో అమౌంట్ ఎంత ఉండేది? చివరి సారి ఎప్పుడు డబ్బులు తీసింది? లాంటి వివరాలు సేకరించు' అన్నాడు.

సరే అని వెళ్ళిపోయాడు రాము.

పాత పోలీసు ఫైలు తెరిచాడు శరత్.

ఆ రోజు ఆమె ఎప్పటిలాగే కాలేజీకి వచ్చింది. కాలేజీ అయ్యాక లైబ్రరీకి వెళ్తానని ఫ్రెండ్స్‌కి చెప్పింది. కానీ లైబ్రరీకి రాలేదని లైబ్రేరియన్ చెప్పాడు.

ఆమె ఫోటోచూసి అడిగితే ఆమె ఒంటరిగానే వరంగల్ బస్సు ఎక్కిందని తెలిసింది.

బస్సు డ్రైవర్, కండక్టర్లను ప్రశ్నిస్తే దారిలో ఎక్కడో దిగిపోయిందని తెలిసింది. పోలీసులు ఎంత ప్రయత్నించినా ఆమె జాడ తెలియలేదు. హైదరాబాద్ - వరంగల్ మధ్య ఎక్కడైనా దిగి ఉండవచ్చు.

ఆలోచిస్తూ ఆర్టిస్ట్ అంజలి పంపిన చిత్రపటాలను చూడటం ఆరంభించాడు. కాసేపయిన తరువాత రామును పిలిచాడు.

'రాముూ, ఇప్పుడు మనం చాలా ఓపిగ్గా పని చేయాలి, నీ అసిస్టెంట్లందర్నీ పిలు. ఈ ఫోటోల కాపీలు ఇవ్వు. భువనగిరి నుంచి వరంగల్ నడుమ ఉన్న ప్రతి గ్రామం, కుగ్రామాల్లో ఈ ఫోటోలు చూపించి అడగమని చెప్పు. ఒక్క వీధి, ఒక్క చిన్న దుకాణం కూడా వదలద్దు'.

'బాస్ ఇది సెన్సస్ పని కన్నా భయంకరమైన పని'.

'తప్పదు. ఇది డిటెక్టివ్ పని' అన్నాడు శరత్.

'ఇదిగో బాస్ ఆమె బ్యాంకు వ్యవహారాలు. ఆమె మిస్ అయినరోజున పదివేలు డ్రా చేసింది.

'అప్పుడు పదివేలంటే పెద్ద మొత్తమే' అన్నాడు శరత్.

ఆమె సంతకాలు, ఆమె చేతిరాత నమూనా తీసుకున్నాడు. గ్రాఫాలజిస్టు గంగాధర్‌కి ఫోన్ చేశాడు.

'చేతిరాత వేరు. సంతకం వేరు. సాధార ణంగా సంతకాన్ని చేతిరాతతో పోలిస్తే వ్యక్తిత్వం సులభంగా బోధపడుతుంది. సంతకం ఒక స్టైల్. సంతకానికీ, చేతి రాతకీ తేడా ఉంటే అది వ్యక్తికి తనపై ఉన్న అభిప్రాయం, ప్రవర్తనలో లోపా లను సూచిస్తుంది. అదే విధంగా మనిషి ఎదు గుతున్న కొద్దీ చేతి రాతలో మార్పులొస్తాయి. కానీ కాలంతోపాటు ఎంతగా మారినా, దాన్ని గుర్తు పట్టవచ్చు' అన్నాడు గ్రాఫాలజిస్టు గంగాధర్.

'ఇప్పుడీ చేతిరాతతో అమ్మాయి గురించి ఏం తెలుస్తుంది?' అడిగాడు శరత్.

'ఈ అమ్మాయి చేతి రాత, సంతకం దాదాపుగా ఒకే సైజులో ఉన్నా యంటే, ఈ వ్యక్తి ఆలో చనల్లో సమతుల్యం ఉన్నట్టే. అమ్మాయికి తనేమిటో, తన శక్తి, తన బలహీన తలు ఏమిటో సరిగ్గా తెలుసన్నమాట. కాబట్టి ఆమె వ్యక్తిత్వంలో నటన ఉండదు, గుడ్‌గర్ల్' అన్నాడు గంగాధర్.

ఇంతలో రాము పెన్‌డ్రైవ్ పట్టుకుని వచ్చాడు. 'ఈ తప్పిపోయిన అమ్మాయి భువనగిరి-వరం గల్ నడుమ ఎక్కడో ఉండాలని అనుమానం. కాబట్టి, ఆమె తప్పిపోయిన నెల, రెండు నెల ల్లోగా ఆ ప్రాంతాలలోని బ్యాంకులలో కొత్తగా ఎకౌంట్లు ఓపెన్ చేసినవారి అప్లికేషన్లు, సంతకాల డిజి టల్ కాపీలన్నీ ఈ పెన్‌డ్రైవ్‌లో వేసి తెచ్చాను' అన్నాడు రాము.

ఇప్పుడు నీ దగ్గర ఉన్న చేతిరాత, సంత కాలను ఈ అప్లికేషన్స్‌లో చేతిరాత, సంతకాలతో పోల్చి ఏదైనా దగ్గరగా ఉందేమో చెప్పాలి' అన్నాడు శరత్. శరత్ వైపు పిచ్చివాడిని చూసినట్టు చూశాడు గంగాధర్.

'ఆమె ఇంకా అక్కడే ఉంటుందా?'

'కనీసం కొన్నిరోజులు, నెలలయినా ఉండి ఉండాలి. ఎక్కడ ఉందో తెలుసుకుంటే ఎటు వెళ్ళిందో తెలుసుకోవచ్చు' అన్నాడు శరత్.

'ఇది గంటలో అయ్యే పనికాదు. అయిన ప్పుడు ఫోన్ చేస్తాను' అన్నాడు గంగాధర్. నవ్వి లేచాడు శరత్.

●●●

వారం తరువాత గంగాధర్ నుంచి ఫోను రాగానే బయలుదేరాడు శరత్.

'శరత్. ఇదిగో బీబీనగర్ దగ్గర మగ్దూంపల్లె అన్న కుగ్రామం ఉంది. ఈ సంతకం, చేతిరాత అక్కడ ఈ బ్యాంకులో తెరిచిన అకౌంట్‌తో సరి పోతోంది' శరత్‌కు వివరాలు అందించి సంతృ ప్తిగా నిట్టూర్చాడు గంగాధర్.

శరత్ ఏదో అనేంతలో అతడి ఫోన్ మోగింది. 'బాస్... ఇక్కడ మగ్దూంపల్లె అన్న గ్రామం ఉంది. అక్కడ దుకాణంలో ఉన్న వ్యక్తి ఇలాంటి అమ్మా యిని చూశానని అంటున్నాడు' చెప్పాడు రాము.

శరత్ ముఖం నవ్వుతో వెలిగిపోయింది.

●●●

పదిహేను వందల ఇళ్ల పల్లె అది. అక్కడ ఉన్న వారిలో అత్యధికంగా భూమి కలిగి ధనవం తుడైన రైతు బాబు.

'ఈ అమ్మాయి మీకు తెలుసా?' అంటూ తన దగ్గర ఉన్న ఫోటోలు బాబుకి చూపించాడు శరత్.

ఆ బొమ్మలు చూస్తున్న బాబు కళ్లల్లో నీళ్ళు నిండాయి.

'అరవింద నా భార్య. నా జీవితం. నా కోసం అన్నీ వదలి కట్టుబట్టలతో ఈ ఊరు వచ్చింది. నా ఇంట్లో అడుగు పెట్టిన తరువాత మళ్లీ ఆమె శవమే బయటకు వెళ్లింది. తను తెచ్చిన డబ్బు లతో భూమి కొన్నాను. బ్యాంక్ ఎకౌంట్ తెరిచాను. నాకు జీవితాన్ని ప్రసాదించింది. ఒక్కరోజు ఒక్క మాట మాట్లాడలేదు. ఇది కావాలి, అది వద్దు అనలేదు.

సంతృప్తిగా, ప్రశాంతంగా జీవించింది. నా జీవితాన్ని ఆనందమయం చేసింది. ఆమె ధన వంతుల కుటుంబంలో నుంచి వచ్చింది. ఇక్క డికి వచ్చాక అన్నీ మరచిపోయింది. నేను, ఇల్లు తప్ప మరో ప్రపంచం లేనట్టు జీవించింది. ఆమె చనిపోయి అయిదేళ్లవుతోంది. మీకేం కావాలి?' అడిగాడు బాబు.

'ఆమె ఎందుకని ఇల్లు వదలి వచ్చింది?' అడి గాడు శరత్.

'తెలియదు. నాకు చెప్పలేదు. కుటుంబ రహస్యం కాపాడటానికి అంది. నేనూ రెట్టించి అడగలేదు. ఇక్కడ అడుగు పెట్టిన తరువాత ఆమె అక్కడి మాట ఎత్తలేదు. నేను కాలేజీలో ఆమెకు సీనియర్. నా ఫార్మ్‌హౌస్ చూసి ఇక్కడ , ఈ ప్రశాంత వాతావరణంలో స్థిరపడాలని ఉందంది. రమ్మన్నాను. వచ్చేసింది. ఆమెకు వాళ్ల అన్న నచ్చలేదు. ఆ కృత్రిమ వాతావరణంలో ఉండలే నంది' మీకు ఏం కావాలి?' అడిగాడు బాబు.

'పిల్లలు?'

'లేరు' అని లోపలకి వెళ్లి ఓ కాగితం తెచ్చి ఇచ్చాడు? 'ఎప్పుడయినా, ఎవరయినా తనని వెతుకుతూ వస్తే ఈ కాగితం ఇమ్మంది. ఆమె ఎవరినీ కలిసేది కాదు' కాగితం తీసి చూశాడు శరత్. 'దాన్లో తన అన్నతో కానీ అతని ఆస్తితో కానీ తనకూ తన వారెవరికీ ఎలాంటి ఆసక్తి లేదని రాసి ఉంది.

నిట్టూర్చి లేచాడు శరత్.

**-కస్తూరి మురళీకృష్ణ**
**సెల్: 98496 17392**




జూన్ 1 నుంచి
జూన్ 7 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



### మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)

విద్యా విషయాలు, పెట్టుబడులు, షాపింగ్, సోదరీసోదరుల వ్యవహారాలు, బదిలీలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం విద్యార్థులకు శుభప్రదం. ప్రయాణాలపై దృష్టి పెడతారు. 2,3 తేదీల్లో పెట్టుబడులకు సంబంధించిన సమాచారం సేకరిస్తారు. ఆర్థిక విషయాల్లో సన్నిహితుల నుంచి ఒత్తిడి రావచ్చు. 4,5 తేదీల్లో ప్రయాణాలు, చర్చల్లో నిదానం అవసరం. వాగ్వివాదాలకు దూరంగా ఉండాలి. విద్యార్థులు లక్ష్య సాధనకు పట్టుదలతో కృషి చేయాలి. 6,7 తేదీల్లో బదిలీలకు సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు. బంధుమిత్రులతో ఇల్లు సందడిగా ఉంటుంది.



### వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, పొదుపు పథకాలు, షాపింగ్, కీలక నిర్ణయాలు, ఫీజుల చెల్లింపులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం దీర్ఘకాలిక పెట్టుబడులు లాభిస్తాయి. ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు అవసరమైన నిధులు సమకూర్చుకుంటారు. 2,3 తేదీల్లో పెట్టుబడులకు సంబంధించిన నిర్ణయాలు వాయిదా వేయడం మంచిది. రుణాలు, పొదుపు పథకాలకు సంబంధించి ఆరా తీస్తారు. 4,5 తేదీల్లో ఆర్థిక విషయాల్లో ఆచితూచి వ్యవహరించాలి. రుణప్రయత్నాలు ఫలించకపోవచ్చు. షాపింగ్‌లో నాణ్యత గమనించాలి. 6,7 తేదీల్లో ఫీజులు చెల్లిస్తారు. చెక్కులు, విలువైన పత్రాలు అందుకుంటారు.



### మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)

సమావేశాలు, దూరప్రయాణాలు, కీలక నిర్ణయాలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం బృంద కార్యక్రమాల్లో పాల్గొంటారు. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. 2,3 తేదీల్లో దూరప్రయాణాలు, ఉన్నత విద్యా విషయాల్లో అనుకోని ఆటంకాలు ఎదురవుతాయి. ఆత్మపరిశీలన చేసుకుంటారు. యోగధ్యానాలకు అనుకూలం. ముఖ్యమైన నిర్ణయాలు తీసుకునేందుకు 4,5 తేదీలు తగిన సమయం కాదు. కొత్త ప్రాజెక్టులు, ప్రయత్నాలకు ఆటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది. 6,7 తేదీల్లో పెట్టుబడులు లాభిస్తాయి. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరంగా ఉంటుంది.



### కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, ప్రముఖుల కలయిక, ప్రయాణాలు, విద్యా విషయాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం వృత్తి, వ్యాపారాల్లో గత అనుభవంతో లక్ష్యాలు సాధిస్తారు. ప్రముఖులను కలుసుకుంటారు. 2,3 తేదీల్లో ఆర్థిక విషయాల్లో అనుకోని అవాంతరాలు ఎదురవుతాయి. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. 4,5 తేదీల్లో ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాల్లో ఆచితూచి వ్యవహరించాలి. అవాంతరాలు ఆటంకాల కారణంగా మనశ్శాంతి లోపిస్తుంది. ఒక సమాచారం కలవరపెడుతుంది. 6,7 తేదీల్లో పైచదువుల కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. ప్రయాణాలు ఉల్లాసం కలిగిస్తాయి.



### సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)

సమావేశాలు, వృత్తి, వ్యాపారాలు, బంధుమిత్రుల కలయిక, ఆర్థిక వ్యవహారాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. ప్రయాణాలు ఉల్లాసం కలిగిస్తాయి. 2,3 తేదీల్లో సమావేశాల్లో ప్రముఖులను కలుసుకుంటారు. బృందకార్యక్రమాల్లో కీలక పాత్ర పోషిస్తారు. వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా కొంత నిరుత్సాహకరంగా ఉంటుంది. 4,5 తేదీల్లో ఆర్థిక విషయాల్లో ఆచితూచి వ్యవహరించాలి. బంధుమిత్రుల నుంచి మాట పడాల్సి రావచ్చు. స్పెక్యులేషన్లకు దూరంగా ఉండాలి. 6,7 తేదీల్లో పైచదువులకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. రాజకీయ, సినీరంగాల వారికి అనుకూలం.



### కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)

ఆర్థికపరమైన సమావేశాలు, వృత్తి వ్యాపారాలు, పెద్దలు, బంధుమిత్రుల కలయికపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం పెద్దల ఆరోగ్యం మెరుగవుతుంది. బీమా, గ్రాట్యుటీ పనులకు అనుకూలం. 2,3 తేదీల్లో సమావేశాల్లో పెద్దల వైఖరి ఆవేదన కలిగిస్తుంది. ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. 4,5 తేదీల్లో లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. పైఅధికారుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. గౌరవ, ప్రతిష్ఠలకు భంగం కలిగే ప్రమాదం ఉంది. 6,7 తేదీల్లో ఉద్యోగ, వ్యాపార రంగాల్లో ఆర్థిక ప్రయోజనాలు సాధిస్తారు. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు.



### తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)

భాగస్వామ్యాలు, ఆర్థిక వ్యవహారాలు, ప్రయాణాలు, వేడుకలు, వృత్తి, వ్యాపార విషయాలపై ఈ వారం శ్రద్ధ పెడతారు. బుధవారం బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. శ్రీమతి, శ్రీవారి వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. 2,3 తేదీల్లో ఆర్థికపరమైన సమావేశాలు ఫలించకపోవచ్చు. విద్య, సమావేశాలకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. 4,5 తేదీల్లో ప్రయాణాల్లో అసౌకర్యం కలిగే అవకాశం ఉంది. విద్యా సంస్థల ఎంపిక విషయంలో తికమక పడతారు. శ్రమాధిక్యం తప్పకపోవచ్చు. 6,7 తేదీల్లో సమావేశాల్లో ప్రముఖులను కలుసుకుంటారు. వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు.



### వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)

ఆరోగ్యం, స్పెక్యులేషన్లు, పెట్టుబడులు, బీమా, రుణప్రయత్నాలు, ఫీజులు, బిల్లుల చెల్లింపులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపిస్తారు. సహోద్యోగుల సహకారంతో ఆర్థికపరమైన లక్ష్యాలు సాధిస్తారు. 2,3 తేదీల్లో స్పెక్యులేషన్లలో ఆచితూచి వ్యవహరించాలి. ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 4,5 తేదీల్లో ఖర్చులు అంచనాలు మించుతాయి. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. రుణప్రయత్నాలు ఫలించకపోవచ్చు. బీమా, గ్రాట్యుటీ, క్లెయిముల వ్యవహారాలకు అనుకూలం. 6,7 తేదీల్లో ఆర్థికపరమైన సమావేశాలు ఫలిస్తాయి. పెట్టుబడులకు సంబంధించిన సమాచారం సేకరిస్తారు.



### ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)

ప్రేమానుబంధాలు, స్పెక్యులేషన్లు, భాగస్వామికి సంబంధించిన అంశాలు, క్రయవిక్రయాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం వివాహ నిర్ణయాలకు అనుకూలం. ప్రియతములతో ఉల్లాసంగా గడుపుతారు. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. 2,3 తేదీల్లో భాగస్వామి సహకారంతో వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. బంధుమిత్రులతో విందు వినోదాల్లో పాల్గొంటారు. 4,5 తేదీల్లో స్పెక్యులేషన్లలో ఆచితూచి వ్యవహరించాలి. పందాలు, పోటీలకు దూరంగా ఉండండి. భాగస్వామి వైఖరి ఆవేదన కలిగిస్తుంది. 6,7 తేదీల్లో ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు.



### మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)

విందు వినోదాలు, విద్యా విషయాలు, వృత్తి, వ్యాపారాలు, భాగస్వామి వ్యవహారాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం కుటుంబ సభ్యులతో ఉల్లాసంగా గడుపుతారు. రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి శుభప్రదం. 2,3 తేదీల్లో చిన్నారులు, ప్రియతముల ఆరోగ్యం కలవరం కలిగిస్తుంది. సృజనాత్మకంగా వ్యవహరించి వృత్తి వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. 4,5 తేదీల్లో ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. విందు వినోదాల్లో పరిమితి పాటించండి. లక్ష్య సాధనకు పట్టుదలతో కృషి చేయాలి. 6,7 తేదీల్లో జనసంబంధాలు విస్తరిస్తాయి. కొత్త పరిచయాల కారణంగా కృషి రంగంలో రాణిస్తారు.



### కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)

విద్యా విషయాలు, వేడుకలు, పొదుపు పథకాలు, ప్రేమానుబంధాలు, ఉద్యోగ, వ్యాపారాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధవారం విద్యార్థులకు శుభప్రదం. సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. 2,3 తేదీల్లో కుటుంబ సభ్యుల వైఖరి ఆవేదన కలిగిస్తుంది. రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరంగా ఉంటుంది. 4,5 తేదీల్లో ప్రేమానుబంధాలు బెడిసికొట్టే ప్రమాదం ఉంది. చిన్నారులు, ప్రియతముల వైఖరి ఆవేదన కలిగిస్తుంది. విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. 6,7 తేదీల్లో సృజనాత్మకంగా వ్యవహరించి వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు.



### మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, విద్యా విషయాలు, బదిలీలు, నిర్మాణాలు, ఇంట్లో వేడుకల అంశాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధవారం ఆర్థిక విషయాలకు సంబంధించి స్పష్టమైన నిర్ణయాలు తీసుకుంటారు. రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి శుభప్రదం. 2,3 తేదీల్లో సన్నిహితుల వైఖరి కలవరపెడుతుంది. కీలకమైన పత్రాలు అందుకుంటారు. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. 4,5 తేదీల్లో బదిలీలు, మార్పులు అసౌకర్యం కలిగిస్తాయి. రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారు ఆచితూచి వ్యవహరించాలి. 6,7 తేదీల్లో చిన్నారులు, ప్రియతములతో ఉల్లాసంగా గడుపుతారు. ఇంటి కోసం విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు.

నవ్య




## ఆ పాత్రలో అక్షయ్!



అక్షయ్ కుమార్ అంటే ఒకప్పుడు యాక్షన్ హీరో! అలాంటి హీరో ఇటీవలి కాలంలో కామెడీ వైపు టర్న్ ఇచ్చుకుని ఆ సినిమాలు చేస్తున్నాడు. ఇప్పుడు సరికొత్తగా గే క్యారెక్టర్ చేయబోతున్నాడు. 'డిష్యుం' సినిమాలో అక్షయ్ గే పాత్ర చేస్తున్నాడు. అయితే ఈ పాత్ర కొన్ని సన్నివేశాలకే పరిమితం అవుతుందా? లేక సినిమా మొత్తం ఆ పాత్రలోనే కనిపిస్తాడా? అన్నది మాత్రం సస్పెన్స్‌గా ఉంది. గతంలో జాన్ అబ్రహం, అభిషేక్ బచ్చన్ లాంటి వాళ్ళు ఒకటి రెండు సినిమాల్లో ఇలాంటి పాత్రల్లో కొద్దిసేపు అలరించారు. కానీ అక్షయ్‌కి ఉన్న ఇమేజ్ కారణంగా ఈ పాత్రను ఆయన అభిమానులు ఆదరిస్తారా? అన్న అనుమానం బాలీవుడ్ జనాల్లో వ్యక్తమవుతోంది.

## టాలీవుడ్ విలన్‌కి ఇంటర్నేషనల్ ఆఫర్

అంతర్జాతీయ సినిమాల్లో నటించే అవకాశాలు ఎక్కువగా బాలీవుడ్ నటీనటులకే వస్తుంటాయి. దానికి విరుద్ధంగా బాలకృష్ణ సినిమాలో విలన్‌గా నటించిన విక్రమ్‌జిత్ విర్క్‌కి ఓ అంతర్జాతీయ సినిమాలో విలన్‌గా అవకాశం వచ్చింది. 'డిక్టేటర్' సినిమాలో విక్రమ్‌జిత్ విక్కి గెటప్ మనవారినే కాదు ఇండో చైనా ఫిలిం మేకర్స్‌ని కూడా ఆకట్టుకుంది. 'లాస్ట్ ఇన్ థాయిలాండ్'కి సీక్వెల్ తీస్తున్న దర్శకుడు వాంగ్ బకియాంగ్. తన సినిమాలో విలన్ క్యారెక్టర్ కోసం నటుడిని వెతుకుతున్న సమయంలో విక్రమ్‌జిత్ గురించి తెలిసి అప్రోచ్ అయ్యాడట! పొట్టి జుత్తు, పొడుగాటి గెడ్డంతో కనిపించిన విక్రమ్‌జిత్‌ను చూసి మరో ఆలోచన లేకుండా ఎంపిక చేసుకున్నాడట ఆ దర్శకుడు. తన అవతారమే తనకు ఇంటర్నేషనల్ సినిమాలో అవకాశం కల్పించిందని విక్రమ్‌జిత్ తెగ మురిసిపోతున్నాడు.



## 'కబాలి' ఖాతాలో మరో రికార్డు



సూపర్‌స్టార్ రజనీకాంత్‌కి ప్రపంచవ్యాప్తంగా అభిమానులున్న సంగతి తెలిసిందే! జపాన్‌లో ఆయన సినిమాలను డబ్ చేస్తుంటారు కూడా! ఇప్పుడు రజనీకాంత్ కొత్త సినిమాను మలేసియాలో డబ్ చేయబోతున్నారట! మలేసియా అధికార భాష మలయాళంలోకి ఈ సినిమాను అనువదించి 'కబాలి' విడుదల రోజునే ఈ సినిమాను కూడా విడుదల చేస్తారట! మలేసియాలో దక్షిణాది సినిమా డబ్ కావడం ఇదే మొదటిసారి. అదీ రజనీకాంత్ సినిమా కావడంతో సూపర్‌స్టార్ అభిమానులు ఆనందంతో తబ్బిబ్బవుతున్నారట!

## వందల కోట్లు వదులుకున్న హీరో



కొంత మంది ఎక్కువ మొత్తం ఇస్తామంటే ఎలాంటి పాత్ర చేయడానికైనా రెడీ అయిపోతారు. అలాంటిది దాదాపు ఏడు వందల కోట్లు ఇస్తామన్నా చేయననేశాడు ఆ హాలీవుడ్ హీరో! ఆ హీరో మరెవరో కాదు జేమ్స్‌బాండ్ హీరో డేనియల్ క్రెయిగ్. ఇప్పటికే డేనియల్ జేమ్స్ బాండ్ సిరీస్‌లో నాలుగు సినిమాలు చేశాడు ఐదవ సినిమాకి దాదాపు ఏడు వందల కోట్లు ఆఫర్ చేసినా చేయడానికి ఒప్పుకోలేదట! జేమ్స్‌బాండ్ సినిమాలు చేయడం కన్నా చనిపోవడం మేలని ఒకానొక సందర్భంగా డేనియల్ వ్యాఖ్యానించాడు! ఆ సందర్భంగానే తాను ఇక ఆ సినిమాలు చేయనని చెప్పేశాడు కూడా! అయితే జేమ్స్‌బాండ్ సినిమాలు తీసే ఎంజిఎం సంస్థ మాత్రం అతనితో సంప్రదింపులు జరపడానికే ప్రయత్నిస్తోందట!

## ఆ హీరోది ఐరన్ లెగ్గా?

ఆ హీరో మరెవరో కాదు బాలీవుడ్ బాద్‌షా షారూఖ్‌ఖాన్. షారూఖ్‌ఖాన్ రెండు తెలుగు సినిమాల షూటింగ్‌లకి సరదాగా వచ్చి వెళ్ళాడు. ఆయన సినిమా ప్రమోషన్ల సందర్భంగా హైదరాబాద్ వచ్చిన సమయంలో ఆ షూటింగ్ స్పాట్‌కి వెళ్ళి హీరో హీరోయిన్లతో కొద్దిసేపు గడిపి వచ్చాడు. అప్పట్లో అదో పెద్ద న్యూస్ అయింది. ఇప్పుడు కూడా న్యూసే కానీ... పాజిటివ్‌గా కాదు. నెగెటివ్‌గా! షారూఖ్ షూటింగ్ స్పాట్‌కి వెళ్ళిన 'బ్రూస్‌లీ', 'బ్రహ్మోత్సవం' రెండూ కూడా ఘోరమైన ఫ్లాపులే! ఈ సినిమాలు బాక్సాఫీసు వద్ద ఇంతలా బోర్లా పడడానికి షారూఖ్‌ఖాన్ ఐరెన్‌లెగ్ కారణమని టాలీవుడ్ జనాలు అంటున్నారు.



# ఆయన రియల్ హీరో

ఆమెను చూస్తే సృష్టిలో అందాలన్నీ పోతపోసిన దేవకన్యలా ఉంటుంది.... చెంపకు చారడేసి కళ్ళు కాదు కానీ ఆ సోగ కళ్ళలో ఏదో మ్యాజిక్ ఉంది. చూడగానే టక్కున ఎదుటివారిని కట్టిపడేస్తాయి. తేనెలూరే పెదవులను చూస్తూ ఉండిపోవాలని పిస్తూ ఉంటుంది. శంఖంలాంటి మెడ, తీర్చిదిద్దినట్టు ఉండే శరీర సౌష్టవం... వెరసి శ్రుతిహాసన్‌ను అందగత్తెను చేశాయి. అందానికి తోడు అభినయం ఆమెకు స్టార్ స్టేటస్‌ను తెచ్చిపెట్టింది. అందం, నటన, విలక్షణమైన వ్యక్తిత్వం, స్వతంత్ర భావాలు ఆమెకు ప్రత్యేకమైన గుర్తింపు తీసుకొచ్చాయి. ఇన్ని ప్రత్యేకతలున్న శ్రుతిహాసన్‌తో....

**పవన్‌స్టార్‌తో మళ్ళీ జత కట్టబోతున్నారట?**

దాని వివరాలు త్వరలోనే చెబుతాను. అవకాశం అయితే ఉంది.

**మీ ఫాదర్‌తో నటించడం ఎలా ఉంది?**

నేను ఎప్పటి నుంచో చెబుతున్నాను. నాన్నతో కలిసి తప్పకుండా ఓ సినిమా చేస్తాను అని. ఇన్ని రోజులకి అది కుదిరింది. రియల్ లైఫ్‌లోనే కాదు, రీల్ లైఫ్‌లో కూడా మేం తండ్రీ కూతుళ్ళుగా నటిస్తున్నాం. నాకైతే ఎప్పుడెప్పుడు మా ఇద్దరినీ తెర మీద చూసుకుందామా? అన్నంత తొందర ఉంది.

**ఈ సినిమాకి మీ సిస్టర్ పనిచేస్తున్నట్టుంది?**

అవును. తను దర్శకత్వ శాఖలో పనిచేస్తోంది. తనకి నటన కన్నా కూడా దర్శకత్వం మీద ఎక్కువ ఇంట్రస్ట్. దాంతో నాన్న సినిమాతోనే ఆ వర్క్ స్టార్ట్ చేసింది. నాన్న సినిమా అయితే మరిన్ని ఎక్కువ విషయాలు తెలుసుకునే అవకాశం ఉంది.

**అక్షర దర్శకత్వంలోనే కొనసాగుతుందా?**

అది తన ఇష్టం. ఏ రంగంలో స్థిరపడాలన్నది తనకే వదిలేశాం. తన విషయంలో అమ్మా, నాన్న, నేను ఎవ్వరం కల్పించుకోం. మా సలహాలు అవసరమైతే తప్పకుండా ఇస్తాం. అంతే తప్ప తన నిర్ణయాలకి అడ్డు తగలం.

**మిగతా హీరోయిన్లతో పోల్చుకుంటే మీకు ధైర్యం ఎక్కువ అంటారు?**

అది మా పేరెంట్స్ నుంచి వచ్చిందే! కెరీర్ ప్రారంభంలో నాకు వచ్చిన ఫ్లాప్‌లు మరొక హీరోయిన్‌కి వచ్చి ఉంటే, ఈ రంగాన్ని విడిచి పెట్టి వెళ్ళేవారేమో! కానీ అమ్మా, నాన్న నాకు సపోర్ట్‌గా నిలిచారు. ఎక్కడైతే ఫెయిల్యూర్స్ వచ్చాయో అక్కడే విజయం సాధించాలని ధైర్యం చెప్పారు. వారి స్ఫూర్తితోనే ముందుకు సాగాను.

**మీ ఫాదర్ సలహాలు ఇస్తారా?**

సలహాలు అని కాదు కానీ, సూచనలు ఇస్తారు. అది కూడా అడిగితేనే! లేకపోతే నా సినిమాల విషయంలో అస్సలు కల్పించుకోరు. ఆయన సలహాలు, సూచనలు ఇచ్చిన సందర్భాలు చాలా అరుదు. నటన విషయంలో ఆయనే నాకు స్ఫూర్తి. తెర మీదే కాదు, నిజ జీవితంలో కూడా ఆయన రియల్ హీరో!

**'ప్రేమమ్' గురించి...**

'ప్రేమమ్'లో ఇంజనీరింగ్ కాలేజీలో పనిచేసే లెక్చరర్ పాత్రలో నటిస్తున్నాను. నా స్టూడెంట్ పాత్రలో నాగచైతన్య చేస్తున్నాడు. డీ గ్లామర్ రోల్ చేస్తున్నాను. ఈ సినిమా గురించి ఇంతకన్నా ఎక్కువ చెప్పడం సరికాదు.

**రామ్‌చరణ్‌తో చేస్తున్నట్టున్నారు?**

ఓ సినిమా చేయబోతున్నాను. సురేందర్‌రెడ్డి దర్శకత్వం వహిస్తున్నారు. అరవింద్‌స్వామి లీడ్ రోల్ చేస్తున్నారు.

**సూర్యతో కోలీవుడ్‌లో చేస్తున్న సినిమా....**

'సింగం 3'లో ఓ క్యారెక్టర్ చేస్తున్నాను. ఈ సినిమా త్వరలోనే ప్రేక్షకుల ముందుకు రాబోతోంది. కోలీవుడ్‌లో రెండు మూడు కథలు వినడం జరిగింది కానీ, ఇంకా వేటికీ ఓకే చెప్పలేదు.

**బాలీవుడ్‌లో చేస్తున్న సినిమాల గురించి....**

ఒక సినిమా విడుదలకు సిద్ధంగా ఉంది. మరో రెండు సినిమాల షూటింగ్‌లు మొదలు కావలసి ఉంది.

**ఒంటరిగా ఉంటున్నారు కదా? భయమేయదా?**

భయం ఎందుకు? నేనేమీ అరణ్యంలో ఉండటం లేదు కదా? జనం మధ్యనే ఉంటున్నాను. ఆడపిల్లలు ఎంత ధైర్యంగా జీవించాలో నాన్న మొదటి నుంచీ చెప్పేవారు. ఆయనిచ్చిన ధైర్యంతోనే ముంబాయిలో ఒంటరిగా ఉండగలుగుతున్నాను.




**తీరిక సమయాల్లో...**

సినిమాల్లోకి రాకముందు ఎప్పుడూ వంటగదిలో గరిటె తిప్పుతూ ఉండేదాన్ని. రక రకాల ప్రయోగాలు చేసేదాన్ని. మా ఇంట్లో వాళ్ళందరూ వాటిని తిని తీరవలసిందే! అఫ్ కోర్స్ బాగానే చేసేదాన్ని. హీరోయిన్‌గా బిజీ అయిన తరువాత వంటగదిలోకి వెళ్ళడమే కుదరడం లేదు. నాకిష్టమైన సంగీతం వినే సమయం కూడా దొరకడం లేదు. ట్రావెలింగ్ లోనే వింటున్నాను. ఈ రెండూ తరువాత నాకు అత్యంత ఇష్టమైంది నిద్ర. బాగా నిద్ర పోతాను.

**రోజురోజుకీ రెట్టింపు అవుతున్న మీ సౌందర్య రహస్యం?**

ప్రత్యేకించి తీసుకునే జాగ్రత్తలు అంటూ ఏమీ ఉండవు. ప్రతిరోజూ ఏరోబిక్ ఎక్సర్ సైజ్‌లు మాత్రం తప్పకుండా చేస్తాను. వీలు దొరికినప్పుడల్లా జిమ్‌లో కనీసం గంటపాటు వ్యాయామం చేస్తాను. మార్కెట్‌లో దొరికే సౌందర్య సాధనాలు వాడడం నాకు అంతగా నచ్చదు. సబ్బుకి బదులు సున్నిపిండి ఎక్కువగా ఉపయోగిస్తాను. బయట షూటింగ్‌ల సమయంలో ఇలాంటివి కుదరదు. అప్పుడు మాత్రం గాఢత తక్కువగా ఉండే సబ్బుల్నే ఎంచుకుంటాను. నీళ్ళు, పళ్ళరసాలు ఎక్కువగా తీసుకుంటాను. తగినంత నిద్రపోతాను. ఈపాటి జాగ్రత్తలు తీసుకుంటే చాలు అమ్మాయిలైనా, అమ్మలైనా అందంగా కనిపించవచ్చు.

**పెళ్ళి గురించి...**

తప్పకుండా చేసుకుంటాను. ఎప్పుడు... ఎవరిని చేసుకుంటాను అన్న విషయం చెప్ప లేను. ఆ వ్యక్తి మా పేరెంట్స్ చూసిన వ్యక్తా లేదా నేను ప్రేమించిన వ్యక్తా అన్నది కూడా చెప్పడం కష్టమే! ఎందుకంటే ఇంతవరకూ నా మనసులో ఎవరూ లేరు. ఆ వ్యక్తికి కొన్ని క్వాలిఫికేషన్లు ఉండాలి. నాకు నచ్చిన క్వాలిఫికేషన్లు ఉన్న వ్యక్తి కనిపించిన వెంటనే పెళ్ళాడేస్తా!

**విమర్శలు, గాసిప్స్ విన్నప్పుడు?**

బాధపడను. సద్విమర్శలైతే తప్పకుండా స్వీకరిస్తా. నా తప్పులు దిద్దుకుంటా. గాసిప్స్ అంటే ఓ విధంగా జోక్స్! కొన్నిసార్లు నాకు తెలియని విషయాలు కూడా గాసిప్స్ రూపంలో వచ్చేస్తుంటాయి. అలాంటప్పుడు భలే ఆశ్చర్యం వేస్తుంది. ఆ తరువాత నవ్వు వస్తుంది. మనసారా నవ్వుకునే గాసిప్స్ వారంలో ఒకటి రెండుసార్లన్నా వస్తూంటాయి. వాటిని బాగా ఎంజాయ్ చేస్తా!

**మీ గాత్రం మళ్ళీ ఎప్పుడు వినిపిస్తారు?**

అడపాతడపా సినిమాల్లో పాడుతూనే ఉన్నాను కదా! ఫుల్‌టైం సింగర్‌గా మారడానికి ఇంకా టైముంది. కొన్ని సినిమాలు చేసిన తరువాత సింగర్ అవతారం ఎత్తుతాను.

**దర్శకత్వం చేసే ఆలోచన ఉందా?**

ఆ విషయం చెప్పడం కష్టం. చేయాలన్న ఆలోచన వచ్చినప్పుడు అప్పుడు చెబుతాను. ప్రస్తుతానికి ఆ రంగంలో మా సిస్టర్ ఉంది కదా! నేను కూడా ఎందుకు?

**ఈ రంగంలోకి వచ్చిన తరువాత బాధపడిన సందర్భం?**

ఇష్టంగానే వచ్చాను కనుక బాధ అనేది లేదు. కాకపోతే అసంతృప్తి మాత్రం ఎప్పుడూ ఉంది. హీరోలకున్న అవకాశాలు హీరోయిన్లకు ఉండవు. ఇదే విషయం మా ఫాదర్‌తో ఎప్పుడూ డిస్కస్ చేస్తుంటాను. భారతీయ సినిమాల్లోనే ఈ వ్యత్యాసం ఎక్కువగా కనిపిస్తూ ఉంటుంది.

-చిన్ని

## అమృత్‌సర్‌లో ఆ పూజలెందుకో?

'కృష్ణగాడి వీర ప్రేమగాథ' హీరోయిన్ మెహ్రీన్ కౌర్ గుర్తుంది కదా! ఆ సినిమా తరువాత ఈ అమ్మడికి పెద్దగా చాన్స్‌లు రాలేదు. తనకు చాన్స్‌లు రాక పోవడానికి కారణం భగవంతుడి కృప తగ్గడమే అనుకుందేమో సడెన్‌గా అమృత్‌సర్ వెళ్ళి అక్కడ పూజలు గట్రా చేసేస్తోంది. మెహ్రీన్ చేతిలో ప్రస్తుతం రెండు సినిమాలు ఉన్నాయి. మెహ్రీన్‌కి సినిమా చాన్స్‌లు రాకపోవడానికి కారణం ఆమె ఫిజిక్ తప్ప మరొకటి కాదని తేల్చేశారు టాలీవుడ్ జనాలు. ఈమె కాస్త బొద్దుగా ఉండి, కుర్ర హీరోల పక్కన కాస్త పెద్దదిగా కనిపించే అవకాశం ఉండడంతో దర్శకనిర్మాతలు ఆమెను తీసుకోవడానికి ఒకటికి రెండు సార్లు ఆలోచిస్తున్నారట! ముందు ఫిజిక్ మీద దృష్టి పెడితే అవకాశాలు వాటంతట అవే వస్తాయి తప్ప పూజలు చేస్తే రావు అంటున్నారు సినీ జనాలు.





# ఇంటర్వ్యూ

# ఇప్పుడొస్తున్న చిత్రాలు యువతకు పనికిరావు

**-శారద**

(గత సంచిక తరువాయి)

**ఏఎన్నార్, ఎన్టీఆర్ ఇద్దరూ అటు ఇండస్ట్రీకీ, ఇటు నా సినీ కెరీర్‌కు రెండు కళ్ళలాంటివారు. నా ఎదుగుదలకు వీరిద్దరూ మూలకారణం. నేను నా జన్మలో వారిని మరిచిపోలేను. పద హారేళ్ళ వయసులో నేను కెమెరా ముందుకు రాగానే అక్కినేనిగారు నాకు ధైర్యం చెప్పి ఎంత గానో ప్రోత్సహించారు. నాలో మొట్టమొదట మనోధైర్యం నింపిన మహా నటుడాయన. ఎన్టీ ఆర్ గారితో నటిస్తున్నప్పుడు నటన విష యంలో నాకు కొత్త ఊపిరిపోసిన నటసార్వ భౌముడు ఆయన.**

## జగ్గయ్యగారితో

నా సినీ జీవితంలో మరో ముఖ్య నటుడు కళావాచస్పతి జగ్గయ్యగారు. ఆయన పెద్దమ్మాయి, నేనూ కలిసి సైవా మేస్టారి దగ్గర డాన్స్ నేర్చు కునేవాళ్ళం. ఎన్నో చిత్రాల్లో జగ్గయ్యగారికి నేను భార్యగా నటించాను. 'స్వాతి' చిత్రంలో మాపై చిత్రించిన, కల్యాణం కమనీయం కలలే పండిన వైభోగం.....అనే పాట ఎన్నిసార్లైనా వినాలనిపి స్తుంది. 'అభిమానవంతులు' చిత్రంలో కృష్ణంరాజు గారు నాకు జోడీ. ఈ వీణపై పలికిన రాగం/నాలోన విరిసిన అనురాగం...అంటూ ఎస్పీ కోదండ పాణి సారథ్యంలో పి.సుశీల ఆ చిత్రంలో పాడిన పాట మధురాతిమధురం.

## రంగనాథ్‌గారితో

రంగనాథ్‌గారు రైల్వేలో టికెట్ కలె క్టర్‌గా ఉండేవారు. నేను రైల్లో వెళ్తుంటే, శారదగారూ నమస్కారం, మీ చిత్రాలు చాలా బావుంటాయి, మీ నటన నాకు ఎంతో నచ్చింది అనేవారు ఆయన. విచిత్రం ఏంటంటే, ఆ తర్వాత 'జమిందారుగారి అమ్మాయి' చిత్రంలో ఆయన సరసన హీరో యిన్‌గా నటించాను. ఇలా అవు తుందని ఎవరైనా అనుకుంటారా? ఈ హిట్ చిత్రానికి సింగీతం శ్రీనివాసరావుగారు దర్శకులు. మ్రోగింది వీణ హృదయాలలోనా పదే పదే... అనే పాట ఈ చిత్రం లోనిదే. రంగనాథ్‌గారి మరణం చాలా ట్రాజెడీ. ఎంతో విచారించాల్సిన విషయం. పోయినోళ్ళంతా మంచోళ్ళు అనుకోవాలంతే. శోభన్‌బాబుగారి మరణం కూడా వ్యక్తిగతంగా నాకు ఎంతో బాధ కలిగించింది. వాళ్ళ సినిమాలు టీవీలో చూస్తుంటే వాళ్ళింకా సజీవంగానే ఉన్నట్టు అనిపిస్తుంది. దేవిక మినహా దాదాపు నటీనటు లందరితో నటించాను. భేదాభిప్రాయాలు లేకుండా ఇండస్ట్రీలో ఎంతో గౌరవ మర్యాదలతో ఉంటూ అందరి మన్ననలూ పొందాను. అలా నా కెరీర్ హాయిగా గడిచింది.

## సౌందర్య, శ్రీదేవి

తక్కువకాలంలో అగ్రనటీమణుల జాబితాలో చేరిన నటి సౌందర్య. గొప్ప మనసున్న నటి. ఆమె మనసు ఎంతో సున్నితం. ఏ ప్రొడ్యూసర్‌నీ బాధపెట్టేది కాదు. షూటింగ్ సమయాల్లో వసతి విషయంలో నిరాడంబరంగా ఎడ్జెస్ట్ అయ్యేది. ఈ రోజుల్లో ఏ నటీమణైనా అలా ఉంటున్నారా? ఆమెతో కలిసి అంతఃపురం చిత్రంలో నటించాను. ఆమె మనల్నందర్నీ వదిలి వెళ్ళడం ఎంతో బాధాకరం.

ఇక అగ్రనటి శ్రీదేవి నాకు బాలనటిగా చేసింది. తర్వాత కార్తీకదీపం సినిమాలో మేం ఇద్దరం సవతులుగా నటించడం ఆశ్చర్యకరమే. అప్పుడప్పుడు శ్రీదేవి నాతో ఈ విషయం చెప్పి నవ్వుతూ ఉంటుంది.

## ఆనాటి చిత్రాల్ని ప్రతి కుటుంబం చూసేది

చిత్ర పరిశ్రమలో మేం యాక్టివ్‌గా ఉన్నప్పుడు మాకు సినిమా జీవితం తప్ప వేరే తెలియదు. నాకు ఇచ్చిన పాత్రల్ని చక్కగా పోషించాననే తృప్తి నాకుంది. నా పాత్రలకు పూర్తిగా న్యాయం చేశానని నిక్కచ్చిగా చెప్పగలను. ఆనాటి దర్శ కులు, నటులు ఎవరైనా గానివ్వండి అందరం ఒకరి కష్టాలు మరొకరు పంచుకుంటూ సంతో షంగా వసుధైక కుటుంబంలా కాలం గడిపే వాళ్ళం. ఆనాటి సినిమాలు కూడా అంతే! ప్రతి కుటుంబం చూసేవిధంగా ఉండేవి.

## ఒకే చిత్రానికి రెండు జాతీయ బహుమతులు

శోభన్‌బాబుగారితో నేను నటించిన మొదటి చిత్రం 'మనుషులు మారాలి'. వారితో నటించిన ఆఖరి చిత్రం 'ఏవండీ ఆవిడ వచ్చింది'. వారితో నా చిత్రాలన్నీ హిట్. ప్రేక్షకుల హృదయాల్లో నాకు మంచి స్థానం లభించింది. 'తులాభారం' అనే మలయాళ చిత్రాన్ని 'మనుషులు మారాలి' అని తెలుగులో రీమేక్ చేశారు. దర్శకుడు వి.మధు సూదనరావు. కె.వి.మహదేవన్ అద్భుత స్వరకల్ప నలో కాంచన, హరనాథ్‌లపై చిత్రించిన, తూరుపు సింధూరపు మందారపు వన్నెలలో ఉదయరాగం హృదయగానం...అనే పాట ఆ రోజుల్లో ప్రతినోటా వినవచ్చేది. హిందీలో కూడా మధుసూదనరావు గారే దీన్ని 'సమాజ్‌కో బదల్ డాలో' అని తీశారు. ఇందులో అజయ్‌సహాని, ప్రాణ్, ప్రేమ్‌చోప్రా, కాంచన, అరుణా ఇరాని నటించారు. విజయ వంతమైన చిత్రం. ఈ మూడు భాషల్లోనూ నేనే హీరోయిన్. ఇలాంటి అదృష్టం అందరికీ రాదు. విశేషం ఏమిటంటే ఒకే చిత్రానికి రెండు జాతీయ బహుమతులు రావడం. 16వ నేషనల్ ఫిలిం అవా ర్డ్‌తో పాటు ఉత్తమ నటిగా నాకు నేషనల్ ఫిలిమ్ అవార్డ్ ఫర్ బెస్ట్ ఫీచర్ ఫిలిమ్ లభించింది. మలయాళంలో ఈ చిత్రంలో ప్రేమ్‌నజీర్ నాకు జోడీ.

## ఎన్టీఆర్ అవార్డు

జాతీయస్థాయిలో ప్రతిష్ఠాత్మకమైన ఎన్టీఆర్ నేషనల్ అవార్డు-2010 నాకు లభించింది. బొబ్బిలి బ్రహ్మన్న (1984)లో నటనకు నంది అవార్డు, కళాకారులకు ఇచ్చే 1997 సౌత్ లైఫ్ టైమ్ ఎచీవ్ మెంట్ ఫిలిమ్‌ఫేర్ అవార్డు, ఇవికాక అనేక సంస్థలు నుండి వందల అవార్డులు అందుకున్నాను.

## మూడుసార్లు ఊర్వశి అవార్డు

అప్పట్లో కేంద్ర ప్రభుత్వం ప్రత్యేకించి ఉత్తమ నటీమణులకు జాతీయస్థాయిలో ఇచ్చే ఫిలిమ్ అవార్డు పేరు ఊర్వశి. 1968, 1972 సంవత్సరాల్లో




తులాభారం, స్వయంవరం మలయాళ చిత్రాలకు, 1977లో 'నిమజ్జనం' తెలుగు చిత్రానికి ఈ అవార్డులు నాకు వచ్చాయి. ఇలా మూడుసార్లు ఈ అవార్డు లభించడం నిజంగా గర్వకారణం. ఈ ఊర్వశి అవార్డు పేరును తర్వాతి కాలంలో రజత్‌కమల్‌గా మార్పు చేశారు. 1972లో త్రివేణి, తార అనే రెండు మలయాళ సినిమాలకు కేరళ ప్రభుత్వ ఉత్తమ నటి అవార్డు, సమాజ్‌కో బదల్ డాలో హిందీ చిత్రానికి బెంగాల్ ఫిలిమ్ జర్నలిస్ట్ అసోసియేషన్ అవార్డు లభించాయి.

### ఆనాటి సినిమాలు

పాతకాలం సినిమాలన్నీ మంచిని ఎక్స్‌పోజ్ చేసేవి. ఉమ్మడి కుటుంబాలకు ప్రాముఖ్యాన్ని ఇచ్చిన చక్కటి చిత్రాలు. వీటితోపాటు పౌరాణిక, జానపద, చారిత్రాత్మక చిత్రాలు విపరీతంగా వచ్చేవి. మరిప్పుడు ఎలాంటి చిత్రాలొస్తున్నాయో ప్రేక్షకులకు బాగా తెలుసు.

### కారణం ఎవరు?

లవకుశ, పాండవ వనవాసం, సంపూర్ణ రామాయణం, సీతారామకల్యాణం, మాయాబజార్, పాతాళభైరవి, బొబ్బిలియుద్ధం, పల్నాటి యుద్ధం, బబ్రువాహన, మురళీకృష్ణ, పూజాఫలం, రక్తసంబంధంతోపాటు బలిపీఠం, మనుషులు మారాలి, కార్తీకదీపం, శ్రీమతి లాంటి అద్భుత చిత్రాలు ఈనాడు ఎందుకు రావడం లేదు? దానికి కారణం ప్రేక్షకులా? డైరెక్టర్లా? వాళ్ళు చూస్తున్నారు, మేం తీస్తున్నాం అంటారు దర్శకులు. వాళ్ళు తీస్తున్నారు మేం చూస్తున్నాం అంటారు ప్రేక్షకులు. మాకు డబ్బు వస్తోంది నటిస్తున్నాం అంటారు నటులు. ప్రయోజనాత్మకమైన చిత్రాలు మచ్చుకి ఏ రెండో ఒకటో వస్తున్నాయి. మిగతావన్నీ ఎంతవరకు ప్రేక్షకులకు ఉపయోగపడుతున్నాయన్నది మీమాంసే!

### 10 శాతం కూడా పనికిరావు

ఇప్పుడు వస్తున్న సినిమాలు సొసైటీకి, యువతకు పది శాతం కూడా పనికిరానివి వస్తున్నాయి. ఏ సినిమా తీసినా క్రైమ్ బేస్‌తో తీస్తున్నారు. యువతమీద ఇవి ఎలాంటి ప్రభావం చూపిస్తాయో అర్థం చేసుకోకుండా నిర్మిస్తున్నారు. వీటివల్ల డబ్బు వస్తుంది. కానీ ఏ పాపం పుణ్యం తెలియని స్త్రీలలో కూడా మార్పులు వస్తాయి. వాళ్ళ పతనానికి ఇలాంటి క్రైమ్ చిత్రాలు దారి చూపిస్తూ ఉంటాయి. కనుక సాధ్యమైనంతవరకు సొసైటీకి ఉపయోగపడేలా యువతకు ఆదర్శంగా ఉండేలా, కుటుంబ సమేతంగా చూసేలా సినిమాలు నిర్మించాలేగానీ, వక్రమార్గంలోకి పయనించేలా ఉండకూడదు.

### యువతలో మార్పు తెచ్చే చిత్రాలు నిర్మించాలి

ఒకప్పుడు యువతరం ఉత్తరాలు రాసుకోవడం, పుస్తకాలు చదువుకోవడంతో కాలం గడుపుతూ ఉండేది. కానీ ఆ రోజులు పోయాయి. ఈనాటి యంగ్ జనరేషన్ పురాణాలు, పురాణేతిహాసాల్ని అస్సలు పట్టించుకోవడం లేదు. పాశ్చాత్య ప్రభావం ముసుగులో కొట్టుమిట్టాడుతూ ఫేస్‌బుక్, వాట్సాప్ అప్రస్తుత చాటింగ్‌లతో పనికిమాలిన ఎస్సెమ్మెస్సులతో కాలం గడుపుతున్నారు. అలాగని నేను అందర్నీ దుయ్యబట్టలేను. ఒకసారి ఈ నాటి యువతరం ఆత్మవిమర్శ చేసుకోవాలి. అప్పుడు వారికే తెలుస్తుంది.

ఈనాటి కాలేజీల్లో సెల్‌ఫోన్లు లేకుండా విద్యార్థులు ఎవరూ ఉండటం లేదు. రోడ్డు క్రాస్ చేసే సమయంలో కూడా ఫోన్ మాట్లాడుతూ, చాటింగులు చేస్తూ మైమరచిపోయి యాక్సిడెంట్లకు గురవుతున్నారు. అలా ప్రవర్తిస్తున్న యువతకు నా మాటలు వర్తిస్తాయి. అలాంటి పిల్లల్ని తల్లిదండ్రులు కూడా ఓ కంట కనిపెడుతూ ఉండాలి. అలాంటి వారిలో మార్పు రావాలి. ఆ మార్పు రావాలంటే, ప్రయోజనాత్మకమైన, మంచి చిత్రాలు రావాలి. యువతరంలో మార్పు తీసుకువచ్చే చిత్రాలు రావాల్సిన అవసరం ఉంది. అలాంటి చిత్రాల నిర్మాణానికి దర్శకులు ప్రయత్నించాలి. ప్రేక్షకులు అలాంటి చిత్రాల్ని ఆదరిస్తే డైరెక్టర్లు మంచి చిత్రాలు నిర్మించడానికి పూనుకుంటారు. ప్రేక్షకుల్లో మార్పు వస్తే తప్పక దర్శకుల్లో మార్పు వస్తుంది. ముఖ్యంగా యువ దర్శకుల్ని ఇదే కోరుకుంటున్నాను.

### ఈ దేశంలో పుట్టడమే గొప్ప

నిజంగా ఈ దేశంలో పుట్టడమే ఓ గొప్ప అదృష్టం. నిజానికి మనకు తెలిసినది ఆవగింజంత. తెలుసుకోవాల్సింది కొండంత. ఈ దేశానికి ఉన్న చరిత్ర అంతా ఇంతా కాదు, నేటి బిజీ మనిషి వీటన్నింటినీ కోల్పోతున్నాడు. కేవలం డబ్బే ప్రధానంగా భావించి బంగారులోకం కావాలని వెతుక్కుంటూ పోతున్నాంగానీ, మన దేశ గొప్ప చరిత్రను విస్మరించి మనం భవిష్యత్తును పాడుచేసుకుంటున్నామనిపిస్తుంది. ఈ విషయాన్ని ప్రతి ఒక్కరూ సీరియస్‌గా ఆలోచించాలి. సీరియస్‌గా తీసుకోవాలి. విలువైన కాలాన్ని వృథా చేయవద్దు, ఉపోద్ఘాతాలిస్తున్నానని అనుకోకండి, పాఠకులు, సినీ ప్రేక్షకులు అర్థం చేసుకుంటారనుకుంటాను.

### ఎం.పి అవకాశం సద్వినియోగం

ఈ విశాల భారతదేశంలో నేను ఒక వ్యక్తిని మాత్రమే. అన్ని భాషలనూ, అన్ని కులాలనూ నేను గౌరవిస్తాను. ఆనాడు ఆర్టిస్టులకు ప్రత్యేక గౌరవం ఉండేది. అలాంటి గౌరవమే నేను రాజకీయాల్లో ఉన్నప్పుడు కూడా ఉండేది. ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడుగారు ఆనాడు తెనాలి పార్లమెంటు సభ్యురాలుగా నాకిచ్చిన అవకాశం సద్వినియోగం చేశాను. ఎం.పీగా మురికివాడలన్నీ తిరిగి ఎంతో మందికి ఎన్నో రకాలుగా సహాయం చేశాను. ప్రజా ప్రతినిధిగా నా వంతు కర్తవ్యం పరిపూర్ణంగా నిర్వర్తించాను. మన సహాయం నిజంగా ఎవరికి అవసరమో వారికి తప్పకుండా సక్రమంగా చేస్తే మన మహానాయకులు కన్న కలలన్నీ నిజమవుతాయి.



## ఎన్టీఆర్ ఆశీర్వాదం

ఎన్నికల ప్రచార సమయంలో మా ఇంట్లో మా అమ్మాయి పెళ్ళికి పిలవడానికి రామారావుగారి ఇంటికి వెళ్ళాను. శారదా నువ్వు నటీమణి స్థాయి నుండి రాజకీయంగా కూడా రాణిస్తావని అనుకోలేదు. నువ్వు తప్పకుండా గెలుస్తావు, ప్రజలు నీ వల్ల ఎంతో అభివృద్ధి చెందుతారు, మీ తెనాలి బాగుపడుతుంది, అనుకున్నదానికంటే ఎక్కువ సాధించావని ఎన్టీఆర్ ఆశీర్వదించారు. వారు చెప్పినట్టే నేను తెనాలి లోక్‌సభ నియోజకవర్గం నుండి గెలుపొందాను. ఆయన ఆశీర్వాదం చాలా గొప్పది. అంతటి మహానటుడు, రాజకీయనాయకుడు మన మధ్య లేకపోవడం ఎంతో బాధగా ఉంటుంది.

## కుటుంబం

నా భర్త పేరు చలం (డైవోర్స్). శారదా పిక్చర్స్ పంపిణీదారు, జ్యోతి పిక్చర్స్ ప్రొడ్యూసర్ నారాయణరావుగారి కొడుకు శేఖర్‌బాబుగారు నాకు వియ్యంకుడు అవుతాడని నేను ఎన్నడూ ఊహించలేదు. శేఖర్‌బాబుగారి కొడుకు కృష్ణకిషోర్‌కి మా అమ్మాయిని ఇచ్చాను. అదేవిధంగా పరుచూరి బ్రదర్స్ స్వంత బ్రదర్స్ కంటే ఎక్కువగా సన్నిహితంగా ఉంటూ మా ఫ్యామిలీతో ఎటాచ్‌మెంట్‌తో ఉన్నారు. అన్ని విషయాల్లో మా బాగోగులు చూసుకుంటూ ఉండేవారు. వారిని నా జీవితంలో నేను ఎన్నడూ మరిచిపోలేను.

## జీవుల్ని చంపే హక్కెక్కడిది?

హైదరాబాద్ - గుల్బర్గా మధ్య దారిలో యానగొంజె ఒక క్షేత్రం. అక్కడ మాణిక్యేశ్వరీదేవి తల్లి దర్శనభాగ్యం నాకు లభించింది. ఆవిడ బోధించిన తత్వం వింటే నాకు ఆశ్చర్యం కలిగింది. జీవహింస మహా పాపం. ఒక్క గోవధే కాదు, ఏ జంతువుల్నీ తినకుండా ఈ భూమ్మీద మనం బతకలేమా? కనిపెంచిన వారు చనిపోతే ఆ శరీరాన్ని శవం అంటాం, వాటిని తాకితే మైల అంటాం. నీ తల్లి చనిపోతే నీకు మైలా? మరి ఒక జీవిని చంపి లొట్టలు వేసుకుంటూ తింటున్నావు అది మైల కాదా? అని ఆమె ప్రశ్నించింది. నేను ప్యూర్ వెజిటేరియన్‌ని. మిగిలిన వారిని నాన్ వెజ్ తినొద్దని అనను. శాఖాహారమే మంచిదని డాక్టర్లు సలహా ఇస్తున్నారు. మాంసాహారం వల్ల జీర్ణాశయం దెబ్బతింటుందని సర్వేల్లో నిర్ధారిస్తున్నారు. శాఖాహారం వల్ల హాస్పిటల్ ఖర్చు తగ్గుతుంది.

## చెట్లు నరికి అపార్టుమెంట్లా?

చెట్లు నరికి అపార్ట్‌మెంట్లు కడుతున్నాం. అందుకే వర్షాలు పడటం లేదు. వాతావరణ కాలుష్యాన్ని నివారించే చెట్లను మన స్వార్థం కోసం నరకడం ఎంతవరకు సబబు? మనకో అందమైన భవంతి, కారు పార్కింగ్ ఉండాలి గానీ, చెట్టు మాత్రం వద్దా? ప్రతి పౌరుడూ మొక్కలు పెంచాలి. రోడ్డు పక్క నుంచి మొక్కల్ని తొలగించే ప్రయత్నం చేయకూడదు. ఒక చెట్టు కూలిపోతే అదే స్థానంలో మరో చెట్టు తెచ్చి నాటాలి. నేను అదే పనిచేస్తాను. ఇంటి పరిసరాలు కూడా పచ్చగా కళకళలాడేలా మనం తీర్చిదిద్దుకోవాలి. ప్రతివిషయానికీ ప్రభుత్వంపై ఆధారపడకూడదు. ప్రతి ఇంట్లో కారు ఉంటుంది. మంచిదే. మరి పొల్యూషన్ మాటేమిటి?

## ఆకు భోజనం

నాటి సంప్రదాయాల్ని నేనెంతో గౌరవిస్తాను. నిజానికి ఈ తరం వాళ్ళు చాలా విషయాలను విస్మరిస్తున్నారు. దానివల్ల మనం చాలా కోల్పోతున్నాం. భోజనం కంచాల్లో చేస్తాం గానీ సైంటిఫిక్‌గా చూస్తే అరటి ఆకుల్లోగానీ, మోదుగ ఆకులతో చేసిన విస్తరిలో గానీ చేసే భోజనమే ఆరోగ్యానికి మంచిది. వేప, రావిచెట్లు, తులసి మొక్కలు ప్రతి దేవాలయ ప్రాంగణంలో దర్శనమిస్తాయి. వాటి ప్రత్యేకత, పవిత్రతా వేరు. వాటి గాలి ఎంతో ఆరోగ్యదాయకం. అలాంటి స్వచ్ఛమైన గాలిని ఆస్వాదిస్తూ నిష్టతో ఉండేవారు గనుకనే పాతకాలం వారు నూరేళ్ళు ఆరోగ్యంగా బతికారు.

*-కె.హరనాథ్, సెల్: 9703542598*

## నవ్య సుధామ పదగారడి-264

సెల్: 98492 97958

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ✻ | 1 | | 2 | ✻ | 3 | | | 4 |
| 5 | ✻ | ✻ | 6 | | | ✻ | ✻ | |
| | ✻ | ✻ | | ✻ | | 8 ✻ | ✻ | |
| 7 | 8 | | ✻ | 9 | ✻ | 10 | 11 | |
| ✻ | 11 | ✻ | 12 | | | ✻ | | ✻ |
| 13 | | 15 | ✻ | ✻ | ✻ | 14 ✻ | | 15 |
| | ✻ | ✻ | 16 | ✻ | 17 | 19 ✻ | ✻ | |
| ✻ | ✻ | ✻ | 18 | | | ✻ | ✻ | |
| 19 | | | | ✻ | 20 | | | ✻ |

### ఆధారాలు

**అడ్డం**

1. మొదటి నుంచి చివరిదాకా (3)
3. బడి (4)
6. గాలిదైనా కావచ్చు, నీటిదైనా కావచ్చు, బుద్బుదము (3)
7. కుమార్తె (3)
10. ఎల్లప్పుడూ (3)
12. పొగరు (3)
13. భుజించుడు (3)
14. కర్టెన్ (3)
18. బాల్యావస్థలోని వాడు (3)
19. కొందరు ఉన్నతాధికారులు ఈ పర్యటన చేస్తూంటారు తనిఖీలకై (4)
20. అశ్వము (3)

**నిలువు**

2. సంగీతానికి శృతి వాద్యం (3)
3. హిందీలో పిచ్చోడు (3)
4. అత్యల్పం, కొంచెం (4)
5. వివాహానంతర తొలిరేయి (3)
8. తిరుపతి ఆలయానికి వెళ్ళేది భగవంతుడి దీని కొరకే (3)
9. పాము (3)
11. నిద్ర (3)
13. అప్పాజీ (4)
15. దాసీతనం (3)
16. ఒక మహర్షి, నాస్తికవాది (3)
17. ప్రాదము (3)

### పదగారడి-263 సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 పా | వు | 2 రం | ● | 3 మా | 4 వి | ● | 5 కొం | 6 ప |
| తి | ● | 7 కు | 8 ల | సం | ఘా | లు | ● | సి |
| 9 క | 10 ల | ● | త | ● | త | ● | 11 స | డి |
| ● | 12 వె | న్నె | ● | 13 ఆ | ము | ద | ము | ● |
| 14 జా | ణ | ● | ● | మ | ● | ● | 15 ద్ర | ష్ట |
| ● | 16 రా | జ | 17 ధా | ని | ● | 18 ఆ | యా | ● |
| 19 బూ | జు | ● | రు | ● | 20 బి | ● | 21 సం | 22 మే |
| డి | ● | 23 మ | ణి | 24 వ | కా | డు | ● | గి |
| 25 దే | గ్గ | ర | ● | 26 దా | రి | ● | 27 శు | భం |

Printed and Published by **VEMURI RADHAKRISHNA,** Managing Director, on behalf of Aamoda Publications Pvt. Ltd., Plot No.76, Aswani Layout, Huda Heights, Jubilee Hills, Hyderabad-500 033. Ph.(040) 23558233/44, Fax No.23558288. Printed at Aamoda Press, R.S.No.191/3, Ward No.43, Donka Road, Patamata, Vijayawada 520 010, Reg.No.: APTEL/2004/12594. Editor: **A.N.JAGANNADHA SARMA**

